# Miscellaneous Writings

OF

KUCHI NARASIMHAM.

FIRST EDITION.





*Printed at the Sri Krishna Press. Pithapuram.*

1939.

 (Price- One Rupee.

ఓమ్

శ్రీరామా!

# పీ ఠి క.

ఇందు, వివిధవిషయములఁగూర్చి నే నప్పుడప్పుడు వ్రాసినవ్యాసాదులు, పదిశీర్షకములతోఁ బ్రకటింపఁబడియున్నవి. అందు నాలుగు పద్యరూపమునను దక్కినఆఱును గద్యరూపమునను నున్నవి. దాదాపుగా నన్నియును ఎప్పటికప్పు డేదోయొక తెలుఁగుపత్త్రికలో ఇతఃపూర్వము ప్రకటితములై యున్నవియే. అవన్నియుఁ గలిపి యేకపుస్తకముగా “నానావిషయకవిరచనములు—Miscellaneous Writings” అనుపేరితో నిప్పుడచ్చొత్తించితిని. విషయాదివివరణము లీక్రిందిపట్టికలోఁ జూపఁబడినవి.

| వరుస సంఖ్య. | విషయము. | ఏపత్త్రికనుండి పునర్ముద్రితము?—ఇతరవివరణము. |
|---|---|---|
| ౧ | ఆశీర్వచనపద్యములు | “సమదర్శిని” వార్షికపుసంచిక. |
| ౨ | గ్రంథవిభాగములు—గ్రంథవిమర్శతత్త్వము | ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక. |
| ౩ | పాఠశాలలలోని తెలుఁగు. | ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక—2-9-1922 తేదీని పిఠాపురములో ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవ సమయమునఁ జదువఁబడినది. |
| ౪ | నానీడ | ఆంగ్లీకృతములైన రెండాంగ్ల ఖండకావ్యములు. |
| ౫ | మాతృచొక్కా | ఆంగ్లీకృతములైన రెండాంగ్ల ఖండకావ్యములు. |
| ౬ | జీవపరిదేవనము | గృహలక్ష్మి |
| ౭ | కాలమహిమ | ఆంధ్రవిద్యార్థి |

| వరుస సంఖ్య. | విషయము. | ఏపత్త్రికనుండి పునర్ముద్రితము?— ఇతరవివరణము. |
|---|---|---|
| ౮ | శ్లోకత్రయము | తెలుఁగుప్రేమప్రచారక్. |
| ౯ | అస్పృశ్యత | భారతి |
| ౧౦ | గురుశిష్యసంవాదములు | |
| | I | భారతి. |
| | II 1, 2, 3, 4, 5, 6, 7 & 8 | భారతి. |
| | III | గృహలక్ష్మి. |
| | IV 1 | సత్యవాణి. |
| | IV 2, 3 & 4 | ఆంధ్రవిద్యార్థి. |
| | IV 5 | ఆంధ్రభూమి. |

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు!

పిఠాపురము.
1—2—1939.

కూచి నరసింహము.

ఓమ్.

శ్రీరామా.

# నానావిషయక విరచనములు.

## ౧ ఆ శీ ర్వ చ న ప ద్య ము లు.

ఉ. శ్రీలకు మూలమౌ కలిమిచేడియ నక్కునఁదాల్చుచు న్జగ
జ్జాలము జాగరూకతను సాఁకుచుఁ ద న్భజియించువారి కే
వేళను దోడునీడయయి వీడని శ్రీహరి సర్వసద్గుణో
త్తాలుఁ డొసంగుఁగాత సమదర్శిని కభ్యుదయాభివృద్ధులన్ !

క. కమలాపతి సత్కృపచేఁ, బ్రమోదశుభనామకలితవత్సరము సదా
సమదర్శినీసమాఖ్య, న్బ్రమోదభరితాత్మగా నొనర్చుంగాతన్ !

క. సమదర్శిని దేశక్షే, మమునే కాంక్షించి సమత మదినిల్పుచు లో,
కములోపల సార్థకనా, మముతో మనుఁగాక కీర్తి మహిమాన్వితమై!

సీ. న్యూనాతిరిక్త దోషోపేతకథనము, ద్రోసుండఁజూచు జాగ్రత్తతోడ
వేయివచ్చినసరె వేయిపోయినసరే, యనృతంబులాడ నన్వారముతోడ
వలసిన నర్పింతుఁ బ్రాణంబులేని య, న్బ్రబలనిర్మలదేశభక్తితోడఁ
బరులలోపంబులు ప్రకటించుపట్టున, మంజుభాషణవినమ్రతలతోడ

గీ. స్వసుఖమరయని పరహితపరతతోడఁ
జాఁగవలెఁ బత్త్రికలు; గాన సరిగ నట్లె
నీవు వర్తించి సమదర్శినీ! స్వదేశ
పత్త్రికావర్గమున కొజ్జబంతి వగుము!

సీ. ఉరుతమస్సుప్తిలో నున్నారు మేల్కాంచి
సాత్త్వికులై క్రియ ల్సల్పుఁడనుచు
నైకమత్యముబల, మన్యోన్యవైరంబు
దౌర్బల్య, మంచెదఁ దలఁపుఁ డనుచు
భోగంబుకంటెను ద్యాగమెక్కువ, యది
యిట నట సౌఖ్యంబు నిచ్చునంచు
ముందువారలసుఖంబు నొకింత చూడక
బ్రతికి చచ్చెడువారు పశువులంచు
గీ. లేమిఁ బడియున్న దేశంబు లేవనెత్తి
తల్లిఋణమును దీర్పని తనయుఁ, డామె
కడుపుచేటంచు మోమాటపడక నీవు
గట్టిగా మనవారికిఁ గఱపు మమ్మ!
సీ. విద్యఁ బామరులకు వెలఁదుల కిడుఁ, డింక
వారిపాటులు వారె పడుదురంచు
నొడలి కంగంబులయోజఁ బ్రజాసంఘ
మునకు వర్ణంబులుఁ బొనరునంచు
నొకయంగమున కగు నొ గంగముల నెల్లఁ
బట్టి బాధించి కీడ్పఱుచు నంచు
గుణకర్మములవచ్చు గొప్పతనమునకు
జన్మాధికత్వంబు చాలదనుచుఁ
గీ. గోడిపుంజులవలెఁ బోరఁ గూడ దనుచు
భారతాంబ నశోకభూవరునినాఁటి
సుఖదశకుఁ డెండు! తెం! డంచు నఖిలభార
తీయులకు నొక్కొ చక్కఁగాఁ జెప్పు తల్లి!

---

శ్రీరామ.

# ౨. గ్రంథవిభాగములు-గ్రంథవిమర్శతత్త్వము.

## పురాణములు.

విమర్శమునకు మూలాధార మెప్పుడు గ్రంథజాలముగనుకఁ దొలుత నాంధ్రగ్రంథసమితి స్థితినిగూర్చి కొన్నిమాటలు చెప్పవలసియున్నది. తెలుఁగుభాషలో విపులముగ నుండుగ్రంథములు పురాణములు అన్నియు సంస్కృతమునుండి యాంధ్రీకరింపఁబడినవి, మిశ్రకావ్యములని చెప్పుటయేకాని చాలభాగము పద్యాత్మకములు, ఇప్పటికిని బహుజనరంజకములు. వేదశాస్త్రసారమంతయు వానిలోఁ గలదు. కొన్ని యమానుషప్రశ్నలును నతిశయోక్తులును జమత్కారపోషణములుగమాత్ర మెంచి చూచినయెడలఁ, బెక్కురుపూర్వరాజుల చరిత్రములును బూర్వకాల సాంఘికస్థితియు నాచారవ్యవహారములును దెల్లములగును. కాని పెక్కుచోట్ల గోదుమనూకయు నిసుకరేణువులును గలసియున్నట్లు సత్యాసత్యములు విభాగదుష్కరములై యుండును. మొత్తముమీఁద నన్నియు నానావిధ నీతిధర్మబోధకములు, భక్తిజ్ఞానపోషకములు, ధర్మసంశయనివారకములు. అధికజ్ఞాను లగుమనపూర్వుల యైహికాధ్యాత్మికానుభవము లందులో నిమిడియున్నవి. మూలములయందలి భావములఁ గైకొని కుదించియో రసవంతములగుపట్లఁ బెంచియో రచించినగ్రంథములు కాని, మాటకుమాటగఁ జేసిన యాంధ్రీకరణములుగావు. ఇంచుక భాషలోఁ గృషి చేసినయెల్లరకును సుగ్రాహ్యములు. శైలి చాలమట్టునకు స్వాభావికమై, మృదువై, సరళమైనది. భారతమందలి గద్యరచనఁజూచిన, మనస్సున నుదయించినభావము, లప్రయత్నముగ, ధారాళముగ, సులభమగుమాటలతో, వెలువడినట్లు స్పష్టమగుచున్నది.

## చరిత్రలు.

చారిత్రగ్రంథములు మనకిదివఱకు లేవనియే చెప్పవచ్చును. ఇప్పుడిప్పుడు బయలుదేఱుచున్నవి. వలసినన్ని చారిత్రవచనపుస్తకము లాంధ్రవాఙ్మయమున లేనికొఱంత, భగవత్కృపచేఁ గొలఁదికాలములోఁ దీఱఁగలదు.

## ప్రకృతిశాస్త్రపుస్తకములు.

ప్రకృతిశాస్త్రపరిచయము మనపూర్వులకుఁ దక్కువ యనుకొనెదను. కావునఁ దద్విషయకగ్రంథములు మాతృభాషయగు సంస్కృతము లోనే కడుఁ గొలఁదిగ నున్నవి. అట్టిచోఁ దెలుఁగులో నెట్లుండును? ఆంగ్లేయభాషావిశారదు లగుకొందఱు భాషాభిమాను లట్టిగ్రంథములిప్పుడు వ్రాయఁ బ్రారంభించుచున్నారు. వారిప్రయత్నము లెంతయు స్తవనీయములు. కాని యట్టివారి కొక్కమనవి :—

వర్షవర్షమునకుఁ బ్రకృతిశాస్త్రజ్ఞాన మభివృద్ధినొందుచున్నది. పాశ్చాత్యుల బుద్ధిబలముచే నూతనయంత్రాదులు సృజింపఁబడుచున్నవి. ప్రకృతితత్త్వరహస్యములు క్రొత్తక్రొత్తవి బయలువడుచున్నవి. పంచభూతములును పాశ్చాత్యులపంచను బడిగాపులుగఁ బడియున్నవి. స్థూలసూక్ష్మప్రపంచమంతయు మనోజన్యముకాని మఱియొండుకాదను వేదాంతవాక్యమును, బ్రకృతిశాస్త్రజ్ఞులు ముందుముందు పాఠశాలలలో బాలురకుఁ జిత్రముగ, వాయుద్వయసమ్మేళనమున నుదకమగునని యిప్పుడు చూపించుచున్నట్లు, ప్రత్యక్షముగఁ జూపింతురేమో యనునాశయుఁ జూచుకుతూహలమును బలమగుచున్నవి. అత్యద్భుతమై మహోపయోగకర మగునీజ్ఞానము మనవారి కలవడఁజేయుట విద్యావంతుల విధియై యున్నది. అట్టి లోకోపకారకకృత్యమును నెఱవేర్పఁ బూనుకొన్న మహానుభావులు గ్రంథములువ్రాయుటలోఁ గడుజాగ్రత్తతో నుండవలయును. పరిభాషాపదముల బాగుగవిమర్శించి మఱి యేర్పఱిచికొనవలయును.

వాడుకలో నున్న తెలుఁగుమాటలుగాని సంస్కృతపుమాటలుగాని పూర్వగ్రంథస్థపదములుగాని దొరకిన సరియే; లేనిచో గల్పితపదములు, సులభములుగను దేశేతరభాగగ్రాహ్యములుగను నుండవలెను. ఇది యసాధ్యమైనయెడల నన్యదేశ్యములుపయోగించుట యసాంప్రదాయము కాదుగనుక ఇంగ్లిషుపదములనే విభక్తిప్రత్యయములఁ జేర్చి వాడుట మంచిదని నాయభిప్రాయము. లోకములోఁ బెక్కురు ప్రస్తుతము వాడు కొను యంత్రాదినామములును గ్రంథములలో నుపయోగింపఁబడునవి యు నించుమించుగ నొక్కటై యుండుట గ్రంథపఠనమునకుఁ జాల సహ కారిగ నుండును. మన పరిషత్పత్త్రికలో నట్టిపదపట్టిక యొకటి ప్రకటించు చున్నారు. వానికంటెమంచివి యెవరికేని స్ఫురించినయెడల వారు వానిఁ దత్పత్త్రికకంపి పత్త్రికాధిపతుల కీదేశోపకారకృత్యమందుఁ దోడ్పడ వచ్చును.

ఇట్టిగ్రంథములలోనిభాష తేటతెల్లముగ నుండవలయును సందే హాపరిహారార్థము విసంధు లుపయోగింపక తప్పనియెడల నుపయోగింప వలసినదనియే నాయభిప్రాయము. కొందఱుమిత్త్రులనునట్లుగాక, వ్యాకర ణవిరుద్ధము లగురూపములు సర్వథా పరిత్యజింపవలయును. వ్రాయువాని శక్తిశ్రద్ధల ననుసరించి యర్థసౌలభ్య ముండునుగాని, యది బహుముఖ మై నియమశూన్యమైన వ్యావహారికభాష ప్రయోగించినమాత్రమున లభింపదు. వ్యాకరణ మొంతమాత్రము నర్థమై శద్యమున కడ్డురాదని త్రిక రణశుద్ధిగఁ జెప్పఁగలను. అలవాటు పోవుటనో, యాంగ్లేయభాషాపరిశ్ర మ మాంధ్రభాషాపరిశ్రమముకంటె బలవత్తరమగుటనో, యాంగ్లేయభా షయం దభిమానము మనభాషయందుకంటె నెక్కువగుటచేతనో, ధన గౌరవము లెక్కువగుటచేతనో, పరస్పరసంభాషణములలోను ఉత్తరప్ర త్యుత్తరములలోను ఆంగ్లేయభాషయే సదా వాడుకొనుటచేతనో, మఱి యేకారణముచేతనో, చాలమందికిఁ గలముపట్టి వ్రాయునప్పుడు తెలుఁగు

పదములకంటె నింగ్లీషుపదములు ముందు స్ఫురించుటయేకాక, వాక్యము నకు వాక్యమే మనఃఫలకమున నింగ్లిషుభాషలో నుత్పన్నమయి తెలుఁగు భాష బుఱ్ఱలోఁ దూఱుటకు సందీయకున్నది. అది శ్రమపడి శ్రమపడి తెలుఁగుభాషలోనికిఁ దీసికొనివచ్చి ముద్రించిన, నక్షరములు తెలుఁగువే కాని యెంతకొట్టుకొన్నను వినువానికిఁ జదువువానికి నర్థము గోచరము కాదు. ఇట్టివ్రాఁతలు నేఁ గొన్ని చూచినాను, చూచి చింతిల్లినాను. జాతీయ భాషీయప్రకృతికిని జిరకాల భాషాసంప్రదాయములకును భిన్నములైనప్రయోగములును మాటలకూర్పును దురవగాహములై హాస్యాస్పదములుగ నుండును. అట్టివి భాషాపతనసూచకములుగాని యభివృద్ధిలక్షణములు గావని విన్నవించుకొనుచున్నాను. ఇంగ్లిషు రానిపండితులయెదుటఁగాని మఱియొక తెలుఁగువానియెదుటఁ గాని యట్టివాక్యము చదివి చూచినయెడల నేఁ జెప్పినదానిసత్యము బయలుపడఁగలదు. ఇట్టి యనర్థమునకు మం దొకటే పొడకట్టుచున్నది. ఏది? భాషోత్పత్తి యింగ్లిషులోఁగాక తెలుఁగులో నగునట్లుచేసికొనుట. అది యెట్లుసిద్ధించును? విద్యార్థ్యవస్థలోఁ గేవలపరీక్షోత్తరణమునకై చేసినకృషితోఁ గృతార్థుల మైతిమని యూరకుండక యాంగ్లేయభాషాపరిశ్రమములో సహస్రాంశమైనను మాతృభాషాపరిచయమునకై వినియోగపఱుచుట.

(ఆఖ్యాయికలు) నవలలు. (Novels)

"నవల" లనఁబడు నాఖ్యాయికలుగాని విపులములైన కల్పితకథలుగాని యేతత్పూర్వము మనయాంధ్రభాషలో లేవు. వచన గ్రంథములే యంతగ లేవు. ఇప్పుడు కొందఱు భాషాభిమానులట్టిగ్రంథములు వ్రాయుచున్నారు. ఇంగ్లిషునవలల నాదర్శములుగఁ గైకొని మన భాషలోఁగూడ నట్టివి వ్రాసినయెడల జనసామాన్యోపయుక్తము లగు గ్రంథములు పెక్కులుండును. కేవలాహ్లాదకరములైనవియే కాక నీతిప్రదములును బ్రపంచానుభవదాయకములు నగునవలలుగూడ వ్రాయ

వచ్చును. ప్రత్యేకశాస్త్రగ్రంథరూపమున నేర్పనగువిషయములును జేయఁ
దగుబోధనములును నవలలద్వారమున నతిమనోహరముగ నతిసుకరముగఁ
గఱపవచ్చును, జేయవచ్చును. నవలలవ్రాయనేర్పు మనవారిలోఁ జాల
మంది కింక నలవడలేదని నాయభిప్రాయము. కాని యట్టిజాతిగ్రంథములు
వ్రాయుటకు మొన్నమొన్ననే ప్రారంభించిరి. కనుకఁ, గాలక్రమమున
నింగ్లీషునవలలవంటినవలలు మనభాషలోఁగూడ బయలుదేఱునని యను
కొనవచ్చును. వర్ణనరూపములనుఁ గథాపురుషులఁ గన్నులఁగట్టినట్లుచేయు
ట, కథ నల్లిబిల్లిగనల్లి చదువువారిమనసులను బుస్తకమునందే లగ్నమగు
నట్లు చేయుట, యామావోట్ల రసవంతములును స్వాభావికములు నగు
పరస్పరసంభాషణములచేఁ గథాపాత్రములత్రోఁగూడఁ బాఠకుల నవ్వించి,
యేడిపించి, క్రోధగ్రస్తులఁజేసి, హృదయములందు నానావిధరసోల్బణత
గావించుట, కవిచెప్పకయే యన్యోన్యసంభాషణరూపములనుఁ బాత్రలస్వ
భావములను వ్యక్తీకరించుట, యిట్టివి నవలలయొక్క ప్రశస్తగుణములు.
ఈలక్షణము లెంత యెక్కువగాఁబట్టిన నవల యంతమంచిదిగ మనోజ్ఞ
ముగ నుండును.

## నాటకములు.

ఇప్పుడు బయలువెడలు గ్రంథములలో నాటకము లతిసంఖ్యాక
ములుగ నున్నవి. వానిలో నెన్ని శాశ్వతములుగ నుండునో యెన్ని యి
సుల్లయుసులుతో నశించునో చెప్పఁజాలము. పూర్వసంస్కృతకవులు కే
వల కావ్యరచనాంతమున నాటకములు వ్రాసినట్లు చెప్పుదురు. అనఁగఁ
బ్రపంచానుభవము పరిపక్వమైనప్పుడు వ్రాసిరన్నమాట. రసవత్కావ్య
రచనకంటె సరసనాటకరచన కష్టతరమన్నమాట. కష్టసుఖములనెంచక కే
వల నాటకరచనాభిలాషప్రేరితులై యత్యల్పలౌకికానుభవముతోఁ గొం
దఱు వానిని వ్రాయుచున్నట్లు కన్పట్టుచున్నది. ఉద్యమము శ్లాఘనీయమే
కాని ఫలము సంశయాస్పదము. మనోహరమగుకథ, పాత్రప్రసంగసంద

ర్భము, ప్రశ్నోత్తరముల యన్యోన్యాకాంక్ష, యవి చప్పగనుండకుండ, రసోత్పాదకములై ధ్వనించుట, యట్లయ్యు నుద్దిష్టకథాప్రవాహమున కవి దూరముగనుండక పొసఁగియుండుట, యాయా స్త్రీపురుషుల స్థితిగతులకు నవస్థలకు నుచితములగుమాటలుగలసంభాషణము, ఏకపాత్రము నోటఁ దగినకారణములేకుండ భిన్నస్వభావప్రకటనములగు ప్రసంగములు వెలువడకుండుట, చెప్పనికథాభాగములు చెప్పినవానివలన గోచరించుట, రససాంకర్యము లేకుండుట, యేరసమైన నతిమాత్రముగ వర్ణింపఁబడకుండుట, మోటులై జుగుప్సాకరములై కేవల పామరరంజకము లగుహాస్య వచనములుగాక సరసములగునర్మాలాపములుపాత్రోక్తులయందచ్చటచ్చట నుపయోగిపడుట, యమితముగ నస్వాభావికముగ లాగి తీసికొనివచ్చినట్లు కనఁబడని సరళమగునుపమాద్యలంకారములతో భావప్రకటనము గావించుట, యింకను గేవలానుభవనీయములగు "షేక్స్పియర్కాళిదాసుల" నాటకములలోని యితరమనోజ్ఞలక్షణములు—ఇవి యుత్తమనాటకలక్షణములు. బాహ్యాంతర జగన్నాటకమునకుఁ బ్రతిబింబమైననాటకమే నాటకము. అదియే శాశ్వతముగ నిలుచునది. అట్టినాటకములు రచించిన వారే మహానుభావులు, మృతజీవులు. ఇన్నిలక్షణము లేనాటకమునందైనఁ గలవాయని ప్రశ్నింతురేని పైనుదాహృతమైన గుణసముదాయమును మేలుబంతిగఁ బెట్టుకొని చూచి, దాని నెంతయనుకరించిన నాటక మంత శ్లాఘాపాత్రమని చెప్పవలయును, ఎంతదూరమైన నంతరసహీనమని చెప్పవలసివచ్చును. కావున నాటకగ్రంథరచనాకౌతుకు లగుమిత్రులు తల్లక్షణముల నెప్పుడు మనస్సునం దుంచుకొనఁ బ్రార్థితులు. నాటకములఁగూర్చి చర్చింపఁబడువిషయము మఱియొకటి గలదు. దుఃఖాంతము లగునాటకము లుండవచ్చునా ? దుర్మార్గులకు జయాదిసుఖసంపదయుఁ బుణ్యపురుషులకుఁ గష్టపరంపరయుఁ గలిగినట్లు వర్ణింపవచ్చునా ? యనుప్రశ్నములు తఱచు వినుచున్నాము. నాటకలక్షణగ్రంథములలో నేమి చెప్పఁ

బడియుండెనో నేనెఱుఁగను, గాని ప్రకృతికి భిన్నములగురచనలు కృత్రిమములనియు నవి యుద్దిష్టఫలము నీయఁజాలవనియు నాయభిప్రాయము. సృష్టిలో యోగ్యత యన్నిపట్లను ఇహలోకసుఖప్రదముగను బాపకృత్యములు కష్టదాయకములుగను గాన్పించుటలేదు. సృష్టిలో నేది యెట్లుండునో, కవిబ్రహ్మసృష్టి యగుగ్రంథములోను నట్లుండుటయే సమంజసముగను హృదయంగమముగను నుండునని తలఁచెదను. ఇట్టి సర్వదేశ సర్వభాషాసమ్మత మగుధర్మము నవలంబించుటకై ప్రాచీనలక్షణగ్రంథశాసనము లొకించుక యుల్లంఘించుట యంతదోషముగాదని సాహసించి చెప్పుచున్నాను.

నిఘంటువులు.

మఱియొకతరగతిపుస్తకములు Reference books అనియింగ్లిషులో వాడుకొనఁబడు ప్రమాణనిర్దేశగ్రంథములు. ఇట్టివి సంస్కృతములోను దెలుఁగులోను గొన్ని యున్నవిగాని, యుండవలసినన్ని లేవు. ఉన్నవియైన నుండవలసినట్లు లేవు. భాషామర్యాదలు ప్రజలు మీఱకుండుటకును, గ్రంథస్థవిషయములు నిస్సందేహముగఁ దెలిసికొనుటకు నిట్టిప్రమాణాదర్శగ్రంథము లత్యావశ్యకములు. ఉన్నవి సవరించి వానికిఁ గొన్నికలిపి వివరణపట్టికలుచేర్చి యీవాఙ్మయభాగము నభివృద్ధిపఱిచి పూర్వగ్రంథపఠనము సులభము చేయవలెను. ఆంధ్రభాషకు సంస్కృతము తల్లి. ఉచితమైనసంస్కృతజ్ఞానము లేనియెడలఁ దెలుఁగుగ్రంథములన్నియు బాగుగఁ దెలిసికొనఁజాలము, తిన్నగఁ దెలుఁగు వ్రాయలేము. కావున నాంధ్రభాషాపాండిత్యమునకుఁ గొలఁదిగనో గొప్పగనో సంస్కృతభాషాపరిచయ మావశ్యకము. తెలియనిసంస్కృతపదముల కర్థము వ్యుత్పత్తియుఁ దెలిసికొనుటకు "గురుబాలప్రబోధిక" యనుపుస్తకము ముఖ్యసాధనము. కాని యందలి పదసూచనపట్టిక, యసంపూర్ణముగను అక్రమముగను అవిస్పష్టముగను నున్నది. ఆలోపములు పూర్తిచేసి యాగ్రంథము

మరల ముద్రింపించుట మహోపకారకమని యెంచవచ్చును. సలక్షణ మగు తెలుఁగునిఘంటువుచేసి యాంధ్రలోకకృతజ్ఞతానందనము లందఁబోవు నీ యాంధ్రసాహిత్యపరిషత్తువా రీకార్యభారమునుగూడఁ బైనివైచికొనఁ బ్రార్థితులు. ఇంగ్లీషుభాషలో "వెబ్సరు" మొదలగు నిఘంటులవంటి నిఘంటువొక్కటియు మనయాంధ్రభాషలో నిప్పటికిని లేకుండుట యొక పెద్దకొఱఁతయే. ఆకొఱఁత దేవునిదయవలనఁ గొలఁదికాలములో నీపరిషత్తుమూలమునఁ దీఱఁగలదు. కాని వారికీసమయమున నొకచిన్న మనవి చేసికొనియెదను. తొలుత నాంధ్రనిఘంటువుఁ బ్రకటించి పుణ్యముగట్టుకొనిన మహానుభావుఁ డాంధ్రేతరుఁడగు "బ్రౌన్" దొరగారు. సీతారామానుజాచార్యులవా రందలి లోపములను సవరించి పదజాలమును సప్రమాణముగ విపులముచేసి తరువాత నొకనిఘంటువు వ్రాసిరి. అదియే యిప్పు డున్ననిఘంటువులలో నుత్తమమైనదని నాయభిప్రాయము. రాఁబోవు పరిషన్నిఘంటువు దానిలోనిలోపములఁ బోఁగొట్టి యంతకంటెఁ బుష్టమై యెక్కువయుపయోగకరమై యుండవలెను. అందులో వేయమఱచినపదములు వేయవలెను. వానికిఁ దగినప్రమాణము లీయవలెను. తత్సమపదముల నెక్కువచేసి ప్రమాణము లీయవలెను. ఇది యంతదుష్కరముగాదు. "ఆప్తు" ని సంస్కృతనిఘంటువు మఱికొన్నినిఘంటువులును సహకారులు కాఁగలవు. తెలుఁగుగ్రంథములలో వాడుకలేని సంస్కృతపదము లీయనక్కఱలేదు. తఱచుగఁ బాఠకులకుఁ గలుగువ్యాకరణసందేహములు గుఱుతులేర్పఱిచి నివారింపఁ బూనుకొనవలయును. ఔపవిభక్తికానౌపవిభక్తికభేదములు సప్రమాణముగ స్పష్టపఱుపవలయును. విశేష్యవిశేషణక్రియాదిపదములు వచనవిభక్త్యాదులందుఁ బొందువికారములను—గఠినమైనవానిమాత్రమే—యింగ్లీషునిఘంటువులందువలె సులభమార్గముగ సంగ్రహముగ నుటంకింపవలయును. వివిధశాస్త్రపరిభాషాపదములును, గ్రంథస్థములు కాకుండ గ్రంథస్థభాషకుఁగాని వ్యాకరణమునకుఁగాని వ్యతి

రిక్తములుగాకుండ నున్న దేశ్యపదములుగాని యన్య దేశ్యపదములుగాని తద్వికారములుగాని వీలునుబట్టి ప్రత్యేకభాగములుగనో ప్రత్యేకసంజ్ఞల తోనో నిఘంటువులోఁ జేర్చుట కడునుపయోగకరమని తోఁచుచున్నది. నాయభిప్రాయమును రెండుమూఁడుదాహరణములతో స్పష్టపఱుచుట కనుజ్ఞవేఁడెదను. "కెరటము" వేయనక్కఱలేదు. ఎందుచేత? 'కరడము' 'కరడు' అనుగ్రాంథికము లైనరూపము లిదివఱకే యున్నవిగనుక. "గోరింక" వేయనక్కఱలేదు. ఏలయన, నిదివఱకే గ్రంథప్రయుక్తము లైన "గొరువంక" "గోరువంక" యనురూపము లున్నవిగనుక. బ్రాంది, మోటరు, పెన్సిలు, కలము, బిస్కట్టు, కైతప్సీళ్లు—ఇట్టివి వానిసంపూర్ణార్థమును దెలుపు పూర్వప్రయుక్తపదములుగాని కల్పించుటకు సులభమగు గీర్వాణపదములుగాని లేనియెడల వేయవచ్చును. అట్లయినఁ బెక్కువృత్తులకు సంబంధించిన పనిముట్లపేళ్లు నానావిధధాన్యాదిపదార్థములనామములు వివిధమృగపక్షికీటకాదులపేరులు విద్యార్థులు సులభముగఁ దెలిసికొనఁగలరు.

పురాణనామచంద్రికను బెంచి వ్రాయుటయు, నింక నట్టిగ్రంథములు నీలగు నితరశాస్త్రవిషయములంగూర్చి వ్రాసి ప్రకటించుటయు, సాహిత్యజ్ఞాన మపేక్షించువారికి బహూపకారకములు.

## ప్రబంధములు.

ప్రబంధములు మనభాషలోఁ గుప్పతిప్పలుగ నున్నవి. ఉన్నవి చాలవనికాఁబోలు నింకను బయలుదేఱుచున్నవి. నాకుఁ గలప్రబంధపరిచయ మతిస్వల్పమయినను వానిఁగూర్చి యొకటి రెండుమాటలు చెప్పిన మన్నింతురుగాక! ఆంధ్రభాషోద్ధారకుఁడును విద్వత్కవీంద్రుఁడును గవికులకల్పతరువును నృపాలశేఖరుఁడును నగు శ్రీకృష్ణదేవరాయలవారికాలములోఁ బుట్టినమనుచరిత్రాదిసత్ప్రబంధములు కొన్నియే భాషలోనుండిన సాహిత్యభూషణములుగ నుండెడివి. తరువాతిప్రబంధములలో నొ

కటి శ్రమపడిచదివిన మఱియొకటి చదువనక్కఱలేదు. కథాబాహుళ్య చమత్కృతులు లేవు. స్వాభావికములైనవర్ణనము లెక్కడనోకాని కాన రావు. భాషయుఁ బెక్కుతావుల నస్వాభావికమే. చెప్పఁబడినయవస్థాదు లమానుషము, లతిమాత్రములు ; సమాసములు పెక్కుచోట్ల నతిదీర్ఘ ములు ; పదసందోహము లతిసాంస్కృతికములో యతివికృతాంధ్రపదబ ద్ధములో (ఉ - గిత్తతత్తడికౌతు, నీటివామి). శబ్దాలంకారము లత్యమిత ములు. అర్థాలంకారములుగూడ, నెక్కడనోతక్క, ననియంత్రిత విపరీత భావనాజన్యములు. అర్థము తఱచు చతిదుర్గ్రహము. గ్రంథములు కేవల కవిశబ్దపాండితీప్రకటనోద్దేశములగుటచేఁ జదువువానికి నర్థభేదనక్లేశము తప్ప రసానందోపలబ్ధి దాదాపుగఁ గలలోవార్త. "పోప్" అనునింగ్లిషు కవి యిట్టిగ్రంథములఁగూర్చి యీవిధమున వ్రాసెను :—

"జీవకళలతో నిండియుండు ప్రకృతికాంత నున్నదియున్నట్లు చ క్కఁగఁ జిత్రింపలేని చిత్రకారుఁ డామె యవయవము లన్నిఁటిని కృత్రిమ ములైన కనకమణిభూషణములతో నింపి తననిపుణతాశూన్యతను మఱుఁ గుపఱుచుకొనును". ప్రబంధకర్తలు చాలఁగ నీయాక్షేపణమునకుఁ బా త్రులని నాయభిప్రాయము. అట్లైనఁ బ్రబంధములే వ్రాయఁగూడదా? యని యడుగుదు రేమో! వ్రాయఁగూడదని నేనను, అనలేను, పంత మూర్చి వ్రాయవలయును. పుస్తకపరిమాణమునకుఁ దగినంతకథ నిజమైన దో కల్పితమైనదో, యుండవలెను. స్వభావవిరుద్ధములుగానివర్ణనము లుం డవలెను. వర్ణితప్రదేశములకును ఋతువులకును ననువైనజంతువులే వృక్ష లతాపుష్పాదులే పేర్కొనఁబడవలెను. ఆయావోట్టు లాయాకాలముల యందుఁ జూచువారి కెట్టియానందముకలుగునో యట్టియానందము పఠిత లకు గ్రంథమీయవలెను. అతిశయోక్తులును వెక్కిరియుత్ప్రేక్షలును సాధ్య మైనంతవఱకుఁ గట్టిపెట్టవలెను. విరహమూర్ఛాద్యవస్థల ననుభవసిద్ధము

లై యున్నంతవఱకే పుస్తకములోఁ బ్రవేశపెట్టవలెను. మానుషానుభవ విరుద్ధములైనవిషయముల పీలైనంతవఱకు వదలుకొనవలెను. అర్థ మెంత దురవగాహమైనఁ బ్రబంధ మంత ప్రశస్తమను విపరీతాభిప్రాయమును మనసునుండి తొలఁగించుకొనవలయును. అప్పుడు ప్రబంధములు పఠనీయములై యానందదాయకములై భాషాభ్యుదయకారకములై యుండును.

బాలపఠనీయగ్రంథములు.

ప్రకృతిశాస్త్ర తత్త్వశాస్త్రగ్రంథము లటుండ, సామాన్యసాహితీ సారస్వత మన్నివయస్సులవారికి ననుకూలించు వివిధగ్రంథజాలముతో నిండియుండినఁగాని వాఙ్మయము సంపూర్ణమైనదని చెప్పుటకుఁ దగదు. బాలుర కనుకూలములగు చిన్నపుస్తకములు సరియైనవి తగినన్ని యిప్పుడు తెలుఁగులో లేవు. "ఆర్యకథానిధి" మొదలగు చక్కనిపుస్తకము లిప్పుడిప్పుడు వెలువడుచున్నవి. ఇదివఱ కట్టివి లేకుండుటకును బ్రస్తుతమైనను వలసినన్ని యుండకపోవుటకును నిజమైనకారణము మనకును బాఠశాలా గ్రంథనియామకులకును గావలసినంత శ్రద్ధయు భాషాభిమానమును లేకుండుటే యని నాకుఁ దోఁచుచున్నది. ఇట్లుండ మనమిత్త్రులు గొందఱు సాహసించి యాలోపమంతయు భాషామాత కారోపించి సహజమృదువాణి యగునామెను రూపుమాపఁదలఁచినారు. కాని దైవానుగ్రహము చేతను, బ్రభువులకృపచేతను, బ్రస్తుత మామె కాయిక్కట్టు దప్పినది. ఘోరరుజాపీడితు లొకసారి మృత్యువునోటినుండి యీవలఁబడి బ్రదికి రేని పూర్వముకంటె నెక్కువ తేజోదార్ఢ్యములఁ బడయుదురని చెప్పుదురు. కావున నకారణరోగముయొక్కయు నకాలమృత్యువుయొక్కయు బారిని బడక మనపుణ్యముచేత బ్రతికిన యాంధ్రభాషామతల్లి మునుపటికంటె నధికమగు తేజోబలసంపత్తితో విరాజిల్లుచుఁ జిరంజీవినియై బిడ్డలమగు మనలను సర్వదా జ్ఞానదాయినియై పోషించుచుండునుగాక! మనయుత్సాహమును భాషాభిమానమును ద్విగుణములై యతిశయిల్లుఁగాక! ఇంగ్లీ

షులో (History Readers) చరిత్రపాఠపుస్తకములు, (Geography Readers)భూగోళపాఠపుస్తకములు, (Science Readers)శాస్త్రపాఠపుస్తకములు మొదలగునవి వెలువడినట్లు మన తెనుఁగులోఁగూడ నచిరకాలములో వివిధశాస్త్రవిషయకగ్రంథములు సుబోధమగు చక్కనిశైలిలో వ్రాయఁబడి తామరతంపరగ బయలుదేఱునుగాక !

## వచనకావ్యములు.

వచనకావ్యము లంతగ మనభాషలో లేవని యేతత్పూర్వము మనవిచేసికొనియుంటిని. మంచి గద్యకావ్యము వ్రాయుట కాధునికలాక్షణికాగ్రగణ్యుఁ డగుచిన్నయసూరియే ప్రప్రథముఁ డనియు మార్గసూచకుఁ డనియుఁ జెప్పవచ్చును. అతని "నీతిచంద్రిక" నాతికఠినమై సరసపదగుంఫితమై యున్నది. పిమ్మట రావుబహదూరు వీరేశలింగముపంతులువారు పెక్కువచనగ్రంథములు మృదుమధురశైలిని వ్రాసియున్నారు. కాని యిప్పుడిప్పుడు కేవలాంగ్లభాషానిపుణులు వ్రాయుచున్న తెలుఁగు వచనగ్రంథము లదేమిపాపమో ! ఉప్పులేనికూరలవలెఁ జప్పగనుండుటయేకాక యాంధ్రభాషాసంప్రదాయములకు దూరములై జాతీయభిన్నలక్షణములై దుర్గ్రహార్థములై, త్రిపుండ్రకుండలరాంకవధారులైనపాశ్చాత్త్యులవలెఁ, గాన్పించుచున్నవి. ఈపద్ధతి మాని పరంపరగవచ్చుచున్న భాషామర్యాదలఁ దిరుగఁ బాటించినఁగాని వాఙ్మయము కొలఁదికాలములో నయోమయమగు ననుభీతి నాకుఁ బొడముచున్నది.

మనపూర్వులు లక్షణగ్రంథములుకూడఁ బద్యకావ్యములలోనే వ్రాసిరి. ఆకాలమున నచ్చులేకపోవుటచేతను ఛందోబద్ధము లగువ్రాఁతలు విషయముల జ్ఞప్తిలోనుంచుకొనుటకు సుసాధనములగుటచేతను నట్లు చేసిరని తోఁచుచున్నది. ముద్రాయంత్రాది జ్ఞానవ్యాపనసాధనము లనేకములున్న యీకాలమున లట్టిగ్రంథములును నితరశాస్త్రవిషయకగ్రంథములును వచనములోనే వ్రాయుట సమంజసము. అట్లుచేసిననే గ్రంథస్థ

విషయములు జనసామాన్యమునకు సుబోధము లగునుగాని, పద్యములతో వ్రాసినఁ గావు. శాస్త్రపదనిర్వచనమును సూత్రనిర్వచనమును బద్యముల లోఁ జేసినఁ జేయువారికిఁ జదువువారికిఁగూడ నెంతబాధయో "అప్పకవీయము" లోఁ గొన్నిభాగములఁ జూచిన విశదము కాఁగలదు.

మనస్సులోఁబుట్టిన యూహాసందోహములు, స్వాభావికముగ ననాయాసముగఁ దెల్పుటకు వచన మనుకూలించునట్లు పద్య మనుకూలింపదు. పద్యములు యతిప్రాసాదిచ్ఛందోనియమములతోఁ గూడినవి. కనుక నందు భావప్రకటన మంతసులభసాధ్యముకాదు. అలంకారాదులతో గణనియమముతోఁ జెప్పినఁగాని సొగసుగ నుండవేమో యనుసందేహము లేనిశాస్త్రవిషయములు మొదలగునవి వచనములో వ్రాయుటయే యెక్కువ యుపయోగకరము. వచనరచనలో నారితేఱినవారు వారివ్రాఁతలఁ గొంతవఱకుఁ బద్యకావ్యములంతమనోహరములుగను జేయఁగలరు. అట్టివచనకావ్యములు మనప్రభువులభాషలోఁ జాలఁగలవు. కాలక్రమమున మనభాషలోను గాన్పింపవచ్చును. మననూత్నగ్రంథకర్తలుమాత్ర మింగ్లిషుబందుకట్లను బందుచేసి భాషను బాడుచేయకుండవలెను. "గోల్డ్‌స్మిత్" "డిక్కెన్సు" "అర్వింగ్" మున్నగు ప్రఖ్యాతాంగ్లేయవచనరచనాప్రవీణులవచనకావ్యము, లాభాషలోనివేయైన కొన్ని పద్యకావ్యములకంటె సరసములుగను సంతోషకరములుగను నున్నవి. వానిని ఛందోనియమములు లేనిపద్యములనియు రాగతాళములులేని సంగీతమనియుఁ జెప్పినఁ దప్పులేదు. అట్టివచనగ్రంథములు మనభాషలోఁగూడఁ బొడ చూపిననే మనము చరితార్థుల మగుదుము.

### పద్యకావ్యములు.

పద్యకావ్యములు కేవలజ్ఞానప్రదములుగనే యుండక చదువువారి హృదయములఁ గదల్చి కరఁగించు శృంగారకరుణవీరాదిరసోద్బోధకములై కూడ నుండవలెను. నీతులుమొదలగునవి బోధించునప్పుడైనను మనో

హరమగురీతినే బోధింపవలయును. కావుననే కావ్యములు కాంతాసమ్మిత ములని పెద్దలు చెప్పిరి. అట్టివికానివి పద్యరూపగద్యకావ్యములు కాని నిజమగు పద్యకావ్యము లనిపించుకొనవు. కావ్యకాంతకు భావమే జీవమని చెప్పుచున్నారు. ఔను! ఆమాట సత్యమే! నిర్భావమైనకావ్యము నిర్జీవ మనియే చెప్పవచ్చును. కాని, యరూపజీవమును సరూప సురూపముగా నొనర్చి కావ్యకాంతను మనకు మనోహరముగఁ జేయుట కొకయందమైన శరీరమును సుందరావయవములును ఉచితాలంకారములును హావాదులు ను గావలెను. అవి కొంతవఱకు శబ్దములతో సంబంధించినవి. కనుక శబ్ద ములతోను భాషాసౌందర్యముతోను మాకుఁ బనిలేదనుట సత్యదూర మనుసాహసపుమాటయగుఁగాని వేఱుగాదు. భాషాపారిశుద్ధ్యమును బద లాలిత్యమును గావ్యమున కావశ్యకములు. పోతన్నగారి భాగవతపద్యము లుగాని మూర్తికవిగారి నరసభూపాలీయపద్యములుగాని తిమ్మన్నగారి పారిజాతాపహరణపద్యములుగాని యించుక చవిచూచి యీమాట వా స్తవమో కాదో తెలిసికొనవచ్చును.

ఇంగ్లిషులో "Prosaic', అనఁగా "సామాన్యము, నిస్సారము, రసహీనము," అని యర్థము. వచనకావ్యములు వేఱుప్రయోజనముకలవి. వానిప్రయోజనము పద్యకావ్యములవలన నెట్లు నెఱవేఱఁజాలదో పద్య కావ్యములంతరుచిమంతములుగ గద్యకావ్యము లుండఁజాలవు. వేనియు పయోగము వానిది. దానిసౌలభ్యము దీనికిరాదు. దీనిసొగసును జొక్కు ను దానికి రావు. ఒకటి శరీరపుష్టికి మాత్రమైన "తదన్నతద్రస" భోజ నము. రెండవది షడ్రసోపేత మైనరాజులవిందుభోజనము. ఎంతరసవంత ములైననేమి, నీతిబాహ్యవిషయకములైనయెడల, రెండును బ్రాణోపద్ర వకరము లగుమధురవిషపదార్థములవంటివి. ఛందోబద్ధమైనపద్యముకీపి యెంతప్రౌఢమైన వచనశైలిలోనైనను దెచ్చుట దుర్ఘటమని నాయభి ప్రాయము.

సంగీతము శ్రవణాభిరామమైనను గురువులఁ గుదియించియు లఘువుల లాగియుఁ బెక్కు తావుల నస్పష్టార్థమైయుండును. వచన మర్థాన్వయ క్లేశరహితమయ్యు నంతశ్రోత్రానంద మీయఁజాలదు. పద్యకావ్యమన్నచో, యీ రెంటికి నడుమనుండి సరసార్థసమన్వితమై కలరవోపేతమై పాఠకుల కానందమిచ్చును. కావున గొగ్గిగొగ్గిగఁ బద్యరచనము గావించుట పద్యకావ్యోద్దేశమును మఱచుట యని నాయభిప్రాయము. గణయతి ప్రాసనియమములచేఁ బద్యము పొల్లుపదములయిల్లగుననుట కొంత యథార్థమే కాని, నేర్పుగలకవి యట్టివానిని సాధ్యమైనంతవఱకు తగ్గించియుఁ బద్యకావ్యములప్రయోజనమును జక్కఁగ నెఱవేర్పఁగలఁడు. వసుచరిత్రలోని కొన్నిపద్యము లెంతో సరసధ్వన్యలంకారార్థపుష్టములును ప్రౌఢములును అయ్యును, గాంతాకనకకింకిణీకలితమంజీరమంజురవపదవిన్యాసములతో నెట్లు నడచుచున్నవో యందఱు కెఱుకయే.

మనవారిలోఁ గొందఱు, క్రొత్తవృత్తములను గ్రొత్తక్రొత్తఛందస్సులను గల్పించి యున్ననియమములను దీసి పాఱవైచి నూతననియమములను దెచ్చిపెట్టినఁ బద్యరచన బాగుగనుండునని తలఁచుచున్నారు. వారితో నే నేకీభవింపఁజాలను. సంస్కృతవృత్తములు దరిదాపుగ నన్నియు మన తెలుఁగులో నున్నవి. కేవలాంధ్రములైన కంద గీత సీసాదులు, ద్విపదలు, నానావిధములైనరగడలు మున్నగునవి యున్నవి. ఇవన్నియుఁ జాలవని క్రొత్తవానికై యత్నలపడుట నిష్ప్రయోజనమని నా యభిప్రాయము.

సంస్కృతకవిత్వమునందు విరామము దప్పఁ దెలుఁగులోవలె నక్షరమైత్రిలేదు. కనుకఁ దెలుఁగుకవిత్వము చెప్పుట కష్టతరమని యుభయభాషాకవులు చెప్పుదురు. నియమకష్టములెన్నియున్న నంత నిరర్థక పాదపూరక పదప్రయోగముల కవకాశమెక్కువ. సంప్రదాయానుసారముగ నక్షరక్లేశ మెంతతగ్గించుకొనినఁ గవిత్వ మంతతేటగ నుండును. కేవలము

తెనుఁగులోనే వాడఁదగు సీసములు, గీతములు, కందములు, ఆటవెలఁదు
లు, ద్విపదలు, రగడలు, తఱచుగ నుపయోగించుట మంచిదని నే ననుకొ
నియెదను. అవి వృత్తములంత కష్టములుగావు. భావప్రకటనసౌలభ్యము
న కనుకూలములు. వ్యర్థపదములు లేకుండ వానిలో రసోత్పత్తి గావింప
వచ్చును. చెవి కింపుగనుండుటలోఁ గొదవవాని కంతగఁ దీసిపోవు. ఆ
యాపట్ల వృత్తములు మనోహరముగ నుండుననుమాట సత్యమే. కాని
లక్షణగ్రంథప్రతిపాదితములైన యెల్లవృత్తము లంతగ నుపయోగార్హము
లు గావు. కనుకనే భారతాదిమహాగ్రంథములయందు శ్రోత్రపేయము
లైనచంపకోత్పలమాలామత్తేభశార్దూలాదివృత్తములే విపులముగ వాడఁ
బడినవి.

శిఖరిణిమొదలగు కొన్నివృత్తములలో సంస్కృతవిశ్రాంతిస్థానము
లకును దెలుఁగుయతిస్థానములకును విపర్యాస మున్నది. తెలుఁగుయతికం
టె సాంస్కృతికవిరామమే శ్రావ్యమని నే ననుకొనెదను. ఈభేదమునకుఁ
దగినకారణ మున్నయెడల సరియేకాని లేనిచో సంస్కృతమర్యాద నవ
లంబించుటయే మంచిదని నాకుఁ దోఁచుచున్నది.

### విమర్శగ్రంథములు.

ఇఁక విమర్శగ్రంథములఁగూర్చి విన్నవించుకొనియెదను. పైనిజె
ప్పిన సాహిత్యభాగగ్రంథముల లక్షణములఁబట్టి వాని ప్రశస్తాప్రశస్త
లఁ గనుఁగొనవచ్చును. విమర్శగ్రంథములు (వాదగ్రంథములు మున్నగు
నవి) సంస్కృతమునందుఁ గలవు. తెలుఁగునందు లేవు. ఇంగ్లీషుభాషలోఁ
బెక్కులు గలవు. అట్టిగ్రంథము లనేకకారణములచే భాషలో నుండక
తప్పదు. అవిలేనివాఙ్మయమసంపూర్ణము. గ్రంథగుణాగుణనిరూపణమే
విమర్శగ్రంథముల ప్రయోజనము. గ్రంథవిమర్శనము మన యాంధ్రపరిష
ద్విధులలో నొకటియై యున్నఁ గడు శ్రేయస్కరము. "ఫ్రాన్సు" దేశ
ములో నిట్టిపరిషత్తే ఫ్రెంచిభాషను ఫ్రెంచిగ్రంథజాలమును నత్యద్భుతముగ

నభివృద్ధిపఱిచి యనేకసత్కావ్యములు వెలువడుటకుఁ గారణభూతమైన దని "మాథ్యూఆర్నాల్డు" గారు వ్రాసియున్నారు. కాకిబంగారము బంగారమనుకొని భ్రమసినట్లే సదసద్వివేకవిహీనులై పెక్కు రచ్చుపడిన గ్రంథములెల్ల నవశ్యపఠనీయములనుకొని మోసపోవుచున్నారు. అట్టివారి కిట్టిపరిషద్విమర్శనము పరమప్రయోజనకారి.

"ప్రపంచములోని యుత్తమభావములు నుత్తమజ్ఞానము నార్జించి వ్యాపింపఁజేయుట కొనర్చుపరోపకారప్రయత్నము విమర్శ" మని ఆర్నాల్డుగారి యభిప్రాయము. ఈసంబంధమునసే ఫ్రాన్సుదేశస్థుఁడైన యొకానొక యభిజ్ఞుఁ డిట్లు చెప్పుచున్నాఁడు :—"కృతి, హృదయముఁ గరఁగించి మనల సంతోషపెట్టినదా లేదా ? యనియేకాదు మనము చూచుకొనవలసినది ; అట్లు మనము కరఁగి సంతోషపడి కొనియాడుట కది యర్హమో కాదో తెలిసికొనుట యన్నిటికంటె ముఖ్యము." ఇట్టి సూక్ష్మాంశములఁ బరికించి పరిషత్తు యుక్తవిమర్శనపద్ధతులఁ జూపించుట యెంతయు లోకోపకారకము.

విమర్శనార్థము గ్రంథముల రెండుతెఱఁగుల విడఁదీయుదము:— శాస్త్రగ్రంథములు, కేవలసాహిత్యగ్రంథములు. మొదటితరగతిలోనివి నూటికిఁ దొంబదితొమ్మిదిపాళ్లు విషయప్రధానములు. శాస్త్రకర్తలు నిశితమైనబుద్ధితో యథార్థవస్తుతత్త్వపరిశీలనముతోఁ గ్రొత్తక్రొత్తసంగతులను గనుఁగొనుచు, బాహ్యాంతరప్రపంచజ్ఞానమును విస్తరించుచుందురు. వారికి భాష భావప్రకటనసాధనమాత్రముగాని యంతకంటె నెక్కువ గాదు, అలంకారాదు లిచట ననావశ్యకములు. పదము లెంతతేటగ నెంత యసందిగ్ధముగ నున్న, గ్రంథ మంతప్రశస్తము. "హెర్బర్ట్ స్పెన్సర్" గారిగ్రంథముల కీలక్షణము లింగ్లీషుభాషలో బాగుగఁ బట్టినవి. భాష గ్రాంథికమే యన్నమాట మఱవఁగూడదు. ఇట్టిగ్రంథములు విమర్శించునపుడు విమర్శకులు, భాష వ్యాకరణనిబద్ధమై విస్పష్టమై యున్నయెడల,

నీక దానిజోలికిఁ బోనక్కఱలేదు. విషయములే విమర్శనీయములు. అందలి సత్యాసత్యములఁగూర్చియే పూర్వపక్షసిద్ధాంతము లావశ్యకములు.

ఇఁక రెండవజాతివి సామాన్యముగఁ గావ్యములని పేర్కొనఁబడు పద్యగద్యాత్మకము లైనగ్రంథములు. వానిప్రయోజనము వేఱు. విషయములు సామాన్యముగాఁ గ్రొత్తవి గావు, పూర్వసిద్ధములు. కాని రచనాచమత్కృతుల ననుసరించి వివిధకృతులు వివిధగతుల నుండును. భావభేదములేకాక భాషాభేదములుకూడఁ జూపట్టును. సముద్రమువలె నుండు భాషనుండి పదములు దీసికొనుటలో, వానికూర్పులో, సంస్కృతాంధ్రపదములపాళ్లలో, శబ్దార్థాలంకారముల నుపయోగపఱుచుటలో, వ్యంగ్యప్రకటనములో, నింక నిట్టియనేకవిషయములలోఁ, గవులకునుఁ గవులకును బెక్కుభేదము లుండును. వీనిఁబట్టియే కావ్యములకు సారస్యములో భేదము గలుగును. ఒక్కదూదెనుండి పెక్కురకముల వస్త్రములు నేయఁబడునట్లే, యొక్కభాషాపదసముదాయముతో నానావిధరసోత్పాదకము లగు గ్రంథములు రచింపఁబడుచున్నవి. పచనమునందును గావ్యరచనమునందునుగూడఁ జేతినిబట్టి పాకమునుబట్టి రుచిభేదములు కలుగును. వీనినన్నిటిని విమర్శకులు గ్రహించి విమర్శనగ్రంథములు ప్రకటింపవలెను. "కావ్యవృక్షమున కమితపదపత్త్రము లున్నచో వానిమఱుఁగున భావఫలము లంతగ సామాన్యముగఁ గానరావు" అని "పోప్"గారు సెలవిచ్చియున్నారు. కావున విమర్శకులు దీని జ్ఞప్తిలోనుంచుకొనక కేవలశబ్దాడంబరముచే మోహితులై యర్థవివేకపటిమను సడలించుకొనిన, న్యాయదూరులై లోకమున కహితులగుదురు.

వాఙ్మయభాగములు వానియుత్తమలక్షణములు నితఃపూర్వము మనవిచేసికొనియుంటిని. ఆయాలక్షణము లాయాగ్రంథముల కున్నవో లేవో నిష్పక్షపాతముగ శోధించి విమర్శకులు ప్రకటింపవలయును. లోకోపకారమే విమర్శనప్రయోజనమని మరల నొక్కి చెప్పుచున్నాను. అనఁగా

గుణాగుణములను శత్రుమిత్త్రభావములచేఁ గప్పిపుచ్చక యున్నవాని నతి శయముగఁ గనఁబఱుపక వినయోక్తులతో వెల్లడింపవలయును. ఇప్పుడు బయలువెడలుచున్న కొన్ని విమర్శనగ్రంథములు చూచిన, విమర్శ మన దోషప్రకటనమనియే తద్గ్రంథకర్తలయుద్దేశమైనట్లు తోఁచుచున్నది. గుణబాహుళ్యమును జూడకుండఁగనే లోపములను గోరంతలు కొండంతలు చేసి వ్రాయుచున్నారు. ఇది భాషాభివృద్ధికి నిరోధకముగాని సహాయము గాదు. సద్విమర్శనమువలన విమర్శకులు సదుద్దేశముతోఁ గనఁబఱిచిన దోషములు మానివేసి గుణములఁ బెంచి పూర్వముకంటె మంచిగ్రంథములు వ్రాసి కవులు భాష నభివృద్ధిచేయుదురు. శత్రుల నవమానపఱుపవలెననియో యసద్గ్రంథముల ననర్హముగ భూషించి మిత్త్రులకు లాభముచేయవలెననియో చేసినదుర్విమర్శనమువలన క్షేమములేదు సరికదా యనర్థమొందు. అన్యాయముగ దూషితులైన మంచిగ్రంథకర్తలు తిరుగఁబడి మరలఁదిట్టుదురు, లేదా నిరుత్సాహులై వ్రాయమానుకొందురు. భూషితులైన యపాత్రగ్రంథకర్తలు బొమ్మజెముడుకొంకలవలెఁ దమగ్రంథములఁ బెంచి భాషను బాఠకులనుగూడఁ బాడుచేయుదురు.

విమర్శకులకు న్యాయదృష్టియేకాక, భాషాకౌశలము వివేచనబలము రసగ్రహణశక్తియుఁ గూడఁ గావలయును. అందుఁ గవికి భావనాశక్తివలె విమర్శకునకు వివేచనశక్తి ముఖ్యముగ నుండవలెను. "దుర్విమర్శనము చేసి ప్రజలబుద్ధిఁ జెడ్డత్రోవలఁ బెట్టుట, రసహీనము లైన కావ్యముల వ్రాసి వారి శ్రమపెట్టుట—యీ రెంటిలో మొదటిదే యెక్కువయనర్థకర" మని "పోప్" గారు చెప్పినారు. కనుక దిద్దుకొని ముందు మంచిగ్రంథములు వ్రాయుటకుమాత్రమే తప్పులఁ గనఁబఱిచి, బహుళముగ నుండుగుణములఁ గొని యుచితముగఁ గొనియాడుట సర్వథా శ్రేయస్కరము.

ఇంకొకసంగతి మనవిచేసికొనవలసియున్నది. కొన్నిపట్టుల మొత్త

మునిమీఁదఁజూచిన మనోహరములుగ నుండుపద్యములుగాని యాశ్వాస ములుగాని యవయవవిమర్శనరభసమున కాఁగలేకపోవచ్చును. అంతమా త్రమున నాగ్రంథము గర్హ్యముగాదని నాయభిప్రాయము. సంగీతమువలె నాపాతమధురములగుభాగవతాదులు పెక్కు-చోట్ల నీవిధముగనే యుండు ను. విమర్శమున కంతగ నిలువవని యట్టివి త్రోసివేయుట దాదాపుగ నాంధ్రసాహితీశారదమైదుప్రాణములును దోఁడివేయుట యని నాయ భిప్రాయము.

"అందమనునది, పెదవి కన్ను మొదలగు భిన్నాంగములవలనఁ గాదు, సర్వాంగసముదాయస్థాన మగుసంగివలనఁ గలుగును. అతిసమీప ముగ నుండికాని వేర్వేఱుభాగములుగాఁగాని చూచిన, నొకప్పుడు బొమ్మ మనోహరముగనుండక యదియే సమష్టిదృష్టితో నుచితమగుదూరము నుండియుఁ దగినవెలుతురులోను జూచిన సురుచిరాకారము గలిగి కడు మనోజ్ఞముగా నుండవచ్చును." ఈయర్థముల నిచ్చువాక్యములు "పోప్" గారు వ్రాసియున్నారు. దాదాపుగ నిట్టియర్థమునే యిచ్చుమాటలు స్త్రీ నిఁగూర్చి వైరాగ్యబోధార్థము శ్రీవిద్యారణ్యస్వామివారు తమ "పంచ దశి" లో వ్రాసినారు. స్పష్టముగఁ జెప్పదుష్కరమగు కావ్యాంతస్థ సుగుణము లెవ్వియో యుండుటచేతనే యట్టిపద్యములు మనోజ్ఞముగ నున్నవిగాని కారణము లేమినిగాదు.

ప్రస్తుతవిమర్శగ్రంథములు పరస్పరదూషణములతో నిండియున్న ట్లు కాన్పించుచున్నవి గాన మఱియొకమాట చెప్పఁదలఁచుకొన్నాను. ఎక్కడనో తప్పులు కొన్ని యున్నవనుహేతువుచే గ్రంథమునాతను నిం దించుట యనుదారవిమర్శనము, లోకాపకారకృత్యము. అత్యుత్తమ సంస్కృతకావ్యములయందుసైతము కొన్ని వ్యాకరణాదిస్ఖాలిత్యములు గలవు. విమర్శకులు న్యాయదృష్టితో నాదోషములను గనఁబఱిచియు, స్తుతిపాత్రములగువిషయములనుస్తుతించిరి. అట్లని ప్రస్తుతము మనమిత్రులు

కొందఱు సమకట్టి చేయుచున్నట్లు ప్రమాదములను బ్రమాణములుగఁ గైకొనుఁడని ప్రజలకుఁ బరిహాసపాత్రములగు బోధములను జేసియుండలేదు. ఈసంగతి మఱవఁగూడదు. ప్రమాదములేని సత్కావ్యము లప్పుడును లే, విప్పుడునులేవు, ఎప్పుడు నుండఁజాలవు. ప్రమాదము మానుష ధర్మము. నిష్ప్రమాదమగుసత్కావ్యము నీలిమలేనిచంద్రునివంటిది, నిర్బీజమగు సీతాఫలమువంటిది, ముండ్లులేనిగులాబివంటిది. ఎచ్చటనైన నట్టి బలాత్కృతకవిత యున్నయెడలఁ "ద్రిదోషహరము తిప్పతీఁగ" యన్నట్లది నిస్సారమైన నిర్దోషకృత్రిమకావ్య మగును; అట్టిచోట్లఁ గావ్యప్రయోజనమే పొసఁగదు.

ఇంగ్లీషుభాషలోవ్రాసిన విమర్శనగ్రంథములు విమర్శనీయము లగుపుస్తకములలోని యర్థాదిసౌష్ఠవమునుగూర్చియు భాషాపారిశుద్ధ్యనైశద్యములఁ గూర్చియు వ్రాయుటయే కాక కథాకల్పనచమత్కృతిని బాత్రౌచితినిగూడ విమర్శించుచున్నవి. మఱియొకవిశేషము గలదు. ఆకవి వ్రాసినవ్రాఁతలఁబట్టి కవిస్వభావమును, నతనికష్టసుఖములును, గవికాలాచారవ్యవహారములును, సంఘస్థితియుఁ, బరిపాలనాపద్ధతులు, నందలి మంచిచెడ్డలు, నిట్టివి పెక్కుసంగతు లెంతవఱ కూహించి తెలిసికొనవచ్చునో చక్కఁగ విమర్శించి, విమర్శకులు పాఠకుల కమితానంద మిడుదురు. అట్టివిమర్శగ్రంథములు ప్రత్యేకగ్రంథములై కడుమనోహరములుగను జ్ఞానదాయకములుగను నుండును. ఈమార్గము మన యాంధ్రగ్రంథవిమర్శకులు గూడ నవలంబించుట లోకోపకారక మని నే నెంచెదను.

సంస్కృతపదబహుళము లగుగ్రంథము లంతరసవంతములు గావనుట కొంతవఱకు సత్యమేకాని కవితాకుశలులగువారి సంస్కృతపదప్రయోగము రసపోషణమునకు మిక్కిలి యనుకూలించుచున్నది. భాగవతమే దీనికి నిదర్శనము. అరసికాగ్రేసరుఁడైనఁ దక్క నందలిపద్యములకుఁ జొక్కనివాఁడుండఁడనియే నాయభిప్రాయము. భక్తశిరోమణియు

మహానుభావుఁడును శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధలలితకవితాసంపన్నుఁడును నగు బమ్మెరపోతన్నగారి నిరుపమానసంస్కృతాంధ్రశబ్దసమ్మేళనమే యంతమాధుర్యమునకుఁ గారణము. కావున నిపుణులగుకవులకు సంస్కృతపదజాలము చాలఁగ సహకారి. అంతలోఁ జెప్పవలసినభావములు సంస్కృతభాషాసాహాయ్యమున నింతలో నిముడుచుటకు వీలగును. మాఱుమూలపదములుగాక సాధారణముగ వాడుకలోనున్న సంస్కృతపదములతోఁగూడిన దీర్ఘసమాసములుకూడఁ గర్ణసుఖములు. అట్లయ్యు నర్థవైశద్యమున కవరోధకములు గావు. ఈక్రింది భాగవతోదాహరణమును జిత్తగింపుఁడు :—"అంబుజోదరదివ్యపాదారవిందచింతనామృతపానవిశేషమత్తచిత్త మేరీతి నితరులఁ జేరనేర్చు?"

తల్లిపొదుఁగును బాసినలేఁగవలె సంస్కృతమును విడిచినతెలుఁగు కృశించి చెడును, మనకును నిరుపయోగమగును. దీనికిఁ దార్కాణముగ శుద్ధాంధ్రప్రబంధప్రయుక్తపదములు చాలవఱ కెంతకటువులుగ నుండునో చూడుఁడు.

ఇట్టివిషయములు బాగుగఁ బరిశీలించి గ్రంథవిమర్శనము చేయవలెను. విమర్శకులు స్వార్థత్యాగులును, న్యాయైకదృష్టులును, పాండితీసంపన్నులును, బహుగ్రంథద్రష్టలును, గవులుగాకపోయినను గవితారసజ్ఞులును, ఐనయెడలనే విమర్శగ్రంథములు సత్ప్రయోజనకరములుగ నుండును, గానిచో నవి విపరీతఫలప్రదములై భాషకును దేశమునకును హాని వాటిల్లఁజేయునని మఱియొకసారి చెప్పి నావ్యాసమును ముగించుచున్నాను.

---

శ్రీరామచంద్రా !

# 3 పాఠశాలలలోని తెలుఁగు.

సభాధ్యక్షా ! మహారాజా ! విద్వత్సభ్యులారా !

గీ. చదువలే దే నొకింతయు సంస్కృతంబు ;
నాంధ్రపరిచితి యల్పంబు ; సామయుఁడను ;
వ్యాసమందలి విషయభాషాదిలోప
ములను క్షమియింపుఁ ; డిదిగో చేమోడ్పు మీకు !

సస్యసమృద్ధియు సస్యప్రాశస్త్యమును జల్లిన గింజలఁబట్టియుఁ బె ట్టిన నీటినిబట్టియు నుండునట్లే, దేశభావ్యభ్యుదయము పాఠశాలలోఁ బ్రస్తుతము నాటుచున్న విద్యాబీజములఁబట్టియు బాలురు బాలికలుఁ బడయుచున్న శిక్షనుబట్టియు నుండును. వర్తమానవిద్యార్థిబృందమే కాదా పెరిఁగి పెద్దయై దేశమును ముందఱికిఁ దెచ్చుప్రజాసంఘము కానున్నది ! స్థితిగతు లెట్లుండెడివో యెట్లున్నవో యించుక పరిశీలించి చూతము.

సమస్తజ్ఞానమణిపేటికయై సర్వలోకసమాదరణీయమై యుండు భాష సంస్కృతభాష. మనయాంధ్రదేశములో నేఁబది యఱువది యేం డ్లకిందటివఱకును బ్రాహ్మణులు సర్వసామాన్యముగా వేదమునే య భ్యసించి కాలము గడపుకొనెడువారు. తఱచుగా వివాహోపనయనాది స్మార్తకర్మములకుఁ గావలయు మంత్రతంత్రవిధానములును గొన్ని యాశీ ర్వచనపుఁబనసలును మాత్రమే నేర్చి కుటుంబపోషణము గావించుకొనెడు వారు. పఠించుమంత్రముల యర్థము తెలిసినవా రెక్కడనో కాని యుం డెడివారు గారు. శాస్త్రపరిచయము గలవారిసంఖ్య యత్యల్పముగా నుం

డెడిది. పంచకావ్యములు చదివినవారే పండితులుగాఁ బరిగణింపఁబడు చుండెడువారు.

ఆంధ్రగ్రంథపఠనము చేసినవారు మఱియుఁ దక్కువగా నుండెడి వారు. అదిగాక, పెక్కురుపండితులు తెలుఁగు చదువుట గౌరవమునకు లోపమని తలఁచెడువారని చెప్పుట యతిశయోక్తిగాదు. ఛాందసులు శ్రాద్ధభోజనాద్యవసరములం దపవిత్ర మగునాంధ్రభాష నోట రాఁగూడ దని "పప్పు, కూర, పచ్చడి, చేరు, పెరుఁగు, మజ్జిగ, యుప్పు" మున్న గువానికి మాఱు "సూప శాక లేహ్య చోష్య దధి తక్ర లవ" ణాదిశబ్ద ము లుపయోగించెడువారు. వర్ణములు తాఱుమాఱుచేసి తక్రమునకు బదులు తర్కమనెడువారు కూడఁ గొందఱుండెడువారు. తేలు గుట్టి బాధపడుచున్న ప్రసిద్ధపండితుని నొకఁ డేమిశాస్త్రిగారూ! అట్లు బాధప డుచున్నా రనఁగాఁ "గించిద్వృశ్చికసంస్పర్శ" మైన దని యుత్తరమిచ్చు ట నే నెఱుఁగుదును. అది సంస్కృతభాషాభ్యాసబలసూచనమో యాం ధ్రభాషావైముఖ్యసూచనమో నేఁ జెప్పఁజాలను. నన్నయాహోబలపండి తాదు లాంధ్రవ్యాకరణసూత్రములు సంస్కృతమున రచించినఁగాని వా నికిఁ బండితసమ్మానమును వ్యాప్తియు నుండవని యట్లు గావించినారేమో యని తోఁచుచున్నది. చిన్నయసూరిగారు కూడఁ దమబాలవ్యాకరణము ను గీర్వాణపారిభాషికపదభూయిష్ఠముగానే చేసినారు.

ఇట్లుండఁగా నాంధ్రభాష చేసికొన్న పుణ్యముచే బ్రిటిష్ప్రభువులు మనదేశములో ననేకపాఠశాలలును గళాశాలలును నెలకొల్పి యం దాం ధ్రభాష బోధింప మొదలుపెట్టినారు, సంస్కృతపాఠశాలలుకూడఁ గొన్ని స్థాపించినారు. సంస్కృతసాహిత్యమును వ్యాకరణాదిశాస్త్రములును మ రలఁ దలలెత్తినవి. ఆంధ్రోపాధ్యాయులుగా నియుక్తులైనవారు చిన్నప్పు డు చిన్నచూపు చూచి చిన్నపుచ్చిన యాంధ్రలక్ష్యలక్షణగ్రంథములను

జీవికకై చేపట్టవలసి వచ్చినది. అట్టిస్థితిలో నాంధ్రభాష దినదినప్రవర్ధమానమై తేజరిల్లుచుండవలెనుగదా !

కాని యొకచిక్కు వచ్చెను. రాజభాషాదేశభాష లొకటి కాకపోవుటచేతను, దేశభాషాపాండిత్యముకంటె రాజభాషావైదుష్యమువలన నెక్కువధనలాభమును గౌరవమును గలుగుచుండుటచేతను, విద్యార్థులకు నాంగ్లభాషాభ్యసనముపైని నాంగ్లోపాధ్యాయులపైని నున్నశ్రద్ధాభక్తులాంధ్రభాషాధిగమనముపైని నాంధ్రపండితులపైని లేకపోయెను. పరీక్షపోవుననుభయముచేతనే కాని భాషాభిమానాభిరుచులతోఁ దెలుఁగుఁ బఠించువిద్యార్థులు మిక్కిలి కొలఁదిగనే యుండెడివారు. నలువదిమంది యుండుతరగతిలోనుండి నలువురైదుగురు భాషాభిజ్ఞులును భావిభాషోద్ధారకులును బయలుదేఱిరో లేదో చెప్పఁజాలను. అట్టి యల్పసంఖ్యాకులలోనివారే మన యీయగ్రాసనాధిపతులు.

స్నేహితుఁ డెదురుపడినదో "Good morning! When did you come?" పూర్వకముగా నాంగ్లభాషలో సంభాషణము, సభలో 'I propose Mr. So & So to the Chair' మొదలుకొని 'I propose a vote of thanks to the Chair' వఱకు నాంగ్లభాషలోనే యుపన్యాసాదికములు. లేఖలు వ్రాసికొనుటయు నాంగ్లభాషలోనే. ఇట్లు పాఠశాలలన్నియు నాంగ్లమయములయి మాతృభాషను ద్రోసిరాజనుస్థితికి వచ్చుచుండెను. పండితులు చెప్పుపాఠములు విద్యార్థులు శ్రద్ధతో వినుట లేకపోయెను. పరీక్షలలో నాంధ్రమునఁ దప్పిపోవువారు మిక్కిలితక్కువగా నుండెడివారు కాని, యది తెలుఁగు బాగుగాఁ దెలియుటవలనఁ గాదు. తజ్జుమా ప్రశ్నల కుత్తరములువ్రాసి తెలుఁగు గోపమును గూడఁదీసికొని పెక్కురు పరీక్షలలో నుత్తీర్ణులయ్యెడువారు. ఝరీవేగముతో సభలయందాంగ్లభాషలోఁ బ్రసంగింపఁగలిగిన ప్రౌఢవిద్యార్థి, నాలుగుతెలుఁగుమాటలు మాటాడుటకు జంకుచుండెను. ఇంగ్లీషులో దీర్ఘవ్యాసములు వ్రా

యువారు తెలుఁగులో నాలుగుముక్కలు వ్రాయుటకు వెనుదీయుచుం డిరి. సభలలోఁ దెలుఁగు మాటాడిన గౌరవహాని యగునని యనేకులు తలఁచెడివారు. సాహసించి మాటాడువారైనను భావోత్పత్తి యింగ్లిషు భాషలో నగుటచే నది స్వభాషలోనికిఁ బరివర్తనము చేసికొని నిమిష మున కొకమాట మాటాడెడివారు. పదిమాటలు గలవాక్యములో నా లుగైదాంగ్లపదములు దూరెడివి. సామాన్యప్రసంగములలో నైనను నాంగ్లభాషాసంకీర్ణత యధికమగుచుండెను :—ఈవేళ బజార్లో rice ఎలా యిచ్చారోయి—time అయింది School కి త్వరగా వెళదాం రా —School fees కట్టావా లేదా యివాళ 25 వ తారీఖు—late payment కి fine వేస్తారు జాగర్త—కనకరాజంత cunning fellow యీ world లో యెవడూ లేడురా—ఇట్టి ప్రసంగములు దాదాపుగాఁ బ్రతివిద్యార్థి యుఁ జేయుచుండెను. ఈయలవా టింకను బోలేదు. కొంతకాలమునకుఁ బోవచ్చు ననుకొనుచున్నాను.

ఈదుస్స్థితి చూచి యధికారబలమును ఆశ్రయబలమును గల యాంగ్లభాషావిశారదులు కొందఱుమిత్త్రులు—ఆంధ్రులును ఆంధ్రేతరు లును—భాషాభివృద్ధి గావింత మనుసదుద్దేశముతోనే పాఠశాలలలోఁ గొన్నిమార్పులు తెచ్చిపెట్టినారు. గ్రాంథికభాష కఠినమని నియమశూ న్యమై బహుముఖమైన వ్యావహారికభాష బడులలోఁ జెప్పఁ డన్నారు. గ్రంథములు లేవు. వ్యాకరణము లేదు. A తెలుఁగు C తెలుఁగు అని తెలుఁగును రెండుతెలుఁగులు చేసినారు. A లో వ్యాసరచన ప్రధానము చేసినారు. అది మంచిదే, కాని గ్రంథపఠనము లేక వ్యాకరణము లేక వ్యాసరచన పిల్ల లెట్లు చేయఁగలరనునూహ వారికిఁ గలుగలేదు. పాఠ శాలలలోను హైస్కూలులోను దత్పూర్వ మవశ్యపఠనీయముగా నున్న యాంధ్రభాషను ఐచ్ఛికము చేసినారు. ఈవిషయమై యనేకపూర్వపక్ష సిద్ధాంతములు జరిగినవి. అవన్నియుఁ దమకు విశదమైయే యున్నవి.

ఆగోడవయంతయు మరలఁ ద్రవ్వి చెప్పి మిమ్ము విసిగింపఁ దలఁచుకోన లేదు. కాని యామైదాతేండ్లను బడులలోని యాంధ్రభాష చుక్కాను లేని పడవయై, దిక్కులేని బిడ్డయై, పాడయిపోయినదని స్వానుభవమున నేను జెప్పఁగలను. విద్యార్థులపూర్వపుణ్యముచే, నీపరిషత్తు వారియొక్కయుఁ బండితవర్యులయొక్కయుఁ బ్రభుశేఖరులయొక్కయు దయచే, నా యాపద యిప్పుడు బడులనుండి యపసరిల్లి పోయినది. ఆంధ్రభాషను యథాపూర్వస్థితికిఁ దెచ్చుట కృత్యాద్యవస్థ మైనది. 'మాది మా కిచ్చుట మడిమాన్యంబు లిచ్చుట' యనులోకోక్తి సత్యమైనది.

తరువాత విద్యాశాఖాధికారు లనాలోచితముగాఁ జేసినమార్పులు సవరించుకొనుటకుఁ బ్రయత్నించినారు. విద్యార్థులు గాలి వ్రాఁగుచేసి కాగితము నలుపుచేయఁ జాలరని పఠనీయగ్రంథములు పెట్టినారు. వ్యాస రచనకు వ్యాకరణజ్ఞాన మావశ్యకమని వ్యాకరణము చెప్పించుచున్నారు. అన్నియు బాగుగనే యున్నవి గాని యాంగ్లభాషవలె నాంధ్రభాష నవశ్య పఠనీయముగా నింకను నేల చేయలేదో బోధపడకున్నది. ఆంధ్రభాష నైచ్ఛికము చేయుట యనర్థకరము. మేము తెలుఁగు చదువవలదంటిమా? పిల్లలు తక్కినవి మాని పరీక్షలకుఁ దెలుఁగున్నభాగమే యేల తీసికొనరా? దనుట, కువాదము. కారణములు పైని మనవిచేసికొంటిని. తెలుఁగు మాని తక్కినభాగములు తీసికొన్నందువలన ధనగౌరవాదిలాభము లెక్కువగుటచేఁ బిల్లలదృష్టి స్వభాష పైకి సాధారణముగాఁ బోదు. తెలివితేటలు గలవారు గణితశాస్త్రాదిభాగములు తీసికొని యెందులకుఁ బనికిరాని విద్యార్థులు తెలుఁగు తీసికొనుట పెక్కుచోట్ల తటస్థించుచున్నది. ఇప్పటి విద్యావిధానపద్ధతు లెట్లున్నవో నేఁ గనుఁగొనలేదు. నే నుపాధ్యాయుఁడుగా నుండుకాలములోఁ దెలుఁగునకు గౌరవము లేదు. పరీక్షలో నుత్తీర్ణులగుటకు బాలుర కింగ్లీషులో వచ్చినన్నిమార్కులు తెలుఁగులో రానక్కఱలేదు. జయాపజయనిర్ణయార్థము C. Group మా

ర్కులు సవరించుటలో నధికారులు తెలుఁగున మార్కు లెక్కువ వచ్చి నవాని కితరభాగములలో నెక్కువమార్కులు వచ్చినవారి కొసఁగులాభ మును బ్రసాదించెడువారు గారు. అనఁగా శ్రీమపడి తెలుఁగు చదువను న్న విద్యార్థుల కంతనష్టమును లేదు, పాటుపడి పఠించినవారి కంతలాభ మును లేదన్నమాట గాదా ? సంస్కృతాంగ్లాదిభాషలలో నున్న విషయ ములను జక్కని తెలుఁగులో వ్రాసి జనసామాన్యమునకు బోధించినఁ గాని దేశాభివృద్ధి కాఁజాలదు. అందుల కందఱుబాలురు నాంధ్రభాషా భ్యసన మవశ్యముగాఁ జేయవలెను. ఆంగ్లభాషకంటెఁ గూడ స్వభాష కెక్కువ ప్రాముఖ్య మీయవలె నని నాయభిప్రాయము. ఇది గాక A తెలుఁగు C తెలుఁగు నని తెలుఁగు రెండుతెలుఁగులుగా నేల యుండవ లెనో నాకు దురవగాహముగ నున్నది. పూర్వము బి. ఏ. లోఁ గూడ నింగ్లిషుతోపాటు తెలుఁగుగాని సంస్కృతముగాని విద్యార్థులు తప్పక పఠించెడువారు. నాదృష్టి కదియే మంచిపద్ధతిగాఁ గాన్పించుచున్నది. ఈ చేసినమార్పులు పెక్కుసంవత్సరములనుండి ప్రచారములో నున్నవిగదా, వానివలన నేమైన లాభము గన్పట్టుచున్నదా ? మేము తేఁ దలఁచిన modern, classical తెలుఁగువిభజనమునకు విఘ్నమువచ్చినది, యేవో తెలుఁగులు రెం డుండినఁగాని మాప ట్టెట్లు నెగ్గిన ట్టగును ? అని సెలవి చ్చువారితో నావంటివాఁ డేమి మనవి చేసికొనఁగలఁడు ? A యనుఁడు C యనుఁడు ; ఏదో యొక్క తెలుఁగు చాలును. ఇంగ్లిషువలెఁ దెనుఁ గందఱ కవశ్యపఠనీయముగా నుండవలెను. అట్లు చేసినదో దానిలాభ మధికారులకుఁ గొలఁదికాలములోనే తెలియును. హైందవులందఱు బి. ఏ. క్లాసులోఁ గూడ వెనుకటివలెనే యింగ్లిషుతో స్వభాషయో సంస్కృ తభాషయో తప్పక యభ్యసించుచుండవలెను. బి. ఏ. వఱకుఁ జదువుట కుఁ జాలినన్ని గ్రంథములును విషయములును నున్నవి.

అర్థానర్థపరిహారము గావించి పున్నెపు గట్టుకొనిన పండితులును

బ్రిభువులును బరిషత్తువారును దక్కిన సగమన్ధముకూడ నపసరించి మా పూర్ణకృతజ్ఞతకుఁ బాత్రు లగుదురుగాక ! యని వేఁడుకొనుచున్నాను. వ్యాధి యొకచోటనుండఁగా వైద్య మొకచోటఁ జేయక, నిజముగ నే లోపములవలన మన యాంధ్రభాష తగినంత యభివృద్ధికి రాకున్నదో యాలోపములఁ గనిపట్టి, తెలుఁగులో నారితేఱినవిద్యార్థులకుఁ బారితోషికాదిరూపమునఁ బ్రోత్సాహము గలిగించి, యాంగ్లాంధ్రోపాధ్యాయులకు సమగౌరవ మొసఁగి, ప్రజలు భాషోద్ధరణమహాకార్యమునందుఁ దోడ్పడుదురుగాక !

ఇది యిట్లుండ, నీనడుమఁ బ్రబలరాజకీయసంక్షోభ మొకటి బయలువెడలి ప్రజాసంఘమం దంతటను బ్రాఁకినది. అది మంచిదా చెడ్డదా యనున దిటఁ జర్చనీయాంశము గాదు, నావంటి ప్రాఁతచదువులపంతులు పరిపాలనావిధానవిచక్షణైకసాధ్యము లగునట్టిమహావిషయములఁ జర్చించుటకు సమర్థుఁడును గాఁడు. అది మంచిది గానిండు, చెడ్డది కానిండు, దానివలన దాదాపుగా యావజ్జనులకు దేశభాషాభిమానోద్రేకము కలిగినదనుటమాత్రము నిర్వివాదాంశము. ఏఁటఁ జరుగవలసినపని పూఁటలో జరిగినట్లైనది. ఆంధ్రభాష కొలఁదికాలములో నత్యద్భుతముగా నభివృద్ధి నొందినది. వార్తాపత్త్రికల యయోమయభాష కలఁకదేఱిన తేటతెలుఁ గగుచున్నది. వివిధభావములును వివిధరాజ్యతంత్రవిషయములును విస్పష్టమైన తెలుఁగువాక్యములతో వెలువడుచున్నవి. కొన్నిసభలకు నే వెళ్లుట తటస్థించినది. పెక్కురాంధ్రసోదరు లాంగ్లభాషాభిజ్ఞులైన ను వివిధకఠినాంశముల విశదీకరించుచుఁ బరిశుద్ధమును బరమసుందరము ను నగుగ్రాంథికాంధ్రభాషలో ననిచ్ఛిన్నామృతధారాపాతముగ నందఱి హృదయములు కరఁగి పాఱున ట్లుపన్యసించుట కనులారఁ గాంచినాను, చెవులార విన్నాను. విని విస్మయము నొందినాను—ఆహా ! తల్లీ ! ఆంధ్రభాషామతల్లీ ! మొన్నమొన్నటిదాఁకా మేము నిన్నుఁ గొఱుకరాని కొ

య్యవనియు, జీర్ణమైన చింపిపాఁతవనియుఁ, గేవలమూఢపండితులచే నా రాధింపఁబడుచున్న మృతకళేబరమ వనియు, నెన్నెన్నో యనరానిమాట లాడినాము. జననీ! నీ కెంతశక్తి గలదమ్మా! మూకప్రాయులై యున్న యెంతమందిబిడ్డలను నెంతలో శ్రోత్రపర్వము లగునుపన్యాసము లీయఁగల బిడ్డలను జేసితివమ్మా! ఐహికాముష్మికఫలప్రదాయిని యగునమరభాష కుఁ బ్రియతనూజవును దల్లికి వన్నెఁదెచ్చు బిడ్డవును నగు నీవు మాను జనయిత్రివై యుండ మా కేమికొదవ తల్లీ! శ్రద్ధాభక్తులులేక కామధే నువువంటి కన్నతల్లిని గట్టిబొమ్మయని యింతకాలము విడనాడి నీపాలచేఁ పురుచిమెఱుఁగక డబ్బాపాలతోఁ బెరిఁగి చెడినాము—అని లోలోపల ననుకొని యంతశ్శుద్ధితో నాంధ్రభాషాజనని కనేకనమస్కృతు లాచరించి యానందబాష్పములు రాల్చినాను.

ఇంతటితో నీయంశము గట్టిపెట్టి ప్రస్తుతపాఠశాలలలోఁ దెలుఁ గభివృద్ధినొందుట కనువగు మార్గములు నాకుఁ దోఁచినరీతిని మనవి చేసి కొనెదను.

పిల్లల కనుకూల మగుపుస్తకము లింకను బయలుదేఱవలెను. అవి శుద్ధమును సులభమును సుందరమును నగుభాషలో వ్రాయవలెను. వ్యా కరణ ముల్లంఘింపక శైలిని వ్యావహారికభాష కెంతదగ్గఱగాఁ దీసికొని వచ్చిన నంతమంచిది, గ్రంథములో సందర్భానుసారముగఁ జక్కని భాషీ యములఁ బొందుపఱుపవలెను. సౌలభ్యార్థమును నశ్లీలపరిహారార్థమును విసంధు లుపయోగపఱుచుట తప్పుగాదు. అట్లు సుప్రసిద్ధాభినవవచనగ్రం థకర్త లనేకులు చేసినారు. ప్రాఁతపడినపదములును బ్రత్యయములును సాధ్యమైనంతవఱకు వర్జింపవలెను. సమర్థులగువా రీపనిని బూనుకొని జా గరూకతతో వ్రాయుచున్నయెడలఁ గాలక్రమమున గ్రాంథికభాషకుఁ గ ర్కశత్వము పోవును, వ్యావహారికభాషకు వ్యాకరణవైరుధ్యము పోవు ను. అంతట మనపరిపాలకులగు నాంగ్లేయులకువలె మనకును దైవకృపచే

నీయుభయభాషలును దాదాపుగా నొక్కటి యగును. ఇందుకై భాషా సేవకులలో నోరిమియుఁ గూరిమియు నుండవలెను. నన్నయనాఁటి తెలుఁగే యిప్పుడును వాడవలె ననువారలలోవాఁడను గాను నేను. తెలుఁగుభాష యెన్నఁటికిని మార్పుఁ జెందదు, చెందఁగూడ, దనుపక్షము నాది గాదు. ఆంధ్రభాష, కాలానుగుణముగాఁ బెక్కుమార్పులు చెందుచున్న ట్లనేక ప్రత్యక్షనిదర్శనము లున్నవి. పెక్కురు సుప్రసిద్ధగ్రంథకర్త లుపయోగించు నపూర్వప్రయోగములు తదనంతరపు గ్రంథకర్తలభాషలోఁ దప్పక చేరఁగలవు. లక్షణగ్రంథములును దదనుగుణముగా మాఱుచుండును. ఇది సర్వభాషాసామాన్యమగుధర్మము. అంతేకాని తొందరపడి వరినాఱు నాటుట తోడనే వడ్లేవియని యడిగిన నేమిప్రయోజనము ? తొమ్మిది నెలలు నిండినతరువాత నిండుబిడ్డ తల్లిగర్భమునుండి యీవలికి వచ్చునప్పుడు మూడుమాసములై నవిగదా (⅓) మూడవవంతుబిడ్డ రాదేమి ? యని త్రైరాశికతంత్రసూత్రములు ప్రయోగించి ప్రశ్నించుట పరిహాసాస్పదముగా నుండును. ఏభాషలోను నిట్టివిషయమున నట్టిసద్యఃఫలము గాన్పింపదు, అది యస్వాభావికము.

గ్రంథములలోని విషయములు వివిధములై విద్యార్థులకు రుచిపుట్టించునట్లుండవలెను. సృష్టిలో స్ఫుటముగాఁ గానిపించు పదార్థములఁ గూర్చి తెలిసికొనుటకు బాలికలును బాలురును సహజముగాఁ గుతూహలపడుదురు. ఆజ్ఞానతృష్ణ దీర్చుటకుఁ బాఠములు వ్రాయుటకై యెన్నుకొనువిషయములు భిన్నములుగా నుండక తప్పదు. భూగోళఖగోళవృక్షజంతుశాస్త్రాదులలోని ప్రధానాంశముల నేఱి యనువైన తేటతెలుఁగులో వానిఁగూర్చి వ్రాయవలెను. పఠితల వయస్సామర్థ్యములు మనస్సునం దుంచుకొని వీలైనపట్లఁ గార్యకారణసంబంధములు విశదీకరింపవలెను. శారీరారోగ్యశాస్త్రవిషయములు గూడ నర్హ్యరీతిగా బోధింపవలెను. నీతి నుపదేశించుపాఠములు తప్పకుండ నుండవలెను. నీతిబాహ్యము లగువిష

యముల క్రిందను జోటీయఁగూడదు. దైవభక్తి దేశభక్తిరాజభక్తు లుపదేశించుపట్లు గొన్ని యుండవలెను. పారిభాషికపదము లతిజాగరూకత తో వాడవలెను. పరిషత్పత్త్రికలోఁ బ్రకటించిన పట్టికను సహాయము చేసికొని యందలి గ్రంథకర్త లేకరీతిగా నట్టిపదములు గ్రంథములం దుపయోగించుకొనుట మంచిదని తోఁచుచున్నది. తగిన కల్పితపదములు లేనప్పుడు మూలాంగ్లపదము లామట్టుననే కైకొని 'యుపయోగించుకొనవచ్చును. అట్లుచేయుట కాంధ్రవ్యాకరణ మెంతమాత్రమును నడ్డురాదు. పద్యరచనయం దారితేఱినవారే బాలురకుఁ బఠనీయము లగుపద్యములు వ్రాయవలెను. సృష్టిలోఁ జిత్రచిత్రములై నట్టియు నుదారభావజనకము లైనట్టియుఁ బదార్థములే వానికి విషయములుగా నుండవలెను. సూర్యోదయాస్తమయములు, చంద్రబింబము, ఇంద్రధనుస్సు, హిమవత్పర్వతములు, సముద్రము, మహానదులు, సుందరమగుపక్షులు, శ్రీరామచంద్రహరిశ్చంద్రాదిమహాపురుషులు—ఇట్టివిషయములపై పద్యములు వ్రాయవలెను. శృంగారవీరకరుణాదిరసముల కనుగుణమైన విషయము లున్నఁగాని సాధారణముగాఁ బద్యములు రసవంతములుగా నుండనేరవు. పద్యము ఛందోబద్ధమై యున్నంతమాత్రముననే పద్యప్రయోజనము నెఱవేఱదు. కమనీయమైనపదగతి, కల్పనాచమత్కృతి, భావోదారత—యిట్టిలక్షణములు పద్యకావ్యమునకుఁ బట్టినఁగాని యది గణబద్ధమైనగద్యకావ్యముగనే పరిణమించును. కాళిదాసుఁడు మబ్బుఁ దీసికొని మనోహరమగుశ్లోకము లనేకములు వ్రాయలేదా, మాయిష్టమగువిషయము మేము దీసికొని వ్రాసెదము—అనువారి కొకనమస్కారము. కాళిదాసునివంటి కవివర్యులును నుపజ్ఞాశాలులును నేవిషయమును పుచ్చుకొని వర్ణించినను నింపుగానే యుండును, గాని నావంటివాఁడు గేదెమీఁదను పలుపుమీఁదను బద్యము లల్లిపెట్టిన నది చదువుబాలురకు గేదెకవిత్వముగాను పలుపుకవిత్వముగానే కానిపించునేమో యని భయపడుచున్నాను. ఉచితమైన

విషయములపైని చిత్తరంజకముగా వ్రాసిన చిన్నచిన్నపద్యకావ్యములు మనప్రభువులభాషలో ననేకము లున్నవి, మనభాషలో లేవు. సమర్థులగు భాషాసేవకు లాకొఱత యచిరకాలములోఁ దీర్తురుగాక యని ప్రార్థించు చున్నాను.

చారిత్రవిషయకపుస్తకములఁగూర్చి యొకచిన్నమనవి చేసికొన వలెనని యున్నది, తాము సావధానచిత్తతతో నాకర్ణింపఁ గోరుచున్నాను. విద్యార్థుల దేశమును వారిజాతిని వారిపూర్వులను నిందించుచు వ్రాసిన పుస్తకములు వారిచేఁ జదివించుట మంచిదికాదని నాయభిప్రాయము. దానివలన పోఁగామిగిలిన యించుకంత యాత్మగౌరవమును దేశాభిమానమును నశించిపోవును. చిన్నవయసున మనసునందు నాటిన బోధనములు చిరస్థాయిత్వ మంది యితర బోధనము లంటనీయవు. చరిత్రలలోని యుత్కర్షాపకర్షవాక్యములు సత్యదూరములుకూడ నైన నిఁక వాని దుష్ఫలము చెప్పనక్కఱయే లేదు. చరిత్రములో సత్యకథనమే యుండవలెను. అసత్యకల్పన లున్నచరిత్రగ్రంథములు సర్వానర్థకరము లగును. పురాణగాథలు కేవలసత్యములు గావు అర్థవాదాదులు పెక్కు లందున్నవని పఠితలకుఁ దెలియుటచే నందలియసత్యములు చెఱుగు చేయఁజాలవు. చరిత్రలందలి యసత్యములు సత్యవేషధారులు. ప్రత్యక్షవిషముకంటె భక్ష్యపదార్థరూపముగా నున్నవిష మెక్కువప్రాణోపద్రవకరము. కావున మనము చరిత్రపుస్తకములు చక్కఁగాఁ బరిశీలించి మఱి పిల్లలచేతులలోఁ బెట్టవలెను. మనపూర్వులు దుష్టులు, మనతాతలు వంచకులు, మనజాతి నికృష్టజాతి, యని మనసు లక్కవలె నెట్లు నొక్కిన నట్లు నొక్కువడు లేఁత వయసులోఁ దమపిల్లలకు బోధించువా రెన్నఁటికి నున్నదశకు రాఁజాలరు.

నాచిన్నతనమునఁజదివిన హిందూదేశచరిత్రములో 'The Black Hole of Calcutta, కలకత్తా చీకటికొట్టు' ను గూర్చి వ్రాసినఘోర వర్ణనలు చదివి, అయ్యో! మహమ్మదీయు లెంతరాక్షసకృత్యము చేసి

నది "క్రుళ్లిన మన సీమరేఁగుపండువలె నుండు" నని చెప్పినారఁట. అట్టి వారి కిట్టి విపరీతవిషయజ్ఞానము గలుగుటకుఁ గారణము వారిజిహ్వాదోషమో మామిడిపండుయొక్క పురాకృతప్రారబ్ధకర్మమో చెప్పఁజాలను.

ఇఁక నొక్కయుదాహరణము మనవిచేసికొని యీవిషయము చాలించెదను. శివాజీమహారాజునుగూర్చి నవీనచరిత్రపరిశోధకులు వ్రాసినగ్రంథములు మీరు చదివియే యుందురు. అతఁడు మాతృదేవతయగు జిజీబాయిని జగజ్జననియగుభవానీదేవిని సమదృష్టితోఁ జూచి కొల్చిన పుత్రరత్నము, మహాభక్తుఁడు, జ్ఞానగురు వగుసమర్థరామదాసస్వామి వారికిఁ దనరాజ్య మంతయు గురుదక్షిణగా సమర్పించిన నిర్లిప్తచిత్తుఁడు, మహావదాన్యచక్రవర్తి. "నాకు రాజ్యమెందులకు? నీవు క్షత్రియుఁడవు, దుష్టశిక్షణశిష్టరక్షణాదిక్షాత్రధర్మములు నెఱపుకొనుచు రాజ్యపరిపాలనము చేయుట నీకు విహితకృత్యము. అట్లు చేయుము" అని గురువుగారు సెలవీయఁగా మాఱుమాటాడఁజాలక, తనరాజ్యము తనగురుచూలిది గాని తనది గాదని తెల్పుటకై జెండాను జేగుఱుచేలఁగట్టి కాషాయపతాకతోనే కడమకాలమంతయు గురుసేవకుఁడుగా రాజ్యతంత్రము నడపిన గురుభక్తకులశేఖరుఁడు. మహమ్మదీయులుగానివారియొద్ద మహమ్మదీయచక్రవర్తి "జిజియా" పన్నుగొనుటచూచి క్రోధావిష్టుఁడై మహమ్మదీయుల నోడించి వారియొద్దనుండి 'చౌత్తు' మున్నగు పన్నులు వసూలుచేసి పగఁదీర్చుకొన్న పరాక్రమశాలి, స్వమతపోషకశిఖామణి. అతని జితేంద్రియత్వమునకును బరనారీభ్రాతృభావమునకును బ్రబలదృష్టాంతముగా నుండు నొక చిన్నచరిత్రాంశ మిటఁ జెప్పకుండుటకు మనసొప్పకున్నది:—శత్రుదుర్గములఁ బట్టుకొనుచుండఁగా ముల్లానాకోడలును బరమలావణ్యసౌందర్యవతియు నగు నొకతురుష్కయువతి శివాజీసేనాధిపతిచేతిలోఁ జిక్కెను. భోగార్థము సేనాధిపతి యామెను దెచ్చి యెదుటఁ బెట్టి శివాజీ కర్పింపఁబోఁగాఁ జెమ్మగిల్లిన కన్నులతో శివాజీయిట్లుపల్కెను:—

"అమ్మా! మాతల్లికి నీసౌందర్యముండిన నే నెంత చక్కనివాఁడనై యుందును! ఈమె నాకు మాతృసమానురాలు; యశస్కాములు పరస్త్రీని గోరరు, పరదారాభిలాషచేతనేకదా రావణాదులు నశించిరి." అని చెప్పి శివాజీ యనేకాభరణములు కానుకలిచ్చి సూఁతు నల్లుని యింటికిఁ బంపున ట్లామెను సగౌరవముగా నామెభర్తగారియింటికిఁ బంపెనఁట.

ఇట్టిరాజరత్నము, ఇట్టినిష్కామకర్ముఁడు, ఈయపరజనకచక్రవర్తి, ఈనిరుపమానభుజపరాక్రమశాలి, చరిత్రకర్తల కలమునకు దోఁపిడికాఁడును కొండయెలుకయు నైనాఁడు. విద్యార్థులప్రారబ్ధ మేమని చెప్పుదును?

శివాజీ జిత్తులమారి కాఁడనియుఁ గపటోపాయములచే రిపుల నోడింపలే దనియుఁ జెప్పను, కాని యారెంటితోపాటు సముద్రమువలె నున్న యతనిసద్గుణజాల మేల పేర్కొనఁబడఁగూడదు? పరిపూర్ణుఁడైన మనుష్యుఁ డెచటనైన నుండునా? భగవంతునికిఁ దక్కఁ బరిపూర్ణత సృష్టిలో నేరికైనఁ గలదా? ధర్మయుద్ధములు ద్వాపరాంతమున ధర్మరాజుగారితోనే తలఁగిపోయినవి. రాజనీతియు సామాన్యప్రజానీతియును వేరైనవి; రవీంద్రనాథటాగూరుగారు మున్నగుమహాత్ము లుపదేశించునుపదేశములు భగవత్కృపచే సఫలీకృతములైనఁ దక్క, నవ్వి యట్లేయుండఁ గలవు. సంపూర్ణశాంతివైరాగ్యప్రధాన మైన మతముగదా జీజస్సుగారు బోధించినమతము! కుడిచెంపమీఁద నెవరేని నిన్నుఁ గొట్టినచో నెడమ చెంపఁ ద్రిప్పుమని బోధించు పరమసాత్త్వికమతముగదా క్రైస్తవమతము! నాగరకాగ్రగణ్యులైన జర్మనీవా రామతమువారేకదా! మొన్న జరిగిన ఘోరసంగ్రామములో నెన్ని క్రూరకృత్యములు గావించినారు! నిరపరాధులైన స్త్రీలు, గర్భవతులు, శిశువులు, వృద్ధులు, నున్నపోగయోడలెన్ని సముద్రములో ముంచి స్త్రీశిశుహత్యాదిమహాపాతకములు గట్టుకొన్నారు? అట్టివారు వీరాగ్రేసరులును, మహాత్ముఁడును మాతృదేశ

భక్తుఁడును నైన శివాజీమహారాజు పర్వతమూషికమునా ?

ప్రస్తుతాంశమునకు వత్తము. స్వదేశవీరుల నిరసించుచు వ్రాసియు చారిత్రగ్రంథము లెప్పుడును విద్యార్థులచేతులలోఁ బెట్టఁగూడదు. పాఠశాలాపఠనీయగ్రంథనిర్ణేతలు బహుజాగరూకతతో గ్రంథములు విమర్శించి మఱి బడులలోఁ జదువనగుపుస్తకములజాబితా ప్రకటింపవలెను. క్రింది తరగతులకొఱకు వ్రాసినపుస్తకములు చక్కఁగా ముద్రింపఁబడి బాలహృదయాకర్షకము లగుపటములతో నొప్పియుండవలెను. శైలి సులభముగా మనోహరముగా బాలకుల వయోబుద్ధుల కనుగుణముగా నుండవలెను. లోకజ్ఞానమో, సత్పురుషచరిత్రమో, సృష్టివైచిత్ర్యమో, వ్యవహారసంప్రదాయమో, నీతియో, అహింసాపరోపకారస్వార్థత్యాగాద్యుదారధర్మములో, పాఠములకు విషయములుగా నుండవలెను. తీయని యనుపానములతోఁ జేఁదుమందులు త్రాగించునట్లు చక్షురానందకరము లగుచిత్రలేఖనములతోను జిత్తరంజక మగురసవన్మృదుపదరచనతోను బాహ్యదృష్టి కప్రియములుగా నుండు జ్ఞానారోగ్యనీతిధర్మాదివిషయములు బాలురమనముల కెక్కింపవలెను.

ముద్రణసౌకర్యమును ధనసౌలభ్యమును గలుగుటచేఁ గాఁబోలు నుత్తమమధ్యమాధమగ్రంథములు ప్రస్తుతకాలములో నుత్తరోత్తరాభివృద్ధిగా బయలుదేఱి పఠనీయగ్రంథనిర్ణాయకులపని కష్టతరము గావించుచున్నవి. పుస్తకములెన్నువారు ద్వేషదాక్షిణ్యభావము లవ్వలఁబెట్టి గ్రంథప్రాశస్త్యమే గణనీయము చేసికొని బాలురకుఁ జదువవలయు పుస్తకము లేఱి పెట్టవలయును. చదువుగ్రంథములశైలిని భావములను గల్పనలను ననుకరించి పిల్లలు వ్రాయుదురు. కనుకఁ గల్పనలలోను భావములలోను బదములకూర్పులోను రసౌచితులు పరిశీలించి గ్రంథములు నియమించినఁగాని యననుసరణీయము లగుపుస్తకములు బాలురు పఠింపవలసివచ్చును. దానివలన ననేకానర్థములుగలుగును. భాషాభివృద్ధికిఁ బ్రతిరోధ

ము తటస్థించును. ఉపజ్ఞావంతుల సద్గ్రంథములు పఠనీయములుగాఁజేయుట గ్రంథనిర్ణాయకుల ప్రధానకర్తవ్యము. సత్కవులకుఁ గావించినసమాదరణప్రోత్సాహములవలన సరసమైన సద్గ్రంథములు విశేషముగా బయలుదేఱును. ఇతరగ్రంథపోషణమున నసద్గ్రంథములు కుప్పతిప్పలుగా బయలువెడలి యర్భకుల కనర్థకారులగును. కనుకఁ బఠనీయగ్రంథములు నిర్ణయించువారు కేవలదేశభాషాపురోభివృద్ధితత్పరులై మోమోటమును బూర్తిగాఁ ద్రోసిపుచ్చి న్యాయైకదృష్టితో రసవంతములును నుపజ్ఞాలక్షణలక్షితములును నౌచితీయుక్తములును నీతిదాయకములును నగుమంచిపుస్తకములు పాఠశాలలలోఁ బ్రవేశపెట్టవలయు నని మనవిచేసికొనుచున్నాను.

పరిషత్తువారు నిఘంటునిర్మాణమహాకార్యమును బైని వేసికొని ప్రజల కృతజ్ఞతకుఁ బాత్రులైనారు. భగవత్కృపచే నచిరకాలములో నది పైకి వచ్చి తత్సంపాదకులకును దానికి వలయుద్రవ్యము పుష్కలముగా దయచేసిన భాషాభిమానులును వదాన్యులును నగు శ్రీమహారాజుగారికిని నాచంద్రతారక మగు యశోలాభ మొసంగుఁగాక! యని ప్రార్థించుచు, దానితోపాటు, బయలువెడలు గ్రంథములను బరిశీలించి వాని గుణాగుణములను బ్రకటించి ప్రజల కెఱిఁగించుభారముకూడఁ బరిషత్తువారు వహించుట మహోపకారకృత్యమని మనవిచేసికొనుచున్నాను. హంసలు, నీరక్షీరవిభాగము చేయునట్లు నిష్పక్షపాతబుద్ధితోఁ బ్రామాణికులైనవిద్వత్పరిషత్తువారు సదసత్సరసనీరసగ్రంథవిభాగము గావించుట భాషాభావ్యభ్యుదయహేతుక మగునని నాయభిప్రాయము (French Academy) ఫ్రాన్సుదేశపరిషత్తట్టిమహోపకారము చేసి భాషను బ్రజాభిరుచులను బరిశుద్ధములుచేసి దేశమును ముందఱికిఁ దీసికొనివచ్చినట్లు వినుచున్నాము. మన పరిషత్తువారుకూడ నట్టి యుదారోద్యమము పూని కృతకృత్యు లగుదురుగాక!

పాఠశాలల కవ్వలనుండువారు భాషాభివృద్ధికై కావింపవలసిన

విషులనుగూర్చి నాకుఁ దోఁచినయభిప్రాయములు తమయెదుటఁ బెట్టి నాను. ఇఁకఁ బాఠశాలలలోఁ బనిచేయువా రేమిచేయవలయునో దానిఁ గూర్చి యించుక మనవిచేసికొనెదను.

తెలుఁగును A తెలుఁగని C తెలుఁగని రెండుతెలుఁగులుగా ఖం డించినారని యిదివఱకుపూర్వము చెప్పితినిగదా. ఆసంస్కరణమున కదనముగాఁ బఠనీయగ్రంథములను సవిమర్శపఠనీయము (books for detailed study) లనియు సామాన్యపఠనీయము (books for non-detailed study) లని యు రెండువిధములుగా విభజించినారు. ప్రథమజాతిపుస్తకము లధ్య యనగభీరత (intensiveness of study) కోసమును రెండవజాతిగ్రంథ ములు పఠనవిస్తీర్ణత (extensiveness of study) కోసమును బెట్టఁబడిన వఁట. అధ్యయనమహార్ణవములో నొకచోట లోఁతెక్కువగా నుండవలె నఁట, రెండవచోట విరివి హెచ్చుగా నుండవలెనఁట. ప్రస్తుతపు Intermediate, B. A, తరగతులయనుభవము నాకంతగాలేదు. వాని లో నీభేదమువలన నుపయోగముండిన నుండవచ్చును. 4-వ ఫారమువఱ కు మాత్ర మది యనావశ్యకము. చదువున దేదో యదియంతయును సవిమర్శముగానే చదువవలెను. పెట్టినగ్రంథముల ప్రాశస్త్యమునుబట్టియు గురుబోధనపాటవమునుబట్టియు విద్యార్థులకు విద్యాతృష్ణ హెచ్చి వారి చేఁ బాఠశాలాగ్రంథసమితిలో నుండునితరగద్యపద్యగ్రంథములు చదివిం చుచున్నచో నది వాంఛనీయమే, శుభసూచకమే. 4, 5, 6 ఫారముల లో సామాన్యపఠనీయగ్రంథములు సరియైనవి పెట్టినచో లాభకర మన్న మాట వాస్తవమే. కాని యట్టివి భాషయందును గ్రంథస్థవిషయములం దును గడుసులభములుగా నుండవలెను, గురుసాహాయ్య మక్కఱలేకుండ విద్యార్థులు తమంతటఁ దాము చదువుకొనఁగలుగునంత తేలికగా నుండ వలెను. అప్పుడే యట్టివాని ప్రయోజనము నెఱవేఱును. నేను బ్రధానో పాధ్యాయుఁడనుగా నుండినప్పుడు పెట్టిన కొన్నిసామాన్యపఠనీయాంగ్ల

గ్రంథములు సవిమర్శపఠనీయాంగ్లగ్రంథములకంటె నెన్నోమడుఁగులు కఠినముగా నుండెడివి. ఇప్పు డెట్లున్నవో నే నెఱుఁగను. అట్టిగ్రంథములు పెట్టుటవలన లేఁతవయసులో నుండుపిల్లలకుఁ బఠనభారమును మనఃక్లేశమును హెచ్చయి వారిబుద్ధిని పాడుచేసి జ్ఞానార్జనకౌతుకాగ్నిని జల్లార్చును, చదువు చేఁదుగాఁ గనఁబడును. విద్యార్థి నట్టిస్థితికిఁ దీసికొనివచ్చు విద్యాపద్ధతి విసర్జనీయము.

తిన్నగాఁ బుస్తకము చేతఁ బట్టలేని 2, 3, 4, 5-వ తరగతులశిశువులచేతులలోఁగూడ రెండురకముల తెలుఁగుపుస్తకములు గానిపించుచున్నవి. ఒకటి వాచకపుస్తకమఁట, రెండవది యుపవాచకపుస్తకమఁట. చక్కఁగా వివిధవిషయములఁగూర్చి వ్రాసిన యొకపుస్తకము నియుక్తులైన యుపాధ్యాయు లుచితరీతిని జెప్పినఁ జాలును. ఒకమూల గణితము, ఒకమూల చరిత్రగ్రంథము, ఒకమూల భూగోళశాస్త్రము, ఒకమూల శారీరారోగ్యశాస్త్రములు, ఒకమూలఁ (Civics) బట్టనపాలనాపద్ధతులు, ఒకమూల జంతువృక్షశాస్త్రవిషయములు, ఒకమూలఁ దెలుఁగున కేమాత్రమును సంబంధింపనియాంగ్లేయభాష. చెక్కలు చిదిమిన క్షీరములు గాఱు శిశు వీయొత్తుడు తగిలిన నుక్కిరిబిక్కిరి కాఁడా? విద్యాకుతూహలమభివృద్ధి సేయువిద్య విద్యగాని విద్యావిజుగుప్సాపాదక మగువిద్య విద్యగాదు. ఇట్టిస్థితిలో విద్యార్థుల యుత్సాహమును శరీరారోగ్యబలవర్చస్సులును మేధాసంపత్తియుఁ బోవుచున్న వన్న నాశ్చర్య మేమున్నది?

ఆంగ్లభాషేతరబోధ్యవిషయము లాంధ్రభాషాద్వారమున బోధింపవచ్చునని యధికారు లనుజ్ఞ యిచ్చినారఁట. గణితచారిత్రప్రకృతిశాస్త్రాదులు దేశభాషలోఁ జెప్పవచ్చునని యొప్పుకొన్నారఁట. కాని యదింకను పై తరగతులలోఁ బ్రచారములోనికి రాలేదు. అట్లు రాకపోవుటకుఁ గారణము మన యలసతయే కాని యధికారుల యశ్రద్ధగాఁ గానిపింపదు. ప్రచారములోనికిఁ దెచ్చుటకు బహుకష్టములు పడవలెననుమాట

యథార్థము. బాలురకు బడిపంతుళ్లకుఁ గూడఁ దెలుఁగు ధారాళముగా మాటలాడునలవాటు తప్పిపోయినది. ఆంగ్లపారిభాషికపదముల కాంధ్రసంస్కృతపర్యాయపదములు దొరకుట కష్టము. సులభముగా నుపయోగింపనగు పదములైనను సమయమునకు స్ఫురింపవు. అది యాంగ్లభాషాభ్యాసబలమును సూచించును గాని యాంధ్రభాషయసమర్థతను సూచింపదు. 'Draw a Straight Line' అనుమాటలు ముందుగా నాలుక చివరకు వచ్చియుండును. 'ఒకసరళరేఖ గీయుము' అనునవి యాలోచన మీఁద గాని రావు; "A, B & C are the angular points of the triangle A B C' అనునది 'క, చ, ట, లు కచట యను త్రిభుజము యొక్క కోణబిందువులు' అనుదానికంటె సులువుగాఁ గానిపించుచున్నది. అది యభ్యాసమహిమగాని యంతకంటె వేఱుగాదు. ఇప్పుడు చెవికిఁ గటువుగాను వింతగాను వినఁబడు 'త్రిభుజము' అనుమాట వాడుకలోనికి వచ్చినకొలఁది నింపుగాను బరిచితపదముగాను వినఁబడును. చేదుకాఫీ యిప్పుడు జిహ్వకు రుచించి కడవలకొలఁది ఖర్చగుచుండుట మనము ప్రత్యక్షముగాఁ జూచుచుండుటలేదా? ఇట్లే 'Liver, Spleen' మున్నగు మాటలకు 'కారిజము' 'ప్లీహము' మున్నగుపదము లుపయోగించుకొనుచుండినఁ, గొంతకాలమున కవియే సర్వసామాన్యములైన వ్యావహారిక పదములలోఁ జేరును. ఆదికష్టము లన్నిసంస్కరణములకు నవశ్యానుభావ్యములు. ప్రకృతిశాస్త్రాదులు తెలుఁగుతోఁ బ్రారంభించినయెడల నుపాధ్యాయుల కాయాయాంగ్లేయపరిభాషాపదములకు సరియైన సంస్కృతపదములో తెలుఁగుమాటలో వెదకుట తప్పదు. బుద్ధిపరిశ్రమవలన యుక్తపర్యాయపదములు పొడకట్టకమానవు. డబ్బుకై యో భాషాసేవార్థమో బుద్ధిమంతు లాయాశాస్త్రములలో సముచితగ్రంథములు వ్రాయమొదలిడుదురు. ఒకరినిమించి యొకరు బాగుగాఁ బుస్తకములు వ్రాయవలె నని గ్రంథకర్తలు ప్రయత్నింతురు. అట్లు చేసినచోఁ గొలఁదికాలములో నాం

గ్లేయభాషయందువలెనే తెలుఁగునఁగూడ దివ్యమైన ప్రకృతిశాస్త్రాది గ్రంథములు బయలుదేఱఁగలవు. పుస్తకము లున్నఁగాని బడులలో నివన్నియుఁ దెలుఁగుతో నెట్లు చెప్పుదుమని యుపాధ్యాయులును, ఉపాధ్యాయులు తెలుఁ గుపయోగింప మొదలుపెట్టినఁగాని మేము గ్రంథములు వ్రాసినప్రయోజన మే మని గ్రంథకర్తలును నొకరినొకరు చూచుకొనుచుఁ దటస్థులై యున్నయెడల మనయాంధ్రభాష యెప్పటికిని యథాపూర్వముగానే యుండును. కావునఁ బాఠశాలాధ్యక్షు లీవిషయమున సాహసించి స్వభాషాభివృద్ధిఁ గావింతురుగాక ! యని ప్రార్థించుచున్నాను.

ఇఁక నుపాధ్యాయవృత్తి స్వీకరించి బడులలోఁ బ్రవేశించిన పండితోత్తముల కొకమనవి చేసికొనెదను. పూర్వము కేవలాంధ్రగీర్వాణభాషాభిజ్ఞులై యాంగ్లభాషాపరిచయము లేనివారే బడులలోఁ బండితులుగా నుండెడివారు. ఇప్పుడు కొంద ఱట్టివారును గొంద ఱాంగ్లభాష తెలిసినవారును బాఠశాలలలో నాంధ్రాధ్యాపకులుగా నున్నారు. ఆంగ్లపండితులకు సాధారణముగా నాంధ్రభాషాపాండిత్యము తక్కువగా నుండును, సంస్కృతాంధ్రపాండిత్యమున్నవారికిఁ బ్రకృతిశాస్త్రాదివిషయజ్ఞానము తక్కువగా నుండును. వారిలోపము వారును వీరిలోపము వీరును బూర్తి చేసికొనినచో నాంధ్రోపాధ్యాయు లుండవలసినరీతి నుందురు. మునుపటివలెఁ గాక ప్రస్తుతపఠనీయగ్రంథములు నానాప్రకృతిశాస్త్రవిషయసంకలితములై యున్నవి. కావునఁ బండితులుగాఁ బనిచేయువారు రేపటిపాఠము లీవేళ నింటియొద్ద సవిమర్శముగాఁ జదువుకొనవలెను. అట్లుచేయుట తమకును విద్యార్థులకునుగూడఁ జాల లాభకరము, పొరపాటు లుండవు, కాలము వృథాగాఁ బోదు, గ్రంథస్థవిషయములు సువిస్పష్టముగాఁ బ్రశ్నోత్తరరూపమున బాలురకు బోధింపవచ్చును, చెప్పినపాఠము శిష్యులకు మనోహరముగా నుండును. పట్టాచ్ఛాత్రపండితులకుఁ జచ్చుతెలుఁగుపాఠము లింటియొద్ద శ్రమపడి చదువుకొని రావలెనా ? యనునహంభావ ముండఁ

గూడదు. ముందు చదువుకొని పాఠములు చెప్పుటవలన విద్యార్థులకుఁ దమయెడల నుండవలయు భయభక్తులు హెచ్చును గాని గౌరవహాని యెంతమాత్రమును దటస్థింపదు. దీనికిఁ దార్కాణగా నొకచిన్న సంగతి మనవిచేసికొనెదను. కుంభకోణపుఁ గళాశాల కధ్యక్షులుగానుండి యిప్పుడు కీర్తిశేషులైన గోపాలరావుగారినిగూర్చి మీరు వినియే యుందురు. ఆయన మహాబుద్ధిశాలి, యాంగ్లవిద్వాంసులకుఁగూడ విస్మయావహ మగు నఖండపాండిత్య మింగ్లిషుభాషలో సంపాదించినవారు, దొరలుకూడ నాయనతోఁ బ్రసంగించునప్పు డుచ్చారణలోపములు భాషాదోషము లెక్కడ వచ్చునోయని జంకెడువారఁట. ఆయనయొద్దఁ జదువుకొనిన శిష్యులలో నొక రాయనక్రిందనే యొకచిన్నతరగతి కుపాధ్యాయులుగా నుండి మిక్కిలి శ్రద్ధతోఁ బనిచేయుచుండెడివారఁట. గురువుగారి మెప్పు వడయు కుతూహలముతో నొకనాఁ డాయన గోపాలరావుగారి యొద్దకు వెళ్లి తనపిల్లలను బరీక్షింపుఁ డని వినయపూర్వకముగాఁ బ్రార్థించెనఁట. మంచిది రే పశ్లే చేసెదను లే యని వారు సెలవిచ్చిరఁట. అంతట శిష్యుఁ డీపాటిదానికిఁ దమరు శ్రమపడి రేపు రావలయునా యిప్పుడు దయచేసి యొక పావుగంటలోఁ బరీక్షింపవచ్చు నని మనవి చేసికొనెనఁట. దానికిఁ జిఱునవ్వు నవ్వుకొని "బి. ఏ. కిఁ జెప్పఁబోవుపాఠము లిప్పుడు చూచుకొనుచున్నాను. నాపరీక్ష నీకును నీవిద్యార్థులకును గూడఁ గొంచెము లాభముఁ గలిగింపవలయు ననికదా నీయభిలాష? నీ వేపుస్తకములో నే యేపాఠములు చెప్పినావో సావధానచిత్తుఁడవై నే ముందు చదువుకొనవలెను. బోధకు లేయేపట్ల సామాన్యముగాఁ బొరపాటు పడుదురో బాలుర కెక్కడెక్కడ సందేహము లుదయించునో యవియన్నియు నేను నీమట్టమునకు నీశిష్యులమట్టమునకు దిగి బాగుగాఁ జూచుకొనవలెను. ఇంతపని నేఁ జేసికొనవలసియుండఁగా నిప్పుడే రమ్మనెదవేమి నాయనా?" యని గోపాలరావుగారు చెప్పినారఁట. ఈకథ నాకుఁ జెప్పిన మిత్త్రుఁడు

తరువాత నేమిజరిగినదో చెప్పలేదు. ఆయనవాక్యరత్నములు వినినపిదప శిష్యుఁ డుపాధ్యాయవిఘ్నులను వెనుకటికంటె బాగుగా నెఱవేర్చుకొనియుం డునని మాత్రము భావించెదను.

యోగ్యతాసమర్థతలనుబట్టి పండితులను వేతనాదులచే సమ్మానించుట నియోక్తల కెట్టివిధియో యొకసారి నిర్ణీతమగుజీతమున కొప్పుకొని పనిలోఁ బ్రవేశించినపిదప దైవముఖముచూచి త్రికరణశుద్ధిగా శక్తివంచనలేకుండఁ దమ విహితకృత్యములు నెఱవేర్చుకొనుట పండితుల కట్టివిధియే. నియోజకులకు ఋణపడియుండు నియుక్తు లిహపరసుఖదూరు లగుదురు. చెప్పవలసిన పాఠములు ముం దింటియొద్దఁ జదువుకొనిరానియుపాధ్యాయుఁడు బాలురకును బాఠశాలాధికారులకును ద్రోహము చేయుచు నన్యాయార్జితవిత్త మనుభవించుచున్నాఁ డన్నమాటయే.

పండితులలోఁ బెక్కురు, బోధనపద్ధతులలో శిక్షితులైనవారుగా నుండకపోవచ్చును. అయిననేమి ? అంతఃకరణశుద్ధితో భగవంతుఁడు తన కిచ్చిన యావచ్ఛక్తియు శిష్యక్షేమముకై వినియోగపఱుచు నుపాధ్యాయున కనుభవపూర్వకమున నన్నియుచితపద్ధతులును నలవడఁగలవు.

ఒక్కసంగతి జ్ఞప్తిలో నుంచుకొనవలెను. గురువునొద్దకు రాకముసుపే శిష్యులకు మనశ్శక్తులన్నియు దేవుఁ డిచ్చియున్నాఁడు. ఆశక్తుల నావరించుకొని యున్నమనోమాలిన్యమును సందేహనివారణరూపముగాఁ దొలఁగించి స్వచ్ఛమైన బుద్ధి నుద్బుద్ధము చేయుటయే గురుకృత్యము. ఆయవరోధాపసారణమహాకార్యమునందే గురువు తెలివితేటలన్నియు నగపఱుపవలెను. పండితున కెంత పాండిత్యమున్నదో యనునది యంత గణనీయాంశము గాదు, తత్ప్రజ్ఞాజ్యోతివలన శిష్యులలో నెంతదీప్తితో నెన్ని జ్ఞానజ్యోతులు వెలుఁగుచున్నవో దానిఁబట్టే యాయన కృతకృత్యతాఫలముయొక్క ప్రమాణము గనుఁగొనవలెను.

ఉపన్యాసరూపక మగునుపదేశము కళాశాలలలోని పెద్దపిల్లవాం

డ్రి కుపయోగకారి గావచ్చును గాని క్రింది పాఠశాలలలోని పిల్లల కెంత మాత్రము పనికిరాదు.

ఉపన్యాసములు వక్తృత్వధారాప్రకటనమాత్రప్రయోజనములు, కొన్నిరోజులవఱకు విద్యార్థులను నద్భుతరసానందభరితులఁ జేయును గాని వారి కించుకంతయు లాభకారులు గావు, వెళ్లఁగా వెళ్లఁగా శిష్యులబుద్ధి వికసించుటకు మాఱు ముకుళీభవించును, అవులింతలతో నిద్రాదేవత యావేశించి వారిని సుఖసుప్తిలోఁ బడవేయును. పరంపరాగత మగుప్రాచీనాకాంక్షాపద్ధతి మిగుల మంచిపద్ధతి. ప్రశ్నోత్తరములు బాలుర యంతశ్శక్తులకుఁ జలనముకలిగించి బుద్ధిని రేపి గురు వుపదేశింపఁదలఁచుకొను విషయములను వారికే స్ఫురింపఁజేయును. బాలు రల్లరిచేయుటకుఁ గాని యశ్రద్ధాపరధ్యాననిద్రాపారవశ్యములలోఁ బడుటకుఁ గాని యవకాశ ముండదు. నియమితకాలములో నొకనిమిషమైనను వృథా పోదు. ఇట్లు సమార్జింపఁబడిన విద్యయే నిజమైన విద్య. అది బుద్ధికి స్వతంత్రతాబల మిచ్చి యుపజ్ఞాభివృద్ధి గావించు జ్ఞానరూపకమైన యాహారము. బాలుర కాలోచనశ్రమ మొకింతయు లేకుండ గురు వుపన్యాసగర్జనములతోఁగురిసి లోపలఁబోసిన యుపదేశాసార మోటికుండలోఁ బోసిన నీటివలె నెంతో కాల ముండదు. అదంతయు జ్ఞప్తిలో నుంచుకొనఁ దలఁచుకొను మంచి పిల్లవాండ్రకైనను గొలఁదికాలములో ధారణాశక్తి తగ్గిపోవును. ఒకటి స్వాభావికాహారమువలనఁ గలిగి స్థిరముగానుండు రక్తమాంసమస్తిష్కబలము, రెండవది బలాత్కృతభోజనముచే వచ్చిన తాత్కాలికాస్థిరపుష్టి. విద్యార్థ్యవస్థలోఁ బరీక్షలలోఁ బాగుగాఁ విజయమంది ప్రసిద్ధికెక్కి కొందఱు చివరకు జ్ఞాపకశక్తి నశించి నేఁడు చెప్పినమాట రేపు మఱచిపోవు దుస్థితికి వచ్చుట కిదియే కారణము.

విద్యలోను, వినమ్రతలోను, నీతిలోను, సత్యన్యాయసౌశీల్యాదులలోను, నుపాధ్యాయుఁడు బాలుర కాదర్శముగా నుండవలెను. విద్యార్థులు

విని నేర్చుకొనువిషయములకంటెఁ గని నేర్చుకొనునవి యెక్కువగా నుం డును. ఎట్టిధీమంతులకైనను బ్రిమాదములు వచ్చుచుండును. అర్థవిష యాదివివరణములం దొకప్పుడు పొరపాటు రావచ్చును. పిల్లలు వేసినప్రి శ్నలవలనఁ గాని పిమ్మటఁ దా నాలోచించుకొనుటవలనఁ గాని తప్పు గో చరించినయుపాధ్యాయుఁడు శిష్యులకు వెంటనే తాఁ జెప్పినది పొరపా టని చెప్పి తప్పు సవరించుకొనుట యుదారగుణము. ప్రిశ్న వేసిన పిల్లవా నిపైఁ గోపపడుటగాని తనతప్పుఁ గప్పిపుచ్చుకొనుటగాని యుత్తమగురు లక్షణముఁ గాదు. దానివలన గురువునకు లాభమును లేదు. మనుజుఁడు సర్వజ్ఞుఁడని యెవరు ననుకొనరు. తప్పులు సవరించుకొనుటవలనఁ దనసత్య శీలత తనశిష్యులకు బయలుపడును. తనయెడల వారికుండు ప్రామాణ్యబుద్ధి హెచ్చగును, గురువుగారినోట నెన్నఁడు నసత్యము రాదను దృఢనిశ్చ యముతో విద్యార్థు లాయన చెప్పెడుమాటలను వేయిచెవులతో విను చుందురు. ఆయన యెదుట నున్నను లేకున్నను విద్యార్థులు గురున కని ష్టములగు చేష్టలు చేయక యతని యదపాజ్ఞలలో నుందురు. ఏతత్సంద ర్భవశమున నొకమహాపురుషుని చరిత్రాంశము జ్ఞప్తికివచ్చుచున్నది. అది మనవిచేసికొనెదను. రగ్బీపాఠశాలాధ్యక్షు లగుడాక్టరార్నాల్డుమహోపా ధ్యాయునిఁగూర్చి మీరు వినియేయుందురు. ఒకనాఁ డొకపిల్లవాఁడు తప్పుచేసినాఁడని తెలిసి తొందరగా విమర్శించి ఆర్నాల్డుగా రతనిని బెత్త ముతో రెండో మూడో దెబ్బలు గొట్టి పంపివేసిరి. పంపివేసిన వెంటనే 'నీవు తిన్న గావిమర్శింపలేదు' అని తనయంతరాత్మ చెప్పినట్లయ్యెను. అంతట నామహానుభావుఁడు మఱికొన్నిసాక్ష్యములు పుచ్చుకొని యెంతో శ్రమ పడి విచారణ జరిపినమీఁదటఁ దాను గొట్టినపిల్లవాఁడు నిర్దోషుఁడని ని ర్ధారణ చేసికొనెను. ఆర్నాల్డుగారి కారాత్రి నిద్రపట్టలేదు. మఱునాఁడు పాఠశాల కుపాధ్యాయులును బాలురును రాఁగానే వారినందఱ నొకచో టికి రమ్మని పిలిపించి యందఱయెదుటను దాను వెనుకటిరోజునఁ జేసిన

శిక్ష యన్యాయపుశిక్ష యనియు, శిక్షితుఁడైనబాలుఁడు నిరపరాధుఁ డని యుఁ దాను దోషియనియుఁ బ్రకటించెను. అంతటితో నూరకుండెనా! శిక్షించినపిల్లవానిని బిలిచి "నాయనా! నిన్నన్యాయముగా నిన్నుఁగొట్టి నాను. అది నాతప్పు. నిన్నుఁ గొట్టినదెబ్బలు మరల రావు. తప్పుచేసిన వాఁడు చిన్నవాఁడైనను బెద్దవాఁడైనను శిక్షార్హుఁడే. కావునఁ గాదనక నిన్నుఁ గొట్టినయీబెత్తముతో నిన్నుఁ గొట్టినన్ని దెబ్బలును నీవు నన్నుఁ గొట్టుము" అని బెత్తము చేతికిచ్చి తనచేయి సాఁచెను. కొట్టుటకు బాలు నకుఁ జేతులువచ్చునా? పిల్లవాఁడును నక్కడ నున్నసర్వజనులును హృ దయములు కరఁగి కన్నులనుండి కాల్వలై ప్రవహింపఁగా నార్నాల్డుగారి ధర్మశీలతను సత్యసంధతను వేనోళ్లఁ బొగడుకొనుచు నెవరిస్థానములకు వారు మరలిపోయిరి. కావున తప్పొప్పుకొని సవరించుకొనుట ధైర్యౌ దార్యసూచకము గాని కాతరతాసూచకము గాదు. పులిని బొడుచువాని కంటె బుద్ధిలోనుండు మాత్సర్యమును బొడిచి చేసినతప్పొప్పుకొనువాఁ డు శూరాగ్రేసరుఁడు, పిఱికివాఁడు కాఁడు.

పాఠశాలలలో వ్యాసరచన కిప్పు డగ్రస్థాన మిచ్చినారు. చేసిన సంస్కరణములలో నెల్ల నది మంచిసంస్కరణము, భావిగ్రంథకర్తల కది బహూపకారకము. కావునఁ బండితులా విషయమున బహుశ్రద్ధ వహిం పవలసియున్నది. విషయదోషములను భాషాదోషములకంటె నెక్కువ జాగ్రత్తతో దిద్దవలెను. అందుకై వారు విషయములకు మిక్కిలి కృత పరిచయులై యుండవలెను. ఆంగ్లమునందువలె నాంధ్రభాషావ్యాసములం దుఁగూడ ముఖ్యవిషయాంతర్గతములై వాని కంగములుగా నుండునివి ధోపాంశములఁగూర్చి వ్రాసిన వాక్యసముదాయములను వేఱువేఱు పరి చ్ఛేదములు (paragraphs) గా వ్రాయింపవలెను. ఆయావిరామస్థాన ముల కాంగ్లములో విధింపఁబడిన గుఱుతులు (Punctuation marks) యుక్తస్థలములందుఁ దెలుఁగులోఁ గూడ నుపయోగించుకొనుటమంచిది.

అవి యిప్పుడు వాడుకలోఁ గూడ నున్నవి. ఒకపురుషునిగూర్చి వ్రాయునపుడు కాలపౌర్వాపర్యము ననుసరించియు, గృహాదులను వర్ణించునపుడు దేశపౌర్వాపర్యము ననుసరించియు వ్యాసము లుండవలెను. అనఁగా నొకనిజన్మమునుగూర్చి చెప్పి, పిమ్మట మరణమునుగూర్చి చెప్పి, తరువాత నతనివివాహాదులను జెప్పఁగూడదు; అట్లే గృహపురోభాగము తరువాత పెరడు వర్ణించి తరువాత నడుమనుండు గదులఁగూర్చి చెప్పఁగూడదు. కేవలభావప్రధానమైన విషయములఁగూర్చి వ్రాయుట కష్టము, అట్టి వ్యాసములు పైతరగతుల బాలురచేత వ్రాయింపవచ్చును. సత్యశౌచాదులను గూర్చి వ్రాయువ్యాసము యుక్తాయుక్తముగాను గార్యకారణసంబంధములతోను బూర్వపక్షసిద్ధాంతములతోను నుండవలెను. సంక్షేపవాక్యములను జక్కఁగా విపులీకరించి వ్రాయుటయు, విపులగ్రంథసారాంశములను జిన్నవాక్యములతో సంక్షేపముగాను విస్పష్టముగాను వ్రాయుటయు, బాలుర కప్పుడప్పు డలవాటు చేయుచుండవలెను. నాలుగు గంట లఱచి చేసిన యుపన్యాసోపదేశముకంటె నలువదివ్యాసపంక్తులు దిద్దవలసినట్లు దిద్ది సహేతుకముగాఁ దప్పులు కనఁబఱచుట విద్యార్థి కెక్కువయుపకారకర మని నాయభిప్రాయము.

వ్యాకరణసూత్రముల వల్లింపఁజేయుట నిరుపయోగమనియే నాయభిప్రాయము. క్రిందితరగతులలో వ్యాకరణాంశములు తప్పక వాచకపుస్తకములద్వారముననే బోధింపవలెను. అట్లుచేసినచో బాలురకు విసుగు పుట్టదు. సూత్రానుసారముగా వ్రాయుట ప్రధానముగాని సూత్రము ముఖస్థముగా నుండుట ప్రధానముగాదు. కవిత్వమునం దారితేఱి మత్తేభవృత్తము వ్రాయువాఁడు దానిఛందస్సు మఱచిపోవచ్చును, ఎవరైననడిగినచో గణవిభజనము గావించుకొని దాని ఛందోనియమముల నప్పుడు చెప్పును. ఈరూప మీకారణమున వ్యాకరణదుష్టరూపమని తేటమాటలతో బాలురకుఁ జెప్పినఁ జాలును. సమానలక్షణములు గలకొన్నిపద

ము:లు చదువుపుస్తకమునుండియే తీసి బాలునియెదుటఁ బెట్టి వానిచేఁ దత్కాలోచిత మగు వ్యాకరణసూత్రము గావింపవచ్చును. వ్యాకరణవిష యము లిట్లు బోధించుట బాలుర కింపుగానుండును. అట్లు సంపాదించు కొనినవ్యాకరణజ్ఞానము వ్యాసరచనకు మిక్కిలి సహకారిగా నుండును.

పరిషత్తువారు సమగ్రమైన యాంధ్రవ్యాకరణము తగినపండితుల చే వ్రాయించినచోఁ బిన్నలకును బెద్దలకును గూడ మిక్కిలి యుపకారక ముగా నుండును. వారి కట్టియుద్దేశ మిూవఱకే యున్నట్లును శ్రీసూర్య రాయనిఘంటునిర్మాణముకై పదసంగ్రహము చేయుట కేర్పఱుపఁబడిన కొందఱు పండితులచేత వ్రాయఁబోవువ్యాకరణమున కుపయోగించు ప్రయోగసామగ్రి ప్రామాణికగ్రంథములనుండి యిదివఱకే యెత్తి వ్రా యించినట్లును వినియున్నాను. దేశోపకారకమగు నీసంపూర్ణవ్యాకరణరచ నాభారమును వారు శీఘ్రముగా వహింతురుగాక యని ప్రార్థించుచు న్నాను.

ఈసందర్భమున వారి కొకమనవి చేసికొనవలసియున్నది. వ్రాయఁ బోవు వ్యాకరణమాంగ్లభాషలోని "Nesfield's Grammar" మున్నగు వానివలె సుగ్రాహ్యముగా నుండవలెను. ఆకృతిగణాదులపట్టికలు సాధ్యమై నంత సంపూర్ణముగాను సప్రమాణముగాను నుండవలెను. ఒకయక్షర ము తగ్గిన నొకపుత్రలాభము గలిగినట్లు వ్యాకరణకర్త లెంచిన నీవ్యాక రణమును వెనుకటి వ్యాకరణములవలె నయోమయముగా నుండును, నా వంటివాని కుపయోగపడదు. 'దీర్ఘపూర్వకలకారోపధకాదంతసంస్కృత సమమహచ్ఛబ్దములమిూఁదిలులలకు రురలగు' ననుసూత్రము గురుసా హాయ్యములేని బాలురకు బోధపడదు. "వ్యతిరేకంబున ముజ్ఞు పరంబగు నపుడు కుజియగు", "ఎదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముజ్ఞునకు వుజిరుజియగు" నను చిన్నయసూరి సూత్రములు చిన్నవారికేకాదు పె క్కురు పెద్దవారికిఁగూడఁ బాషాణప్రాయములుగానే యుండును. అట్టి

సూత్రము లందుండవని యనుకొనుచున్నాను. నాకోరిక గొంతెమకోరిక యేమో తెలియదు.

సంస్కృతపదములు దొరలకుండఁ దెలుఁగున నాలుగుమాటలు మాటాడలేము, నాలుగుపంక్తులు వ్రాయలేము. తెలుఁగునకు సంస్కృత-ము జీవనాధారము. సంస్కృత మొకమహానది, దానినుండి వచ్చిన పంట కాలువ తెలుఁగు. కావున వ్యాకరణములో సంధిసమాస తద్ధితకృదన్తవృ త్తుల సంస్కృతనియమము లాంధ్రోపయోగార్హము లగునన్నియును వ్రా యింపవలెను. ఛందోలంకారవిషయములుగూడ యథోచితముగా నందుఁ జేర్పింపవలెను.

పాఠశాలాధ్యక్షులో తన్నియుక్తు లగుమఱియొకరో యప్పుడప్పు డు తెలుఁగుతరగతులకు వెళ్లి పండితులు చెప్పుపాఠములు విని బోధన మార్గాదులందుఁ గానిపించులోపములను వారికి సోదరభావముతో బాలు రపరోక్షమునఁ దెలుపవలయును. లోపము లగపఱుచుటయేకాక పండితు లయెదుట వారును బరీక్షాధికారులునుగూడ నప్పుడప్పుడు మచ్చుపాఠము లిచ్చి మంచిపద్ధతు లగపఱుచుచుండవలయును. ఇట్లు చేయుచున్నచో, నాంధ్రభాష యచిరకాలములో బహుశాఖాపత్త్రపుష్పభరిత మగుపాద పమువలెఁ బెరిఁగి విద్యావివేకనాగరకతాఫలదాయినియై దేశము నభివృద్ధి పఱుపఁగలదని నాయభిప్రాయము.

వ్యాస మీవఱకే యతిదీర్ఘమై మిమ్ము విసిగించినదేమోయని భీ తిల్లుచున్నాను. నే నింకఁ జెప్పఁదలఁచుకొన్న దేమియులేదు. శిరోభ్రమణ వ్యాధితోనుండి యిది వ్రాసినాను. న్యూనాతిరిక్తాదిదోషము లనేకము లిందుండవచ్చును. వాని నన్నిటిని సైరించి గుణలేశము లెచటనైన నున్నచో నవిమాత్రమే గ్రహింపుఁడని మరల మిమ్ముఁ బ్రార్థించుచు నా వ్యాసమును ముగించుచున్నాను.

---

శ్రీరామచంద్రా!

# ౮ నా నీడ.

కొన్నికొన్ని సమయములందు వింతభావములు మనసులో మనకందఱకును గలుగుచునే యుండును, గాని కవితాపాటవములేని సామాన్యజనులు వచ్చినట్లే వానిని బోనిత్తురు. కవులుమాత్రి మట్లు పోనీక వానిని చక్కనిపద్యములలోఁ బెట్టి చదువువారి కెందఱనో యానందింపఁజేయుదురు

"నానీడ" అనుదానినిగూర్చి యీక్రింద వ్రాసినఖండకావ్యమునకు మూలము ఆంగ్లేయభాషలో రాబర్టు లూయీస్టీవెన్సన్ (Robert Louis Stevenson) అను స్కాట్లెండుదేశపుకవి 19 వ శతాబ్దిలో వ్రాసినాఁడు. శైశవావస్థలో మందఱకును అట్టియూహలే పుట్టియుండవచ్చును.

గీ. పైకి నేఁబోవునపుడు లోపలికివచ్చు
నపుడు నాతోడ నేలొకో యరుగుదెంచు
నీడ కెప్పుడు నాచిన్నినీడ! దాని
వలనియుపయోగ మేదియో తెలియఁజాల.

గీ. పాదములనుండి యాదలవఱకు సరిగ
నెట్లు నేనుందు నట్టియు నట్లె యుండుఁ;
బవ్వళింపఁగ నే మెయి వ్రాల్చుమున్నె
చిత్రముగఁ దాను సెజ్జపైఁ జేరియుండు!

గీ. కొంచెముగఁ గొంచెముగఁ బెరుఁగుదురు శిశువు;
లంతె! యీనీడ "రబ్బరు"బంతి లేచు
పగిదిఁ బొడువుగ నంతలో నెగిరిపడుచు,
నింతలోఁ గ్రుంగి మాయమవా వింతగాను!

గీ. ఆటమర్యాద లెఱుఁగని యాకతాయ!
వెక్కిరించుచునుండునన్ బిఱికిపంద!
యెపుడు నన్నంటియే యుండు! నెంతొ సిగ్గు
పడుదు నట్లుండుటకు దాదికడను నేను.

ఉ. చక్కఁగ రాత్రిఁ బండుకొని, జాగ్రదవస్థకు వచ్చి, నేను బ్రొ
ద్దెక్కకమున్నె లేచి, పయికేగి, మనోహరమైనకాంతులన్
గ్రక్కెడుపూలవేల్పు హిమకంకణముల్గనుచుండ, నిస్సిరో!
పక్కనె యింక నింట నదిపండుక సోమరి! నిద్రవోయెడున్!

# ౫ మాయచొక్కా.

ఈఖండకావ్యము అమెరికాదేశపుగ్రంథకర్తయును రాజనీతిజ్ఞుఁడును అగు జాన్ హే గారిచే నింగ్లీషుభాషలో వ్రాయఁబడినది. ఈయన 1838 వ సం॥ లోఁ బుట్టినాఁడు. అతృప్తుఁడై యెప్పుడు చిరాకుపడుచు వ్యాధిగ్రస్తుఁడనైయున్నా ననుకొనుచుండిన యొకరాజుకథ యిందున్నది. సుఖవంతునిచొక్కా తొడుగుకొని యొకరాత్రి పండుకొనినఁగాని రోగనివారణము గాదని యొక తెలివిగల వైద్యుఁడు చెప్పినాఁడు. అట్టిసుఖజీవిని గనిపట్టుటకు దూతల నతఁడు తనరాష్ట్రము నల్దెసలకుఁ బంపెను. సుఖజీవి చివర కగపడినాఁడు గాని, వాఁడు పైని చొక్కాయైనను లేనిపరమదరిద్రుఁ డైనాఁడు. అంతట, నాయసంతుష్టుఁడైనభూపతి బుద్ధి దెచ్చుకొని సిగ్గుపడి సమస్తవిత్తవైభవములకంటెను సంతృప్తచిత్త మెంతో గొప్పదని తెలిసికొనెను!

ఆ. అనఁగననఁగనొక్కజనపతి యుండెను,
మంచితమిని లేదు మధురభక్ష్య
ములను బుష్కలముగ ముప్పొద్దులను మెక్కి,
గొంతువఱకు మనువు గోరిలుచుండె.

ఆ. శయ్య నొఱగులోడ క్ష్మాభర్త గుర్వెట్టి
నిద్రవోవుచుండె నిశలయందుఁ;
గెంపుచాయ నుండెఁ జెంపలు రెండును,
గన్నుదోయి తేటకాంతి నుండె.

ఆ. అయినఁ దన్ను గొప్పవ్యాధి యంటె నటంచు
భూపుఁ డెప్పు డింట మూల్గుచుండె;
నేఁచుచున్నరోగ మెటువంటిరోగమో
భూవిభుం డెఱుంగు! దేవుఁ డెఱుఁగు!

గీ. వందలకొలందివైద్యులువచ్చి; రైన
నొడయఁ డొక్కనిచే బాగుపడనికతనఁ,
గినిసి వారితల ల్నఱకించి క్రొత్త
వైద్యులకొఱకు బంటులఁ బంపసాఁగె.

సీ. వ్యాధిదేవత కిల్లు వైద్యాజశతముల
విభుఁడు నిత్యము బలులెత్తుచుండ,
వచ్చిరి వెజ్జులు ప్రభుకడ కిద్దఱు ;
వారిలో నొక్కఁడు బక్కవాఁడు,
వైద్యశాస్త్రగ్రంథపఠనతత్పరుఁ డౌచుఁ
గాలమంత నతండు గడపుకతన,
బాగుగాఁ దిని త్రాగి బలియుట కేనియు
లేశమైనఁ దెఱపి లేకయుండె ;

గీ. నొక్కగ్రంథంబుఁ జదువక యుండ నిఁక
రెండవయతండు నిజభిషగ్వృత్తియందు
హాయిగా నుండె ; రుగ్ణు లావంత శ్రమయు
నీయ రతనికి, వానియదృష్ట మేమొ !

క. రోగము కుదిరిన ధన్యుఁడు, బాగుగ ద్రవిణంబునొసఁగువానికి; రోగం
బేగక రోగిమెయేగినఁ, ద్యాగియగుచు దాయ రెట్టిధనమిడు నెలమిన్ !

ఉ. లోనికిఁబోయి యాయుభయులు న్మృదుశయ్యఁ బరుండియున్న భూ
జానిని గాంచి, నాలుకను జాఁపుఁడటంచుఁ బరీక్షసేసి, డెం
దాన నిజాంగుళీతతి మృదంగరవంబు లొనర్చి, యింక నె
న్నేనియుఁ జేసి ; రైనఁ దెవులేదియుఁ గన్పడలేదు లోపలన్.

సీ. బక్కభిషఙ్మణి పరికించి పరికించి
"స్వామి ! పూర్ణారోగ్యవంతులుగనె
యున్నారు, మీలోన నొక్కింత రుజయును
లే" దని చెప్పఁగా, లేచి నృపతి
సింహగర్జన మొందు చేసి కోపంబున
"నురిదీయుఁ డీశుంఠ నూరిబైటఁ !"

నని పల్క, రెండవయూతని నెమ్మోము
వ్రాలి యొక్కించుక పాలిపోయె;

గీ. నంతలో దేటి యూతండు చింతసేసి,
ముక్కుకొన నల్పుకొనుచుఁ "బ్రమోదభరిత
చిత్తునౌక్కాఁ దొడిగికొని క్షితిపతియొక
రేయి నిద్రింప రోగంబు వాయు" ననియె.

గీ. తురగములమీఁది కెగిరి తోడ్తోన రాజ
భటులు చని నాల్గుదెసలకు వాయుగతిని
బ్రభువురాష్ట్రంబు గాలించినైచినారు,
కాని కనఁబడఁడయ్యె నౌక్కసుఖియైన !

గీ. వృథగ సుఖికయి దూతలు వెదకివెదకి,
యెంతొ వేసారి, యొకపల్లెపొంతఁ బోవు
చుండఁ, బచ్చికబయలఁ బరుండి యీల
పాటలను బాడు చొకఁడు కన్పడియె నటను.

గీ. పెద్దనవ్వులు నవ్వుచుఁ బ్రీతిఁ బూరి
పైని దొర్లెడునాజాల్మ-వరుసఁ జూచి,
చట్టనను నిల్చి రంద ఆశ్చర్యపడుచు;
నంత నం దొక్కఁ డతనితో ననియె నిట్లు——

క. పట్టఁగరానిముదంబున, నిట్టాడుచుఁ బాడుచుందువీ; వింతసుఖం
బెట్టబ్బెనయ్య? యీశ్వరుఁ, డెట్టికృపన్జూపె నీదునెడ!——నా, నంతన్

క. ఎన్నోపను లొనరుపవలె; ఖిన్నత కవకాశమేది క్షితి సోమరి? కం
చు న్నవ్వె నతఁడు మిన్నున్, మన్నన్మ్రోగ్ప్రియహాస మహితధ్వనిచేన్.

గీ. అడిగినయతండు సంతోషమంది, తోడి
భటుల నారసి, మనకుఁ గావలయు వాని

కడకె మనభాగ్యదేవత కడకు మనలఁ
దీసికొనివచ్చె ! నని పేదదెసకుఁ దిరిగి

క. "ఈయొకరేయికి నీచో, క్కా- యెరవుగ నొసఁగు దేని, కనకమయముల
వేయివరహాల నీకిపు, డేయిచ్చెద హాయి బ్రదుకుమీవిఁక" ననియెన్.

గీ. ఆశీనటువంటిమాటల నాలకించి,
"యీయ కేమయ్య నాకుఁ జొక్కా- యొకటియు
లేదు గాని !" యటంచు, నాపేద దొర్లి
మొగము గందఁగ నొకపెద్దనగవు నగియె !

సీ. అనుదిన మెప్పటికప్పుడే యకృతార్థు
లై నదూతలు వార్తలంపుచుండి
రవనీశునకు ; మనుష్యానుభావ్యము లగు
సర్వార్థులును సువిస్పష్టముగను
భూపుమనశ్చక్షువులకుఁ గన్పడుటచే,
"నయ్యయ్యొ ! నే నెట్టివ్యర్థజన్ముఁ
డను ! లోనఁ బడియుండి, పనికిమాలినచింత
లను జిక్కి, వెడతెవుళ్లను దవిలితి !

గీ. నౌర ! యెట లేనిరోగంబు లనుభవించు
చుంటి !" నని సిగ్గుపడి, యంతనుండి రాజు,
గదులకిటికీలు దెఱపించి, గాలి సొరఁగఁ
జేసి, సుఖముగఁ గడపెను జీవనంబు.

గీ. ఇంటఁ బడియుండకావలికేగి నృపుఁడు,
పసిగఁ దనరాజ్యకృత్యము ల్సలుపుకొనియెఁ ;
బ్రభుని దీవించి రెలమిని రాష్ట్రజనులు ;
తేఁడు నీరోగతోల్లాస హృదయుఁ డయ్యె !

శ్రీరామచంద్రా!

# ౬ జీవపరిదేవనము.

తండ్రీ! రామచంద్రప్రభూ! నిన్నే నాయిష్టదైవతమును జేసికొని చిరకాలమునుండి భజించుచున్నాను. మనుష్యుఁడెట్లు దేవుఁడు కాఁగలఁడు? అను యుక్తివాదములు నన్నెంత యూఁపి యూటాడింపఁజూచుచున్నను అవ్యక్తభగవత్తత్త్వము గ్రహింపఁజాలని మందబుద్ధినగుటచేతఁ గాఁబోలు నీపాదారవిందములపై వ్రాలిన నామనస్సు మరలింప లేకున్నాను. నీవు గొప్ప భగవదవతారపురుషుఁడవనియును నీనామము తారకనామమనియును నే నింకను విశ్వసించుచున్నాను. "ఎవఁడు నన్నే రూపముతో నేనామముతో సేవించునో వానియభీష్టము లారూపముతోను ఆనామముతోను నేను నెఱవేర్చెదను" అను గీతాప్రతిజ్ఞ ఆవిశ్వాసమును బలపఱచుచున్నది. శ్రీగాంధిమహాత్మునికి రామనామమహిమయందుండు నమ్మకము "నీవు తప్పత్రోవ ద్రొక్కుటలేదు" అని నన్నెచ్చరించుచున్నది. భగవంతుఁడున్నాఁడో లేఁడో అనువారిని జూచితినిగాని రాముఁడు లేఁడనువారిని మాత్రము నేఁ జూడలేదు.

"ఓరీ! అఱువదియెనిమిదవయేఁట నీపిచ్చియుపోద్ఘాతప్రలాపము లేమి?" యని యడిగెదవేమో, విను, విన్నవించుకొనెదను.

నీవు నన్నుఁ బుట్టించిన కుటుంబము ధనవత్కుటుంబము గాకపోయినను సత్కుటుంబము. నాతండ్రియును బినతండ్రులును తల్లియును జిన్నమేనత్తయును భగవద్భక్తులు, జ్ఞానసంపన్నులు. అందు నాపెద్దపినతండ్రి అఖండరామభక్తుఁడు. నీపవిత్రనామ మాయనజిహ్వపై నెప్పుడును తాండవమాడుచుండెడిది. ఆయనపిచ్చియే కొంతవఱకు నాకును అంటినది. ఆయనకుండిన యవ్యాజకుటుంబానురాగమును స్వార్థత్యాగమును జూచి.

యే యేకాకినగు నేను కుటుంబసంగపాశములలోఁజిక్కి పడియున్నాను. నాబాల్య యౌవన కౌమారములు నీకృపవలన సుఖముగాఁ గడచినవి. నాయం దత్యంతప్రేమగల నాపెద్దతమ్ముని అకాలమృత్యువు తన నోటవై చుకొనినను, నా సత్కళత్రముయొక్క సానురాగానునయపోషణములచేఁ గొన్నాళ్ల కాదుఃఖము దిగమ్రింగి తేలుకొన్నాను. తరువాత మఱి రెండు పెద్దదెబ్బలు పైనిబడినవి. కంటినిరెప్పవలె నన్నుఁ గాచుకొనుచుండు నా భార్య పరమేశ్వరీసన్నిధానమునకుఁ జనినది. ఆదుఃఖము చల్లారకముందే, నన్నుఁ గడుభక్తిప్రేమములతోఁ గనుపెట్టుకొని చూచుచుండిన కనిష్ఠసోదరుఁడు కూడఁ గనుమొఱఁగి నాకలోకమునకుఁ బోయినాఁడు. ఇల్లంతయుఁ జీకటియైనది. నాముప్పుగడపునని యెవనిపై నేనాశపెట్టుకొనియుంటినో వాఁడు, వలవలయేడ్చుచున్న తనభార్యను తల్లి యేల యేడ్చుచున్నదో యెఱుఁగని ముగ్ధశైశవములోనున్న యొకకొడుకును గూఁతును "నీవుపోషింపు" మని నాతో చెప్పకచెప్పి పాఱిపోయినాఁడు. సన్యసించుటకుఁ గావలయు వైరాగ్యము నాకు లేకపోవుటచేతను, తండ్రిలేని యా పిల్లలను బోషింప శ్రమపడి యార్జించుటకుఁజాలిన జవసత్త్వము లింకను నుండుటచేతను, అది నీ యాదేశమేయని భావించి యింతవఱకును లోటేమియు లేకుండ వారిసంసారము సాఁగునట్లు చేసినాను. ఉభయులకును పెండిండ్లయినవి. కుమారుఁడు నీయనుగ్రహమువలన నాలుగునెలలలోఁ బరీక్షయందుఁ జరితార్థుఁడయి స్వతంత్రజీవనసామర్థ్యమును సంపాదించుకొని యింటికి రావచ్చును.

ఇట్లుండఁగా నొక మహావిపత్తు తటస్థింపఁజేసినావు. ఎంతో యనురాగముతోఁ బెంచిన ఆయాఁడుపిల్ల, చిన్నప్పుడు పీఠియరుఁగుమీఁదఁ గూరుచుండి నాతో భజగోవిందశ్లోకములును భక్తికీర్తనలును పాడుకొనుచుండెడుబిడ్డ—అన్నపూర్ణ—పదునాలుగురోజులు చెప్పరాని బాధపడి కడచిన సోమవారమునాఁడు గతించినది. ఈదుఃఖ మెట్లు భరింపఁగలనో

మెఱుఁగను. ఇంకను బ్రతుకవలయునను ఆశ దానికుండెను. పంచొమ్మిదేండ్లింకను నిండని పసిమానవుఁ బ్రాణముపై ఆమాత్రిప్పు తీపియుండుట విపరీతముగాదు. కాని దానిమరణములో వివేకులగు పెద్దలకుఁగూడ వింతగొల్పెడు ధైర్యచిహ్నములు కొన్నిగలవు. రోగము బహుదోషయుక్తమగు "టైఫాయిడ్" జ్వరమైనప్పటికిని, చచ్చిపోవువఱకు స్మృతి నిర్మలముగానుండెను. కష్టసహనశక్తి అత్యద్భుతము. ఎంతబాధపడుచుండినను "అమ్మా! నీబాధ యెట్లున్నది?" అని యడిగినప్పుడు "కొంచెము నెమ్మదిగానున్నది నాన్నగారూ!" అని స్ఫుటమైనవాక్కుతో చెప్పెడిది. నామనస్సు కళవళపడునని యట్లు పలికెడిదిగాని బాధ తగ్గుటచేతఁగాదు. నాకును భర్తకును తల్లికిని అన్నకును వదినెకును ఇతరులకును జెప్పిన చివరహితోక్తులు మహావివేకసూచకములు. మృతిభీతి అణుమాత్రిమైన నగపడలేదు. భగవన్నామోచ్చారణము చేయుచుఁ బ్రాణములువిడిచిన యాయద్భుతవ్యక్తిని జూచి "అన్నయ్యా! మనకుట్టిది గీతలోఁజెప్పిన స్థితప్రిజ్ఞురాలుగాఁ గానిపించుచున్నదిసుమా" యని నాతమ్ముఁ డన్నాఁడు. పుట్టినింటికిని మెట్టినింటికిని కీర్తి తెచ్చిన యాపిల్లప్రాణములు నిల్పుకొనుటకై నాస్థితిలో నున్నవానికి సాధ్యమైన యావత్ప్రియత్నములును చేసినాను. కన్నీళ్లతో నిన్నుఁ దలఁచుకొని ప్రార్థించినాను. జపమాలపై నీనామ మనేకపర్యాయములు జపించినాను. అంతయును బూడిదలోఁ బోసిన పన్నీరై పోయినది. కారణమేమో నీవే చెప్పవలెను.

'నీడబ్బు దోష' మందువా? నేనార్జించినద్రవ్యములో నొకదమ్మిడియైనను అన్యాయార్జితములేదని నీయెదుట నిలఁబడి నీమీఁద నొట్టుపెట్టుకొని చెప్పఁగలను. "నీకర్మ" మందువా? కర్మము జడము. అదేమి చేయఁగలదు? సర్వశక్తుఁడవును సర్వాధికారివిని అగు నీకు కర్మముపై నధికారముండదా? దుష్కర్మఫలమును గొట్టివేయఁజాలినశక్తి నీకులేదా? ఉన్నది. ఉండియును కర్మముపేరుచెప్పి జీవుల నిట్లు నీయిష్టమువచ్చినట్లు

త్రిప్పలఁబెట్టుచున్నావు. "నేనొక రాజమాత్రుఁడనుగాని భగవంతుఁడను గానురా వెఱ్ఱివాఁడా! నిరపరాధుఁడగు వాలిని నిర్దోషుఁడగు శూద్రతపస్విని జంపినాననియు, మహాసాధ్వియును గర్భవతియునగు కాంతను గాంతారముల పాలుచేసినాననియు, నాలోపము లెంచుచున్నారు ప్రజలు. భగవంతుఁడు నాపై వాఁడు. అతని సేవింపు" మందువా? ఈబెల్లిమాటలకు నే లొంగను. ఎట్లో నీబాధ్యత తొలఁగించుకొనవలెనని మృషావాక్యము లాడుచున్నావు. అమూర్తిమంతుఁడును అదృశ్యుఁడును నైన భగవంతుఁడు సృజించినసృష్టిలో మాత్రము వైషమ్యనైర్ఘృణ్యాలక్షణము లెన్ని కనఁబడుటలేదు? లయకర్తయును రక్షకుఁడును ఒక్కఁడే యెట్లు కాఁగలఁడు? నీచరిత్రలోని సందేహములకంటె సృష్టికర్తచరిత్రలోని సందేహము లెక్కువగాఁ గానిపించుచున్నవి. నీవే ఆభగవంతుఁడవు. లోకరక్షణార్థము మనుష్యుఁడవై పుట్టితివి. మాయతో మావంటి మనుష్యునివలె నటించితివి, అంతే. ఆభావన నాకుఁబోదు. అది నాప్రారబ్ధము. కొట్టినతల్లినే మఱింతగట్టిగా నంటిపట్టుకొను బిక్కశిశువువలె నేను నిన్ను వదలలేను. ముంచినను నీవే, తేల్చినను నీవే!

నీవు దుర్విజ్ఞేయుఁడవు. "యస్యానుగ్రహమిచ్ఛామి తస్యవిత్తం హరామ్యహమ్" అన్న దయామయుఁడవు. నీమాయ యంతకంటెను దుర్విజ్ఞేయము. నీమాయలోఁ బడవైచి నన్ను బాధింపకుము. ఇఁక నట్టి బాధలు పడుటకుఁ జాలిన దేహబలమనోబలములు లేవు. ప్రేమచేతనే నేను జెడిపోవుచున్నానని నీకుఁ దోఁచునెడల, రాతిగుండెయే సుఖజీవనమున కావశ్యకమగునెడల, నన్నీనన్నుఁ బాషాణహృదయునిజేసి నాకు మనశ్శాంతి యొసఁగుము! నీయందు నాకుండుభక్తిని శుద్ధముచేసి దృఢీకరించి నన్ను నీయక్కునఁజేర్చికొనుము. మమ్మందఱను దుఃఖసాగరములో ముంచిపోయిన మాఅన్నపూర్ణ ఆత్మకు ప్రశాంతిసుఖమును మోక్షానందమును బ్రసాదింపుము. తండ్రీ! యివే నీకు నాశతసహస్రవందనములు!

మ. వృకసందోహము పొంచియుండి పొలమం దేకాకిగానుండు వృ
ద్ధకపద్మంతముపైకి దూఁకుగతి దుర్దాంతానులున్వ్యాధులున్,
జకితస్వాంతతనుండు నన్నణిమి యేఁచ న్జొచ్చె ! గోపాలనా
మక ! రక్షించుట కీవెకక్కఁడవు రమ్మా ! రామచంద్రప్రభూ !

శా. వంతంబెట్టెడు చిత్తవృత్తులను జంప న్నీశుభాఖ్యోత్కరం
బెంతో శ్రద్ధ జపింపఁజూడ నకటా యేయొక్కఁడన్నిల్వ కీ
స్వాంతంబన్కపి యిచ్చవచ్చినటు సంచారంబు గావించెడున్
శాంతిస్థైర్యములిమ్ము దానికి రమేశా ! రామచంద్రప్రభూ !

శా. బాధల్రోఁతలు నన్యులెక్కుడుగ సేవల్చేయు నావశ్యమున్
గ్రోధం బిట్టవిలేని సన్మృతియు, హృచ్ఛోకశంబునం దప్పు స
ర్వాధివ్యాధిహరత్వదీయశుభదివ్యాంఘ్రిద్వయి న్నిల్పుకొం
చేధైర్యంబుననుండు పాటవము నీవే ! రామచంద్రప్రభూ !

మ. అనుతాపాగ్ని మదీయకిల్బిషవనం బాపూలదాహంబుచే
సినవెన్క న్భవదీయభవ్యగుణసంస్మృత్యాదులం బిట్టు నా
కనులంబుట్టు సుశీతలాశ్రుతతి నాకాఁకన్శమింపంగఁజే
సి నను న్భక్తిసుధాబ్ధిఁ దేల్పఁగదవే ! శ్రీరామచంద్రప్రభూ !

శా. నీపాదాంబుజచింతనాభ్రధునిలో నే స్నానముంజేసి, నా
పాపౌఘంబులఁ గడ్గివైచుకొని శుభ్రస్వాంతతన్నిల్చి నీ
రూపంబున్మదిఁగట్టి మృత్యువును మిత్త్రింబోలె రావోయి ! యం
చాపద్బాంధవ ! పిల్చునిర్భయత నీవా ! రామచంద్రప్రభూ !

---

## ౭ కాలమహిమ.

గీ. తెలిసినట్లుండి నిండుగాఁ దెలియనట్టి
వానిలో ముఖ్యముగ మూడు గానిపించు ;
గాల మనునది యొకటి యాకాశ మొకటి
ప్రథమకారణమగు పరబ్రహ్మ మొకటి.

గీ. బ్రహ్మ మాకాశము మన కప్రస్తుతములు ;
కాల మెట్టిదో యూహించి కాంత మింకఁ ;
గరణతతి కది గ్రాహ్యంబు గాదు, కాని
యుంచు కెఱిఁగించు దాని జ్ఞానేంద్రియములు.

గీ. ఛాయ లర్కేందునక్షత్రచయగతులును,
సలిల వాలుకా యంత్రాది సాధనములుఁ,
బలురకంబుల గడియారములును, మనకుఁ
బ్రకృతకాలంబు దెలియఁ దోడ్పడుచునుండు.

గీ. పరిమితంబయి యాద్యంతవంతమైన
కాల మాకాశ మెఱుఁగంగఁ గలము గాని
యలవికాదు తెలియ ననాద్యంతము లగు
కాలపృథువాహినీ మహాకాశములను.

గీ. భూతకాలంబునకు నెట మొదలు లేదు,
కడ గనఁగరాదు రాఁబోవుకాలమునకు,
మొదలుఁ దుదియును గలిగి సంపూర్ణముగను
మన మెఱుఁగఁ జాలునది వర్తమాన మొండె.

గీ. అరయలేఁ డెవ్వఁడును భవిష్యత్తు తెఱఁగు,
నేగినతఱిని వెన్కకు లాగలేఁడు,
కనుక నెవ్వఁడుఁ బ్రస్తుత కాలమందె
చలుపుకొనవలెఁ దాఁ జేయవలయు పనులు.

గీ. కావునసె కాలపురుషుని గవులు ముందు
జుట్టొకించుక కల్గినయట్టి బోడి
నెత్తిముదిఘావసుఁ డని వర్ణించి ; కాఁప
వలయు నతనిఁ బురశ్శిఖ పట్టుకొనిమె.

గీ. కాలమూ ! నీవు చేసెడు మేలు చాల
నుండినను, మారణోద్యోగయుక్తునిగనె
నిన్ను భావింతు ; రట్లు గాకున్న మృతికిఁ
గాలధర్మం బనెదు నామ మేల వచ్చె ?

గీ. ఈడు చూడక గుణములు చూడ కాప్త
జనులయేడ్పులనైనను సరకుగొనక
వ్యాధి జడశక్తిసమితి తోడ్పాటు గొనుచుఁ
బెక్కుప్రాణుల నీపొట్టఁ బెట్టుకొందు.

గీ. ఒక్కతమ్మునికూఁతును మెక్కినావు,
దానఁ దనియక యింకొక్కతమ్ముపెద్ద
కొడుకు దిగమ్రింగినా వింత క్రోధమేల
కలిగెనో నీకు మామీఁదఁ దెలియరాదు.

గీ. పెద్ద వైద్యపరీక్షలో విజయమంది
విజ్ఞుఁడును మంచివాఁడను పేరుపొంది
యిరువదేడేండ్లకే వాఁడు మృతినిబొందెఁ ;
గాలమూ ! నిన్ను నేమనఁగలను నేను ?

గీ. ధనము ఖ్యాతియు నార్జించి తనకుటుంబ
ముద్ధరింపవలయువాని యసుఁబుగొంటి ;
వటువదేడేండ్లు గడచి జీర్ణాంగములను
వరుగువలె నుండు నావంటిబడుగు విడిచి.

గీ. చదువుకై వాని కెంతయో సాయమైతి
వాఁడు కాఁగలవాఁ డంచు వాని పెంపు

యశమును గని సంతసింతు నేనంచు; నట్టి
యాస యంతయు భగ్నంబు చేసినావు!

గీ. "తొంటి భవములఁ జేసిన దోసఁగులె సుమి
యిట్టి కష్టాలలో మిమ్ముఁ బెట్టె" నందు
వేని బీహారులోఁ జూడు మొంతమంది
మృతులఁ జేసితో భూకంపమిషము పెట్టి.

గీ. పూతచారిత్రయా సీత పుట్టినట్టి
పుణ్యపురుషుండు బుద్ధుండు పుట్టినట్టి
భూమి, నాపన్నులైన స్త్రీపురుషులందు
నొకతె నేనియు నొకనినే సుకృతిఁ గనవె?

గీ. చాలుఁ జాలును సమయాఖ్యశమన! చాలు!
సుఖమునకు నీకు నెప్పుడుఁ జుక్కయెదురె;
కానిచోఁ దొల్తఁ గల్గు సౌఖ్యంబు నీదు
వాతఁబడి యేల తగ్గును బ్రాఁతవడుచు?

గీ. మట్టమధ్యాహ్నపుంజాయ మాడ్కి నీవు
ముడుఁగుదువు మేము సుఖముండునెడను; దుఃఖ
పడెడునెడ సంజలోనీడవలెఁ బెరుఁగుదు;
కాల! యెట్టి దుష్ప్రకృతియొ కనుము నీది!

గీ. ఊర కేనిట్లు తను దూఱుచుండ, ముసలి
కాలపురుషుఁడు చిఱునవ్వు కందళింపఁ
జల్లమాడ్కల ననుఁజూచి మెల్ల వీఁపు
చేతఁ దట్టుచు ని టుపన్యసింపఁజొచ్చె.

గీ. కేవలసుఖంబు నిచ్చెడి వేవి లేవు,
కేవలము దుఃఖ మిచ్చెడి వేవి లేవు,
సృష్టిలో నుండు నన్నింటి రీతి నేను
నెలమియును వంతయును గూడ నిచ్చుచుందు.

గీ. ఒకనిదుఃఖంబు లొండొక్కనికి సుఖంబు,
లోకనియమృతంబు వేఱొక్కనికి విషంబు,
కాన నే సందఱకు దుఃఖకారి ననుట
యరయ ననృతంబె కాని సత్యంబుగాదు.

గీ. చావులేనట్టి సదన మెచ్చటను లేదు,
పుట్టినవి యెల్లఁ దప్పక గిట్టు నెపుడొ,
బ్రతుక నర్హము గానట్టి ప్రాణి మఱియుఁ;
గుఱ్ఱ! యందుల కేడ్చుట వెఱ్ఱితనము.

గీ. చక్రవర్తులు శూరులు చతురమతులు
సృష్టి మొద లిప్పటివఱకు నెంద ఱీల్గి?
రెంద ఱేడ్చిరి? వారలముందు నీదు
వారలును నీవు నేపాటివారు బిడ్డ?

గీ. ప్రేమబంధానుసారియై విరహదుఃఖ
ముండుఁ, గన్క నతిప్రేమ ముండఁజనదు,
ప్రేమయెల్ల నొక్కనిపైనె పెట్టకుండ
జగతిఁ బాత్రుల కది చక్క సరదవలయు.

గీ. ఇంచుకైనను బ్రతిఫలాపేక్ష లేని
ప్రేమ యొకటె యబాధకప్రేమ; సర్వ
మస్థిరంబను బుద్ధినే యట్టిప్రేమ
నైన నగపఱుపవలయు నన్యులపయి.

గీ. "తల్లివలె శిశువులఁ బెంచి తన్నుఁ బొమ్మ
టన్న నిశ్చింతయై పోవునట్టి దాది
వలెను బిడ్డలఁ బ్రేమింపవలయు" ననెడి
రామకృష్ణోపదేశంబు నేమఱితివి.

గీ. పరసుఖముపైని నాధారపడఁగనీకు
నీసుఖంబును ; గానివి నెత్తిమీఁద
వైచుకొని బాధపడకుము ; వట్టిసోమ
రులను బోషింప ముదిమిని సుర్కి చెడకు.

గీ. దృఢమనస్కత నొడఁగూర్చు నెఱుక లేక
యుంట, సీతావళముఁ ద్రిప్పుకొంట రామ
నామమును నోటఁ దలఁచు గొణఁగుకొంట
చాలినవి గావు దుఃఖోపశాంతి చేయ.

గీ. ఆది నరులకుఁ గల్గు సౌఖ్యాతిశయము
క్రమముగాఁ దగ్గునంటి నాకతన ; నాఁడు
హృదయ మేర్చిన నీదుఃఖ మెవనివలన
నిపుడు తగ్గెనొ కొంచె మూహించి చెప్పు.

గీ. వట్టియవివేకమున నేడ్వవలదు నీవు ;
పాఱఁద్రోలు మహంమమకారముల, న
డంపు మీర్ష్యను, భేరాసఁ జంపుకొనుము,
శాంతముగ జీవనము సల్పి చనుము పిదప.

గీ. సచ్చిదానందకృతసృష్టిఁజొచ్చె నెట్లు
మృతి జడత దుఃఖ మని నన్నుఁ బృచ్ఛసేయ ;
కేబుషియు నేమతము మనస్తృప్తికరపు
టుత్తరము దాని కేయెడ నొసఁగలేదు.

గీ. ఇట్లు బోధించి కాలుఁ డదృశ్యుఁ డయ్యెఁ ;
గాలరూపుఁడై దేవుఁ డస్గ్రిథసూక్తి
జ్ఞప్తి కేతేరఁ గనుల బాష్పములు గాఱఁ
జేతులను మోడ్చి జోహారు చేసికొంటి.

---

శ్రీరామచంద్రాయ!

# ౨ శ్లోకత్రయము.

నాబోఁటి సామాన్యులకు వేదవేదాంతాదిగ్రంథములు దురవగాహములని యెంచి, తరచి తీసిన తత్సారముఁ గొన్ని శ్లోకములలోను పద్యములలోను బొదివిపెట్టి, మహానుభావులగు మనపూర్వులు కొందఱు వానిని మన కమూల్యమగు ఆస్తిగా విడిచిపెట్టి వెళ్లినారు. అట్టి శ్లోకములు మూఁడీక్రింద వాని తాత్పర్యముతో వ్రాయుచున్నాను. అట్టి విలువగలిగిన తెలుఁగుపద్యములు కొన్ని సుమతి వేమన శతకాదులలోఁ గూడ నున్నవి. చిలుకపలుకులుగాఁ బఠించిన వానిలాభము పొందఁజాలముగాని, వానిని మన నిత్యాచరణములోఁ బెట్టుకొని నిష్కపటముగాఁ బ్రవర్తించినయెడల నిట నట మనము సుఖపడి యితరులనుగూడ సుఖపెట్టుదుము. వ్యక్తిసమూహమే ప్రజయగును గనుక, వ్యక్తిక్షేమము ప్రజాక్షేమముగాను దేశక్షేమముగాను బరిణమింపక మానదు. మఱియుఁ, జర్మచక్షువుల కగోచరములగు ననేక సృష్టివిచిత్రములు సూక్ష్మదూరదర్శనయంత్రసాహాయ్యమున మన కగపడునట్లు, అనుష్ఠానజన్యమైన యనుభవజ్ఞానమువలన అన్యథా అప్రాప్యుఁడును అవాఙ్మనసగోచరుఁడును అగు పరమేశ్వరుని యథార్థతత్త్వము క్రమక్రమముగా బయలుపడి మనకు దివ్యానందప్రదాయియగునని పెద్దలు చెప్పుచున్నారు. ఇంకొకమాట, ఒక గింజనుండి సజాతీయములగు పెక్కుగింజ లుత్పన్నములగునట్లు, ఒక గుణమువలన ననేకగుణములును ఒక దోషమువలన ననేకదోషములును బుట్టును. సత్యనియమముగలవానికి ధైర్య కష్టసహన స్వార్థత్యాగాది సదభ్యాసములలవడక మానవు. కామాయత్తునకుఁ గ్రోధాసూయామద్యపానక్రౌర్యచౌర్యాసత్యాది దుర్గుణము లారోగ్యనష్టముతోపాటు గలుగుట పెక్కుపట్లఁ జూచుచున్నాము.

(1) శ్రుతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నాః
మహాఋషీణాం మతయశ్చ భిన్నాః
నైకోమునిర్యస్యమతం ప్రమాణం
మహాజనా యేన గతా స్సపంథాః॥

శ్రుతులు భిన్నముగా నున్నవి, స్మృతులు భిన్నముగా నున్నవి, మహర్షుల మతములును భిన్నముగానున్నవి; (పూర్ణ) ప్రమాణముగాఁ గొనఁదగిన ఋషియొక్కఁడును గనఁబడఁడు. కనుక మహాజనులు నడచునదియే యవలంబనీయమగుమార్గము—"నేనుజేసినట్లు చేయక చెప్పినట్లు చేయుము" అను విపరీతబోధకులవలెఁగాక నిర్మలచారిత్రులును ఆదర్శ ప్రవర్తనులును అగు మహానుభావు లొకరు చూపనక్కఱలేకయే సూర్యచంద్రులవలె వెలుఁగుచుందురు.

(2) శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం॥

కోటిగ్రంథములు వచించుమాట యర్ధశ్లోకములోఁ జెప్పుచున్నాను. పరోపకారముచేఁ బుణ్యము వచ్చును; పరపీడనముచేఁ బాపము వచ్చును—పరోపకారముచేయలేనివారు ప్రథమావస్థలో పరాపకారము చేయకుండుటయైనను నభ్యసింపవచ్చును.

(3) ఇంద్రియాణాం జయీ శూరః ధర్మంచరతి పండితః
సత్యవాదీ భవే ద్వక్తా దాతా భూతదయాపరః॥

ఇంద్రియములను జయించువాఁడే శూరుఁడు, ధర్మమాచరించువాఁడే పండితుఁడు, సత్యము పల్కువాఁడే వక్త, భూతదయాపరతగలవాఁడే దాత—జితేంద్రియుఁడు మహాయుద్ధవీరునకంటెను ఎక్కువవాఁడు, ధార్మికుఁడు మహాపండితునికంటెను ఎక్కువవాఁడు, సత్యవాది మహావక్తకంటెను ఎక్కువవాఁడు, భూతదయాపరుఁడు మహాదాతకంటెను ఎక్కువవాఁడు.

లోకా స్సమస్తా స్సుఖినోభవంతు !

---

# ౯ అస్పృశ్యత.



పెంపుడుకుక్కయును పెంపుడుపిల్లియును స్పృశ్యము లైనప్పుడు, మనుష్యజాతులలో నేదియుఁ గేవలము పుట్టుకచేత అస్పృశ్యమనుట న్యాయ్యముగాదు. హరిజనుల నస్పృశ్యులఁగాఁ జిరకాలమునుండి మనము చూచుటవలన నిజముగాఁ దా మట్టివారే యనుకొని వా రాత్మగౌరవముఁ గోల్పోయి విద్యావిహీనులై వాసగ్రాసవిహారములయందు శుచితాశుభ్రతలు లేక చెడిపోయినారు. శోచనీయమైన వారి దుస్థితికి వారికంటె వారిని నీచముగాఁ జూచుచుండిన పైజాతివారే ప్రబల హేతువు లనుట సత్యదూరము గాదు.

మఱియొక యన్యాయము చిత్తగింపుఁడు. మనమతము వదలి యేహరిజనుఁడేని యితరమతస్వీకారముచేసినతోడనే మనకు స్పృశ్యుఁడును గౌరవపాత్రుఁడును అగుచున్నాఁడు. ఎట్టి మతోన్మాదగ్రస్తుఁడైనను ఇది నిజమైన మతాభిమానమని చెప్పఁగలఁడా? క్రైస్తవులలోఁ గలసిన హరిజనులు ఇండ్లు శుభ్రముగా నుంచుకొని శుభ్రమైన బట్టలు కట్టుకొనుటకుఁ గారణమేమి? ఇతరులు వారికి గౌరవముచూపి విద్యాబుద్ధులు చెప్పించుటయే. అస్పృశ్యతాబాధవలన నేఁటేఁట నెన్నివందలమంది మన హిందూమతపు హరిజనులు మతాంతరప్రవిష్టు లగుచున్నారో చూడుఁడు. సంఖ్యలో మన హైందవసంఘ మెంత దుర్బలమగుచున్నదో యాలోచించుకొనుఁడు.

పరంపరగా వచ్చుచున్న యాచారము నెట్లు నిరసించి ప్రవర్తింపఁగలమని సందేహించుట సదాచారములపట్లైన నగును గాని దురాచారములపట్లైనఁ గాదు. సదాచారమేదో దురాచారమేదో సామాన్యజనులు కనుఁగొనుటెట్లు? సంఘములోని పరమపూజ్యులు స్వయముగా నాచ

రించి బోధించునవి సదాచారములు. వారు నిషేధించి యాచరింపకుండు నవి దురాచారములు.

ఎట్టివారు పరమపూజ్యులు ? నిశితమైనబుద్ధి, దూరదృష్టి, సచ్ఛీలము, అంతర్బాహ్యశుచిత్వము, విపులమైన లోకానుభవము, అనహంకారము, అవ్యాజదైవభక్తి, స్వార్థత్యాగము, పరోపకారపరాయణత్వము, దేశాభ్యుదయ తీవ్రకాంక్ష, సత్యదీక్ష, అహింసావ్రతము, తోడిజనుల దైన్యమును దొలఁగింపఁ బ్రాణములైన నర్పించుటకు సిద్ధముగా నుండు మేరుధైర్యము, దేహాత్మబుద్ధి సడలినవైరాగ్యము, అఖండబ్రహ్మచర్యము—ఇవియు నిట్టివియును పరమపూజ్యుల లక్షణములు ; వారే శిష్టు లనఁదగినవారు ; వారు తమనిత్యప్రివర్తనమందుఁ జూపుచర్యలే తక్కువారు సదాచారములుగాఁ బరిగణించి అవలంబింపఁదగినవి ; వారే సజీవధర్మశాస్త్రములు, జంగమశ్రుతులు; అట్టి వారిలోనివాఁడే గాంధి మహాత్ముఁడు.

కలియుగాంతమువఱకు అమలులో నుండవలయు విధినిషేధరూప ధర్మముల నేర్పాటుచేసిపెట్టిన పరాశరాదుల వాక్యములకు ఆయనబోధన ములు విరుద్ధముగా నున్నచో నవి యాచరింపవచ్చునా ?

కలియుగాంతమువఱకు సంఘధర్మములను విధించిపెట్టు సమర్థత, యెట్టి తపస్సంపన్నుఁడైనను ఎట్టి పరోపకారియగు బుద్ధిశాలియైనను, మనుష్యమాత్రున కుండఁజాలదు. ఎంత గొప్పవాఁడైనను మనుష్యుఁడు కించిజ్జ్ఞుఁడును సప్రమాదుఁడును గాని భగవంతునివలె సర్వజ్ఞుఁడు కాలేఁడు. ఒకకాలపు బుద్ధిమంతులును యోగ్యులును వ్రాసిపెట్టిననియమములు మఱియొకకాలమునకు సరిపడనప్పుడు తత్కాలపు ధీమంతులును శీలవంతులును వానిని సవరించి క్రొత్తనియమముల నేర్పఱుతురు, ప్రజలు వానిని శిరసావహించి యవలంబింతురు. ఇదియే సర్వదేశములందును సర్వకాలములందును జరుగుచున్నపని. ధర్మములు కాలములనుబట్టియు

స్థితిగతులనుబట్టియు మాఱనియెడల, నిలువనీరు చెడి యారోగ్యభంజక మగుచు, ట్లవి యహితములును అనర్థకారులును అగును.

అట్లైనచో శాశ్వతధర్మము లనునవి లేనేలేవాయేమి? ఉన్నవి, లేకపోలేదు. అవి సంకుచితములై యేకదేశమునకే యేకకాలమునకే యేకజాతికే యనుకూలింపక, సార్వత్రికములై సర్వకాలములందును ఆచరణీయములై యుండును. మన స్మృతులలో ఆదిమస్మృతిగా నెంచఁబడు మనుస్మృతి (౬-౯౨) లోఁ గాననగు నీశ్లోకమును చిత్తగింపుఁడు:—

శ్లో. ధృతిః క్షమా దమోస్తేయం । శౌచ మింద్రియనిగ్రహః,
ధీ ర్విద్యా సత్య మక్రోధో । దశకం ధర్మలక్షణమ్.

వీని నాధారముగాఁ జేసికొని చెప్పిన విధినిషేధరూపపు తప్పీన్లు మాత్రము, ప్రజల విద్యాభివృద్ధినిబట్టియు నాగరకతాభివృద్ధినిబట్టియుఁ గాలపరిస్థితులఁబట్టియు మాఱక మానవు. అట్లు మాఱుటచేతనే మన కొకస్మృతిగాక అనేకస్మృతులు పుట్టినవి. ఒకకాలమున యుక్తములుగా నెన్నఁబడిన అశ్వమేధమును, గోమేధమును, మాంసశ్రాద్ధమును, దేవరన్యాయమును, సన్న్యాసమును, ఒకకాలమున నిషేధింపఁబడినవి. నిషేధింపఁబడినసన్న్యాసము మరల మంచిదనియొప్పుకొనఁబడినది. దయామయులగు శ్రీరామానుజాచార్యులవారును శ్రీమధ్వాచార్యులవారును యజ్ఞములందు సజీవజంతుహింసను నిషేధించి పిష్టపశుయజ్ఞముల నంగీకరించినారు. మనదేశమునకు హైందవులే ప్రభువులై యుండినయెడల నీపాటి కెన్నియో క్రొత్తస్మృతులు పుట్టియుండును; అప్పు డీకలఁతలే యుండకపోవును. మన ప్రస్తుతప్రభువులగు నాంగ్లేయు లన్యమతస్థులు; అయినను దేశభక్తులగు సంస్కర్తల ప్రేరణమున సహగమనము అతి బాల్యవివాహము మున్నగు కొన్ని దురాచారములను శాసనబలమున సమయించినారు.

విధినిషేధరూపనియమములు మాఱుట యెట్లు?

ప్రకృతిశాస్త్రములును, మనశ్శాస్త్రమును, నీతిశాస్త్రమును, శా

రీరశాస్త్ర వైద్యశాస్త్రములును, వర్షవర్షాభివృద్ధిఁ గాంచుచున్నవి. కనుక తత్తత్సంబంధములైన సత్యములఁగూర్చి ప్రజలకుండు నభిప్రాయములును మాఱక తప్పదు. విషూచికా మసూరికాదులు అమ్మవారియాగ్రహము వలనఁ గలిగిన పీడలని వెనుక నమ్మెడివా రిప్పు డవి రోగవిశేషములుగాని యన్యములు గావని నమ్ముచున్నారు. అట్టి నమ్మికలఁబట్టి శౌచవిధులు గూడ మాఱుచుండును, ఆహారవిహారాదులందు మార్పులు గలుగుచుం డును. కోడిపుంజులవలె యుద్ధములం దొకరి నొకరు పొడుచుకొని చచ్చు ట శూరకృత్యమనియు, అట్టి ధైర్యశాలులు వీరస్వర్గ మనుభవింతురని యు, విశ్వసించువారు నేఁటికిని గలరు. అది ఘోరపాతకములగు మహా హత్యలలో నొకటిగాఁ బరిగణింపఁ దగినదనియు, సాత్త్వికసాధనములచేత విపత్తిపత్తులు నివారించుకొనుట నాగరకతాలక్షణము గాని యొకరినొకరు చంపుకొనుట కేవలపశుకృత్యమనియు, నిప్పటి రాజ్యతంత్రజ్ఞులు బోధిం చుచున్నారు. హింసచే హింస హెచ్చునుగాని యెప్పుడు నశింపదనియుఁ, గష్టసహనరూపమైన ధైర్యముచే సత్యదీక్షచే అహింసావ్రతముచే భూ తదయాపూరితమైన హృదయముచే స్వార్థత్యాగ పరహిత పరాయణత్వ మనోవైమల్యములచే భగవద్భక్తిచే నన్ని యధర్మములును అన్యాయ ములును సర్వ దేశారిష్టములును బోవుననియు, మహానుభావుఁడగుగాంధి గారు స్వాచరణపూర్వముగా బోధించుచున్నారు. ఆ సదుపదేశములు గ్రహించి తదనుసారముగాఁ బ్రవర్తించు ప్రజలసంఖ్య యేఁటేఁట హె చ్చుచున్నది.

గాంధిగారుమాత్రము పొరపాటుపడఁగూడదా? పూర్వస్మృతికర్త లగుశంఖలిఖితాదులకంటె ఆయనయెక్కువ యేమున్నది?

గాంధిగారును ప్రమాదవశులే, సర్వజ్ఞులు గారు. అందఱును ఆ యనను మహాత్ముఁ డనుచున్నారు గాని "నేను ప్రజాసేవకుఁడను" అని యే ఆయన చెప్పుకొనుచున్నాఁడు. యుక్తులఁజూపి, ప్రస్తుత దేశనికృష్ట

స్థితిఁజూపి, ఐకమత్యాభావమువలని నష్టములఁజూపి, హరిజనులకుఁ జిర కాలమునుండి పైజాతులవారు చేయుచుండు అన్యాయములను అనర్థములను జూపి, అస్పృశ్యతానివారణమహాకార్యనిర్వహణమునకు ఆయన కంకణము గట్టుకొని "దేశములో నేనైన నుండవలెను అంటరానితనమైన నుండవలెను గాని, యుభయులము నుండఁజాలము" అని చాటించి చెప్పుచున్నాఁడు. విద్యావంతులును, లోకజ్ఞులును, ధర్మజ్ఞులును, దేశశ్రేయోభిలాషులును అగు పెక్కురు సనాతనధర్మావలంబులే—మదనమోహన మాలవీయపండితులవంటి జగత్ప్రసిద్ధివడసిన వృద్ధులే—గాంధిమహాత్ముని యుపదేశములు శిరసావహించి కార్యశూరులై ప్రవర్తించుచున్నారు. కనుక అస్పృశ్యతానివారణ మవశ్యకర్తవ్యమైన సత్సంస్కరణమని మనము విశ్వసింపవచ్చును.

ఇఁక గాంధిగారిని పూర్వస్మృతికర్తలతోఁ బోల్చి తారతమ్యనిర్ణయము చేయఁబూనుట అప్రస్తుతము, నిష్ప్రయోజనము. పూర్వస్మృతికర్తల వాక్యములు కొన్ని యీకాలమున కనుకూలింపనట్లే గాంధిగారి యుపదేశములు కొన్ని భావికాలమున కుపయోగింపక పోవచ్చును. అప్పటి స్థితిగతుల ననుసరించి తత్కాలపు బుద్ధిమంతులును నయజ్ఞులును వానిని మార్చి క్రొత్తనియమముల నేర్పఱుచుకొనవచ్చును. ఇదియే సంఘాభివృద్ధికరమైన స్వాభావిక సన్నియమమార్గము. పరాశరునివంటివాఁడు పరాశరుఁడే, ఆయన తిరిగి బ్రతికివచ్చి చెప్పినఁగాని స్మృతుల సవరింపఁగూడదు—అని వాదించుట న్యాయవిరుద్ధము. స్థితిగతులు ప్రత్యక్షముగాఁ జూచి చెప్పు నిప్పటి నీతిమంతులగు మనీషులమాటలు, భావిసంఘస్థితుల నూహించి లిఖించిపెట్టిన పూర్వధర్మశాస్త్రకర్తల వాక్యములకంటె నెక్కువ విశ్వసనీయములు. జన్మపరంపరాసిద్ధాంత మొక్క వేదమతమేకాక బౌద్ధాద్యనైదికమతములుకూడ నొప్పుకొనుచున్నవి. అనేకజన్మములెత్తి కొందఱు బుద్ధిబలనీతిబలాధ్యాత్మికబలములు క్రమముగా హెచ్చుచేసి

కొని యధర్మ మణఁచి ధర్మము నిలఁబెట్టు మహాపురుషులై యిప్పుడు పుట్టుట యసంభవముగాదు. అట్టి మహాప్రయోజనములు నెఱవేర్చుటకు పూర్వస్మృతికర్తలే, బహుభవసమార్జితమైన ఆత్మవికాసాతిశయముతో, నిప్పటి గాంధిమహాత్మునివంటివారై పుట్టఁగూడదా ? ప్రతియుగమందుఁ జతుర్యుగధర్మములును నడచునని పెద్దలు చెప్పుదురు. మహాత్ముని బోధన మువలన మనసంఘములో నెంత సత్త్వసంపత్తి యెంతనీతి యెంతధైర్య ము ఎంతదేశభక్తి యుదయించినదో ప్రత్యక్షముగాఁ గాన్పించుటలేదా? జాతివిద్వేషనైషమ్యరూపమైన యధర్మము పోవుట దేశాభ్యుదయాపాద కమైన కృతయుగలక్షణమేమో ! కాదని యెవరు చెప్పఁగలరు?

హరిజనులు త్రాగుదురు, మృతజంతుమాంసము తిందురు; వారి లోఁ గొందఱు గోమాంసభక్షకులు; శుచితాశుభ్రతలు వారికి లేవు; కొందఱు మఱుఁగుదొడ్లు తుడుతురు, పశువులచర్మము లొలిచి వాని తోను ఎముకలతోను వ్యాపారము చేయుదురు. అట్టివారు మనకు స్పృ శ్యు లెట్లగుదురు ?

గొడ్డుమాంసము చచ్చినపశువులమాంసము తినుట హరిజనులు మానుకొనునట్లు పైజాతివారు ప్రబోధము చేయవలెను, వారికి శుచితా శుభ్రతలు నేర్పవలెను, వారిచే త్రాగుడు మాన్పించవలెను. గోమాంస భక్షకులును సురాపాయులును అగు పెక్కురు పాశ్చాత్యులే మద్యమాం సములు త్యజించి కేవలశాకాహారులై మంచినీరు త్రాగి బ్రతుకుచున్నా రు. బుద్ధాచార్యుఁడు పుట్టిన మనదేశములో ఈసంస్కారము చేయుట సుసాధముగాని అసాధ్యముగాదు. హరిజనులలో విద్యావంతులైనవారట్టి దురభ్యాసములు మానుకొనుచున్నారు. పైజాతివారి సాంగత్యము వారికి లభించినకొలఁది బ్రాహ్మణాదుల పరిశుభ్రత వారికిని అలవడకమానదు. అన్యాయమైన అంటరానితనముచేతనే యింతకాలమువఱకును హరిజనులు అపరిశుద్ధులై పడియున్నారు. మన యుపేక్షచేత అశుచిత్వస్థానములగు

మాలపల్లెలలో తఱచుగా బయలుదేఱు విషూచి మున్నగు అంటురోగ ములు పైకి వ్యాపించి పై జాతివారినిగూడఁ జంపుచున్నవి. సంఘ మను శరీరములో నొక యవయవమును పాడుగానిచ్చిన నితరావయవములకు ముప్పు గాదా ?

ఇఁక పాకీదొడ్లు తుడుచుట, చర్మములు దీయుట—వీనిమాట యేమి? తల్లులు బిడ్డలకుఁ జేయునుపచారములే వైద్యులును శస్త్ర వైద్యు లును రోగులకుఁ జేయు నుపకారకృత్యములే హరిజనులు మనకుఁ జేయు చున్నారు. అందులకు సంఘస్థులందఱు వారికిఁ గృతజ్ఞులై యుండవలయు నుగాని రోఁతపడి వారిని వెలివేయఁగూడదు. గాంధిమహాత్ముఁడు సెలవి చ్చినట్లు, ఆపనులు ఆరోగ్యశాస్త్రానుసారముగా శుచిత్వమునకు భంగము కలుగకుండ సాఁగు నేర్పాటులు విద్యాధికులు చేయవలెను. ఎంతో కష్టము తోఁ దూఱిగాని వెళ్లుటకు వీలులేని కన్నములవంటి ద్వారములు మఱుఁ గుదొడ్లకుఁ బెట్టుమని యెవరు చెప్పినారు? అది యేటిన్యాయము? సౌక ర్యములు కల్పింపక, మనసుఖముకై రోఁతపనులు వారిచేఁ జేయించి, వారి సేవగించుట యేమిధర్మము ?

చర్మకారజాతిలోఁ బుట్టినవాఁడు ఆమరణాంతము చర్మకారుఁడు గానే యుండవలయునా? విద్యాబుద్ధులును యోగ్యతయును గడించుకొని గొప్పపదవులకు రావచ్చునా? ఏల రాఁగూడదు? వృత్తిసౌకర్యముకై వర్ణవిభాగము చేసిన మన ప్రాచీనమహర్షులు నిమ్నజాతుల నడఁగఁదొ క్కుట కట్లు చేయలేదు. అవకాశములు కల్పించి నిమ్నజాతుల నుద్ధరిం చుటకు వారు తగినయేర్పాటులు చేసినారు. తరువాతి స్వార్థపరులవ్రాఁత లచేతను చర్యలచేతను సదుద్దేశముతోఁ జేయఁబడిన ఆవిభాగము న్యూ నాధికభావకలుషితమునైన వైషమ్యవిద్వేషములుగా మాఱినది. గుణ కర్మములచేత జన్మాదులవలనఁ గలుగు నెక్కువతక్కువలు తాఱుమాఱు గావచ్చును. దారులుగొట్టి బ్రతికిన కర్మచండాలుఁడు ఋషుల యుపదే

శముచే శ్రీమద్రామాయణమహాకావ్యకర్తయగు వాల్మీకిమహర్షి యై నాఁడు. జన్మముచే చండాలుఁడగు ధర్మవ్యాధుఁడు బ్రాహ్మణునకు వ్యాధగీతారూపమున సమస్తధర్మము లుపదేశింపఁదగిన యాచార్యుఁ డైనాఁడు. అవతారపురుషుఁడగు శ్రీరామచంద్రమూర్తికి బూజ్యపురోహితుఁడగు వసిష్ఠమహర్షి భార్య అరుంధతీదేవి మాతంగజాతి స్త్రీ. ఇవన్నియు యుగాంతరపుమాట లందురేమో! వైష్ణవాలయములలో నిప్పుడును బూజింపఁబడుచుండు ఆళ్వారులలో నమ్మాళ్వారు కాఁపు, తిరుప్పాణి ఆళ్వారు కడజాతియాయన, తిరుమంగయాళ్వారు మ్లేచ్ఛుఁడు. ఈపూజ్యులు కలియుగమందలివారే. ఇఁక గొప్ప దేశాభిమానియగు పి. సి. రాయ్ గారీవిషయమున నితరదేశములలో సంగతిసందర్భము లెట్లున్నవని చెప్పినారో వినుఁడు:—

౧. బ్రిటిష్రాజ్యసుప్రసిద్ధమంత్రియగు "లాయిడ్జార్జి" ని పెంచి పెద్దవానినిజేసిన మేనమామ చెప్పులు కుట్టుకొని బ్రతికిన బీదవాఁడు.

౨. సోవియట్ప్రజాపరిపాలనాధ్యక్షుఁడగు "స్టేలిన్" కొంతకాలము చర్మకారవృత్తి చేసికొని జీవించినవాఁడు. అతనితండ్రియుఁ జర్మకారుఁడే.

౩. కోటీశ్వరుఁడై గతించిన "బేటా" గారు చర్మకారుని కొడుకు. ఇప్పుడు ౧౭ ఏండ్లవాఁడై యున్న యతనికుమారుఁడు పదివిమానములకధికారియఁట.

౪. గొప్ప రసతంత్రవేత్తయును రోగాణుజీవిపరిశోధకుఁడును అగు "లూయీ పేశ్చర్" గారు చర్మములు బాగుచేసికొని బ్రతికిన పరమదరిద్రుని కొడుకు.

౫. ఇంగ్లండుప్రభువగు "విల్యమ్ విజేత" గారితల్లి చర్మశోధకుని కూఁతురు.

౬. వంగదేశమందు గొప్ప క్రీస్తుమతబోద్ధయై మన దేశభాషలు

పెన్కు నేర్చుకొని ౧౮౦౦ సంవత్సరమున "ఫోర్టు విల్యమ్" కళాశాల లో ప్రథమ వంగభాషాధ్యాపకుఁడై అధునాతన వంగభాషాగద్యరచనా ప్రతిష్ఠాపకుఁడని పేరుపడిన "విల్యమ్ కేరీ" గారు మొదట చర్మకారవృత్తి నవలంబించి పైకి వచ్చినవారే! కనుక అవకాశము లిచ్చినచో, చర్మకారులగు మన హరిజనులలోఁగూడఁ బ్రఖ్యాతపురుషులును యశస్వినులగు నారీమణులును బయలుదేఱక మానరు. చర్మకారజాతిలోఁ బుట్టినవాఁడు చర్మకారుఁడుగానే చావవలయుననుట అధర్మము, విపరీతనియమము.

హరిజనులలోనే మాలలని మాదిగలని పాకీవాండ్రని అంతర్భేదము లున్నవి. ఒకరు నీళ్లు తోడుకొనునూతిలో ఒకరు తోడుకొనరు. ఒకరితో నొకరు భోజనముచేయరు. వారిని ముందు కలిపికదా పైజాతులకు వారిని స్పృశ్యులఁగాఁ జేయఁ బ్రయత్నించుట!

ఔను! అట్టిభేదము లున్నమాట వాస్తవమే. హిందూసంఘ మొకవిధముగాఁ గాదు చీలి చెడిపోవుట. పైజాతుల సద్గుణములును సద్ధర్మములును క్రిందిజాతివారి కలవడుట కష్టముగాని దుర్లక్షణము లిట్టె ప్రాకి యంటుకొనును. శ్రీమద్భగవద్గీతలోఁ జెప్పిన నాలుగువర్ణములును చీలి అసంఖ్యాకములగు అంతర్వర్ణములైనవి. నిక్షేపమువంటిహిందూసంఘము వెఱ్ఱితలలువేసిన చెట్టువలె వినాశదశకు వచ్చుచున్నది. ఉత్తమజాతు లనుకొనువారికి హరిజనులు స్పృశ్యులగునెడల హరిజనులలో నుండు పరస్పరభేదములు వానియంతట నవియే యంతరింపక మానవు. భగవత్కృపవలన మహాత్ముని యీయుద్యమము నెఱవేఱుచో శిథిలమైన మనసంఘ మైకమత్యముచే మరలఁ బుష్టమై పూర్వపుఁ బేరుప్రతిష్ఠలు సంపాదించుకొని పడిపోయిన భారతమాతను లేవనెత్తి సుఖపెట్టి మాతృఋణము తీర్చుకొనఁగలదు.

భారతీయులకు సవినయముగ నే జేసికొనుమనవి :—ఇంతవఱకు

హరిజనులకు మనము చేయుచుండు అనాదరణము కేవల మన్యాయము, అస్పృశ్యతానివారణ మవశ్యకర్తవ్యము—అని అంతరాత్మప్రేరితులై నిజముగా నమ్మువారు, తమ వక్తృత్వబల ధనబల నీతిబలాధికారబలము లుపయోగించి హరిజనులలోని యసహ్యాపుటలవాటులను మాన్పి వారిని పరిశుద్ధులఁజేసి అంటరానితనమును గెంటివేయుఁడు. యూనియనులలోను తాలూకాజిల్లాబోర్డులలోను మ్యునిసిపల్బోర్డులలోను పలుకుబడిగలవారు, ఇతరులకువలె హరిజనులకుఁగూడ విశాలమైన నివేశనస్థలము లిప్పించి, యింటిమీఁద ఇండ్లు కట్టుకొనకుండ నడుమ సరియైనవీథులు వదలిపెట్టి మాలపల్లెలు కట్టుకొనునట్లుచేసి, యిండ్లముందఱ పందిపెంటలు దుర్వాసనగొట్టు పదార్థములు లేకుండఁ గఠినమైననియమములు గావింపుఁడు; వారిలోఁ గొందఱు చేసికొను అసహ్యపువ్యాపారములు సహ్యమైన పరిశుద్ధవ్యాపారము లగునట్లు ఏర్పాటులుగావించి హరిజనుల యారోగ్యమును, తద్ద్వారమునఁ దదితరుల యారోగ్యమును, సంరక్షింపుఁడు. అన్నపాన విహారాదులందు శుచిత్వము వారి కబ్బినదో అస్పృశ్యత ఆల్కొహాల్ వలెఁ దానంతనదియే హరించి యెగిరిపోవును. పరిశుభ్రతకుఁ గావలయు గట్టి కట్టుపాట్లతో, సామాన్యజనసంఘోద్దిష్టములైన నూతులు చెఱువులు విశ్రాంతివసతులు బడులు దేవాలయములు హరిజనులనుగూడ నుపయోగించుకొననిండు. పరిశుద్ధుల సాంగత్యమున నపరిశుద్ధులుకూడఁ బరిశుద్ధు లగుదురు. హరిజనులు పైజాతివారిలో గుళ్లలో భగవంతుని సేవించుటవలన, జంతుబలులు మద్యనైవేద్యములు మున్నగు వామాచారములు తొలఁగిపోయి సాత్త్వికభక్తి దేశమునఁ బ్రబలును. సర్వనాగరక ప్రపంచమును వేనోళ్ల సంస్తుతించుచున్నది, మన సుస్థిరసనాతనోపనిషన్మతముగాని కాలానుగుణముగా మాఱవలయు కర్మమతముగాదు.

ఇఁకఁ బరంపరాగత మగు కర్మకాండమే పరమపురుషార్థమనియు, అస్పృశ్యతానివారణ మనర్థకారియును ఆధ్యాత్మికజీవనమున కడ్డంకియును

అనియు, స్వార్థపరులై కాక అంతశ్శుద్ధితో విశ్వసించి బాధపడు భారతీయసోదరులారా! మిమ్ము బాధపెట్టుండని మహాత్ముండు సంస్కర్తలకు బోధించుటలేదు. అహింసామూర్తియగు ఆయన యట్లెన్నండును జేయం జాలండు. మీరు మీప్రాచీనాచారములనే యనుష్ఠించుకొనుచు, మీ ధనము వినియోగించికాని బుద్ధినుపయోగించికాని అధికారబలనుపయోగించికాని హరిజనులకు విద్యాబుద్ధులు చెప్పించి పరిశుద్ధతనేర్పు నేర్పాటులు చేయించి వారి నుద్ధరించుపుణ్యము గట్టుకొనుండు! హరిజనులు హిందువులేకారనియు, సంస్కారప్రియులగు బ్రాహ్మసామాజికులును ఆర్యసామాజికులును దివ్యజ్ఞానసమాజము వారును అంతకంటె హిందువులు గారనియు, వాదించు సాహసికులుమాత్రము గాకుండు. ఎక్కడెక్కడకో వెళ్లి చీమలకై పుట్టలలో నిత్యము నూకలు పోయుదురే కొందఱు! తోడిమానవులగు హరిజనులు చీమలపాటి వారైనం గారా? వారి దీనస్థితి బుద్ధాచార్యుండు పుట్టినదేశములోం బుట్టిన మీహృదయ ములు గరంగించి వారిని మీకృపాపాత్రులను జేయకుండునా?

శ్రీ వివేకానందస్వామి మున్నగు మహానుభావులు చెప్పిన మఱి యొకమాట చిత్తగింపుండు:—

సర్వదేశ పూర్వచరిత్రలు—ముఖ్యముగా మన హిందూదేశచరిత్ర—పరికించి చూచినచో దేశమును కొంతకాలము పురోహితబృందము (అనంగా బ్రాహ్మణులు) నడపినట్లును, కొంతకాలము ప్రభుబృందము (అనంగా క్షత్త్రియులు) నడపినట్లునుగానిపించును. పిమ్మట నింతవఱకును ధనవద్బృందము (అనంగా వైశ్యబృందము) నడపుచున్నది. అధికారము చేతిలోం బెట్టుకొన్నవారు తమక్రిందివారు పాటుపడి పండించినపంటలును శ్రమపడి సృష్టించిన యితర భోగపదార్థములును యథేచ్ఛముగా ననుభవించుచుండియు వారికష్టములు తొలంగించి వారిని సుఖపెట్టుటకుం బ్రయత్నింపలేదు. అట్టి సస్యసస్యేతరవస్తూత్పాదకులు కాపులును హరి

జనులును అయియున్నారు. కష్టపడి దేశములో సుఖజీవనమున కావశ్యక మగు సర్వపదార్థములును కల్పించువారు వారు, అల్పశ్రమముతో అవి యనుభవించి బొజ్జలు నిమురుకొనుచుఁ గూర్చుండువారము మనము. వారిలో విద్య వ్యాపించుచున్నది. దేశములోఁ దమ ప్రాధాన్యమును వారు కనుఁగొనుచున్నారు. జ్ఞానముతోపాటు ఆత్మగౌరవ మంకురించి యంతకంత కతిశయింపకమానదు. అధికారము వారిచేతులలోనికి రాను న్నది. పాశ్చాత్యదేశపరిస్థితు లెట్లున్నవో యించుక కనువిచ్చి చూడుఁడు. ఈ యన్నవస్త్రవస్తూత్పాదకుల సంఖ్య మనసంఖ్యకంటెఁ గడు నెక్కువ గా నున్నది. మర్యాద దక్కించుకొని న్యాయ్యమైన వారిహక్కులను వారి కిచ్చుట మంచిది. లేనియెడల బలవంతముమీఁద వాని నొసఁగవల సివచ్చును. సమ్మెకట్టు లెట్లు బయలుదేఱి తమ ప్రయోజనముల నెఱవే ర్చుకొనుచున్నవో మనము చూచుచునేయున్నాము. ఇది కృషీవలులయొ క్కయు కర్మకారులయొక్కయు కాల మనుమాట మఱచిపోఁగూడదు.

హరిజనుల కొకమనవి :—బుద్ధిపూర్వకముగానో యజ్ఞాన మత మౌఢ్యములచేతనో పైజాతులవారు మీకష్టసుఖము లెంచక మి మ్మింత కాలము చులుకనగాఁ జూచినందులకు మీరు కినియకుఁడు. మిమ్ముపేక్షిం చినజాతులవారే మీ జ్ఞాననేత్రమును విప్పి మిమ్ముద్ధరింప నడుము కట్టుకొ న్న సంస్కర్తలైనా రన్నమాట మఱవకుఁడు!

లోకా స్సమస్తా స్సుఖినో భవంతు !

---

# ౧౦. గురుశిష్యసంవాదములు.



## I

దసరాపండుగులకు సెలవులిచ్చినారు, కొంత విశ్రాంతి కలిగినది. శిరోభ్రమణ రోగికిఁ జిత్తవిశ్రాంతిసుఖము "కొంత" గాక పూర్తిగా నెట్లు లభింపఁగలదు ?

నవమినాఁడు నావంటి రుగ్ణున కుదాత్తమనిమే చెప్పఁదగిన భోజనముచేసి, పుస్తకాలబల్లప్రక్కనున్న పడుకకురిచీపైఁ గాళ్లు చాఁచుకొని పరుండియుండఁగా నాకుఁ గునికిపాట్లు వచ్చినవి. కన్నులు మూఁతపడినందున జాగ్రదవస్థ యనలేను; చుట్టుపట్లనుండి వచ్చుచప్పుడు ఛాయగా వినఁబడుచున్నందున స్వప్నావస్థ యనలేను ; అదొక చిత్రమైన చిత్తస్థితి! మంపులో మెలఁకువ, మెలఁకువలో మంపు! మనసు త్రొక్కిన పఱుగడలు మాత్రము మహాశ్చర్యకరములు. పాఠశాలలో మరలఁ బాఠములు చెప్పితిని, పదముల కర్థనిర్ణయముచేయుటలో నిఘంటుకార్యాలయమునఁ బను చుపండితులతో సకర్మకాకర్మకాదివిషయములఁగూర్చి వివాదములు పెట్టుకొంటిని. లొడితెఁడు తలలోని కవియన్నియు నెట్లువచ్చినవో, అంత స్వల్పకాలములో నన్ని పను లెట్లుచేసితినో, తెలియఁజాలను; మనఃపిశాచ మంతపర్యటనముచేసి మరల స్వస్థానమున నెట్లు ప్రవేశింపఁగలిగినదో, యంతకంటెఁ దెలియదు. అనుభవైకవేద్యమైన యట్టి యనిర్వచనీయస్థితిలో నుండఁగా "అయ్యా! నమస్కారము" అను మాటలు వచ్చి చెవిని బడినవి. ఉలికిపడి లేచి చూచితిని. చిత్తకల్పితచిత్రసికతాసౌధమంతయు నిట్టికూలి మాయమైనది. కళవళముతోఁ గనులువిప్పి యర్థవ్యక్తములైన మాటలతో "అయ్యా ! దయచేయుఁడు" అని కుర్చీనుండి కొంచెము లేచి, యెదుటనున్న మఱియొక కుర్చీపైపునకు చేయిచాఁపి చూపితిని.

"తమ రట్లు మన్నించి దయచేయుమనుట ధర్మముగాదు? నేను మీపూర్వశిష్యులలో నొకఁడను." అని గదిలోనికివచ్చిన పాతిక ముప్పదియేండ్ల పడుచువాఁడు పలికినాఁడు. మనసు కుదురుపఱుచుకొని తేఱిచూచి "నీవయ్యా! రా, కూరుచుండుము" అని యంటిని. మాయిరువుర కంతట నీక్రింది సంభాషణము జరిగినది.

అతఁడు—నేఁడు సుదినము, ఇన్నాళ్లకు నాకు మీదర్శనలాభము కలిగినది.

నేను—నాయనా! ప్రీతశిష్యులతోఁ బ్రసంగించుట నాకును బరమసంతోషకరము. నాకు మీరు పోషణశ్రమ మిసుమంతయేనియు నీయకుండఁ బూర్ణప్రేమచూపు ముద్దుబిడ్డలు.

అ—స్వపోషణసామర్థ్యము మాకు మీవలననేకాదా కలిగినది. ఆభారము మాత్రము నేము మీకిచ్చుట మానలేదు. మిక్కిలి చిక్కిన ట్లున్నారు.

నే—ఔను నాయనా! ఆరోగ్యము సరిగాలేదు.

అ—అదిగో బల్లమీఁద ఆశ్వయుజమాస భారతీపత్త్రికయున్నదే! అది చక్కనిసచిత్రమాసపత్త్రికసుండీ! వివిధవిషయములఁగూర్చి విఖ్యాత పురుషులు పద్యగద్యాత్మకములగు వ్యాసములు వ్రాసి యందుఁ బ్రకటించుచున్నారు. మీరేమియు వ్రాయుటలే దెందుచేత?

నే—ఓపికలేదు, తీఱికలేదు, వ్యాధిగ్రస్తుఁడనై యున్నాను. ఏమైన వ్రాసి పంపుఁడని మూఁడునెలలనుండి పత్త్రికాధిపతు లుచితముగా వారి యమూల్యమైన భారతి నాకంపుచున్నారు. నే నపరిగ్రహవ్రతముఁ బూని నవాఁడనుగానుగాని యూరక పుచ్చుకొని చదువుచు నించుకైనను భారతీ సేవ చేయఁజాలమి కెంతయుఁ జింతిల్లుచున్నాను.

అ—వయోధికులగు డెబ్బదినాలుగేండ్ల వృద్ధాది సుబ్బారాయ కవీంద్రులే యింకను భారతి కేదోవ్రాసి పంపుచున్నారఁటకాదా!

నే—ఔను, వారు నాకు గురుతుల్యులు, వయోవృద్ధులేకాక జ్ఞానవృద్ధులు, ఆంధ్రలోకమున కెల్ల వందనీయులు; ఈ భారతి సంచికలో "విమానము"నుగూర్చి వారు వ్రాసిన సరసపద్యములు చదివి యానందించినాను. వయసుచే వారి కవితాపటిమ సడలినట్లు నాకగపడలేదు. వారిస్థితి వేఱు, అఱువదిరెండేండ్లవాఁడనైనను నాస్థితి వేఱు.

అ—తఱచుగాఁ గాకపోయినను అప్పుడప్పుడైన నేదోయొక గద్యమో పద్యమో వ్రాసి మీరును పంపుచుండరాదా? భారతీపత్రికలలో నావంటి మీశిష్యు లనేకులున్నారు. మీవ్రాఁతలు వారు చదివి మామిమ్ముఁ జూచినట్లే సంతోషించుచుందురు.

నే—బాబూ! నాకును అట్టిసంకల్పము గలదు, కాని సంకల్పసిద్ధికిఁ జాలిన సామర్థ్యమునూత్రము అగపడుటలేదు.

అ—ముందుమాట చూచుకొందముగాని యిప్పుడు నేవేయుప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములిచ్చి ప్రస్తుతమవి ప్రకటనార్థము భారతీపత్రికకంపి మీ వింత కొంత వాపుకొనుఁడు. ఎంతప్రాతదైనను ఇనుపతునుకతోఁ గొట్టినపుడు చెకుముకిఱాతినుండి స్ఫులింగములు రాకమానవు.

నే—చెకుముకిఱాయిరెయో' చివుకుతాటాకుపాయయో! సాదృశ్యసమంజసత్వమునకేమిగాని నీ వడుగఁదలఁచుకొన్న ప్రశ్న లడుగుము. శక్యమైన జవాబులిచ్చెదను.

అ—ప్రస్తుత విద్యాపద్ధతి బాగుగా నున్నదా, సంస్కరణము నపేక్షించుచున్నదా?

నే—నే నధ్యాపకవృత్తి వదలిపెట్టి అప్పుడే రమారమి పదిసంవత్సరములైనది. ఇప్పటి విద్యావిధాన మెట్లున్నదో నేనెఱుఁగను.

అ—కాలమహాప్రవాహములోఁ బదియేండ్లనఁగా నెంత? భేదమున్నను అది యంత గణనీయముగాదు. అప్పటిస్థితిగతులనుబట్టియే మీ యభిప్రాయ మీయవచ్చును.

నే—అట్లైన నాకుఁ దోఁచినమాటలు చెప్పుచున్నాను విను. అవి యందఱకును నచ్చునో నచ్చవో మాత్రము నేఁ జెప్పఁజాలను. విద్యా విధానము కేవలవిదేశీయముగానున్నది. అది మనదేశాభ్యుదయమున కననుకూలమేకాక యవరోధకము అతివ్యయాత్మకము అసర్థకరము. చదువుకై సర్వస్వమును బోఁగొట్టుకొని చదికిలఁబడిన సంసారము లనేకము లిప్పుడగపడుచున్నవి.

అ—అయ్యయ్యో! అట్లనుచున్నారేమి? ఆంగ్లవిద్యాధికు లెంత మంది యెన్నియున్నతోద్యోగములలోఁ బ్రవేశించినారు! వందలకొలఁది జీతములు పుచ్చుకొనుచున్నవారు వేలకొలఁదిగా నున్నారే! గోఁచిపాఁత రాయలు కుబేరులైనారే! లక్షాధికారులైన లాయర్లతోను, ఎంజినియర్ల తోను, డాక్టర్లతోను, ఇంక ననేకేతరపరిపాలనాశాఖలలోఁ బనిచేసియుత్తరవయస్సు హాయిగాఁ గడుపుకొనువారితోను, దేశము కలకలలాడుచుండఁగా నిట్టి విపరీతనైరాశ్యపు దీనాలాపములు మీనోటినుండి వచ్చుట యత్యాశ్చర్యకరముగానున్నది! అందఱమాట యేల? మీసుఖజీవన హేతు వాంగ్లవిద్యయా అన్యమేమైననున్నదా?

నే—నిజమే, ఆంగ్లవిద్యయే నామనుగడ సుఖముగా సాఁగించినది! కాని ప్రజాసమష్టిదృష్టివలనఁగాక యేకైకనిదర్శనములతోఁ జూచు వ్యష్టిదృష్టివలన దేశముయొక్క వాస్తవికస్థితి గోచరింపఁజాలదు. నీవు బి. యల్. చదివి చరితార్థుఁడవైతివిగదా! నాబిరుదముకంటె నీబిరుదములో రెండక్షరము లెక్కువగా నున్నవిగదా! ఎంతడబ్బు వ్యయముచేసి యీ బిరుదము సంపాదించినావు? దానికిఁ బ్రతిఫలముగ న్యాయవాదివృత్తివలన నీవు డెంత గడించుచున్నావు? నిజము దాఁపక చెప్పుము.

అ—చిక్కుప్రశ్నయే వేసినారు. మావృత్తిలో సత్యగోపన మంతి దోషముగాదు కాని, గురువుగారియెదుట నబద్ధమాడ బుద్ధిపుట్టుటలేదు. నాచదువుకై చేసినఋణములో సగమైనను ఇంకను నా రాబడివలన నేఁ

గూడఁదీసికొనలేకున్నాను. అది నాలోపముగాదు. ఏకఫలాపేక్షులైన నా వంటి చతురక్షరబిరుదాంచితు లనేకులున్నారు. సరకెక్కువగానున్న వెల తక్కువయగునుగాదా!

నే—కావుననే నీవంటివారును నీకంటెను దరిద్రితరదశలోనున్న వారును దేశములో నెందఱున్నారో, యితఃపూర్వము నీవు పేర్కొనిన వారివంటి విత్తాధికు లెంతమంది యున్నారో, కొంచెము నిదానించి చూచుకొందము. మనము చూచుకొన నక్కఱయేలేదు. ప్రభుత్వమువారును ప్రజానాయకులును బ్రకటించుచుండు లెక్కలే సత్యమును జాటుచున్నవి. హైందవుని సగుటాదాయమును ఆంగ్లదేశస్థుని సగుటాదాయమును తా వేలువేసి చూచుకొనుము. కట్టబట్టలేక తినఁ దిండిలేక మలమల మాఁడు చున్న క్షామరోగపీడిత జీవచ్ఛవములను జూడుము. బిచ్చగాండ్రయమిత సంఖ్య చూడుము. దేశదుర్దారిద్ర్యమున కింతకంటెఁ బ్రత్యక్షప్రమాణ మేమికావలయును?

అ—సరియేకాని దేశదరిద్రితకును విద్యావిధానమునకును ఏమి సంబంధమున్నది?

నే—ఉన్నసంబంధము నీకుమాత్రము తెలియదా! అది నాచేఁ జెప్పించి పరీక్షింపఁజూచుచున్నావు. అట్లే కానిమ్ము.

చదువునుబట్టి సంపాదనశక్తి యుండును; సంపాదనసామర్థ్యము నుబట్టి దేశభాగ్యముండును. కనుక దేశదారిద్ర్యమునకును దేశవిద్యాపద్ధతులకును సంబంధ మున్నదని చెప్పక తప్పదు. ఏమనెదవు?

అ—వ్యాస మతిదీర్ఘము కాఁగూడదు. మీధోరణికి నేనడ్డురాను; ముందఱికి సాఁగిపొండు.

నే—బ్రహ్మాండమంత భారతభూమిని పాశ్చాత్యులగు నాంగ్లేయులు జయించి దానికిఁ బ్రభువులైనారు. పరిపాలనకృత్యములందు వారి భా

షావ్యవహారసంప్రదాయము లెఱిఁగిన హైందవులు వారికి సహాయము గావలసివచ్చినారు. కనుక మెకాలేదొరగారు తమ విద్యావిధానమును మనదేశములో నెలకొల్పి కృతకృత్యులైనారు. గొప్ప యుద్యోగములు దొరకుచున్నవని చంకలు గొట్టుకొని మనవారు స్వధర్మ స్వవృత్తులను మానుకొని ఆంగ్లపాఠశాలలలోఁ బ్రవేశింప మొదలుపెట్టినారు. క్రమక్రమముగా బడిజీతములు పెరిఁగినవి. విద్యాభవననిర్మాణాదులకై వేలును లక్షలును దేశధనమునుండి వెచ్చింపఁబడినవి. ఇసుళ్లతెరలవలె ఏఁటేఁటను బి. ఏ. లును, బి. యల్లు లును, ఎమ్. ఏ. లును బయలుదేఱుచుండిరి. ఉద్యోగస్థానములు తక్కువమైనవి, ఉద్యోగార్థు లెక్కువమైనారు. పూర్వవృత్తులు పొలిసిపోయినవి. పదార్థనిర్మాతలు తగ్గినారు, పండినపంట నమలివేయునోళ్లు బహుసంఖ్యాకములయినవి. విదేశీయభోగపదార్థములు తరంగములవలె వచ్చి దేశముపైఁబడి దేశధన మన్యదేశములకుఁ గొట్టివేయుచున్నవి. అగ్గిపెట్టెలు, గుండుసూదులు, పాళీలు, గాజుసరకులు, గడియారములు—ఇట్టి వెన్నియో యనేకములవలె మన కత్యావశ్యకములైనవి. నిత్యోపయుక్తములగుచున్న యట్టివస్తువులు చేసికొనుట యెట్లో దేశీయులకుఁ దెలియదు. అవి మానుకొని వారు తమపూర్వపుఁ గష్టజీవనము చేయఁజాలరు. వేలకొలఁది యంత్రములు వాడుకలోనికి వచ్చినవి. అవి లేకుండనుండలేము, వాని నిచ్చటఁ జేసికొనలేము. అన్నియుఁ బరదేశములనుండి రావలెను. వర్షవర్షమునకుఁ బరాపేక్ష ప్రబలి స్వతంత్రతను జంపివేయుచున్నది. వివిధయంత్రనిర్మాణవిషయకములైన శాస్త్రీయాంశములఁగూర్చి చక్కని విపులవ్యాసము లాంగ్లవిద్యాపారంగతులైన మనవారు వ్రాసి ప్రకటింపఁగలరు, ప్రయోగభాగముమాత్రము పరమరహస్యమైన మంత్రమువలె నింకను బరదేశీయులలోనేయున్నది. డబ్బులేదు, యంత్రనిర్మాణనైపుణి లేదు, బ్రహ్మరాక్షసులవలె నిరువది నాలుగుగంటలును పనిచేయుచుండు యంత్రములతోఁ గటుగట్టి యుత్తచే

తులు తమపంత మెట్లు నెగ్గించుకొనఁగలవు? నాయనా! మన దేశస్థితియు క్షయరోగి దేహస్థితియు నొక్కతీరుగా నున్నవి.

అ—నివారణసాధనము తెలిపెఁగింపని రోగనిదానము నిష్ప్రయోజనము.

నే—మ్యునిసిపాలిటీలును, లోకల్‌బోర్డులును, భారము వహించి పిల్లలకు ఆచండాలము ఉచితముగా నిర్బంధముగాఁ బ్రాథమికపాఠశాలల లో విద్య నేర్పింపవలెను. చేతిపనులు మున్నగు వృత్తివిద్యలు మామూలుచదువుతోపాటు కఱపవలెను. పైయిమరీవిద్యతోఁ జదువుచాలించుకొను బాలుఁడుసైతము జీవిక కనువైన చిన్న వృత్తివిద్య యేదోయొకటి నేర్చియుండవలెను.

మాధ్యమికపాఠశాలలు స్థాపించి కొలఁదిజీతములు వసూలుచేసి స్కూల్ ఫైనలువఱకు పిల్లలకుఁ బైచదువు చెప్పింపవలెను. బడులుపెట్టు ఇంగ్లాందోగ్యభంగకరములు గాకున్నఁ జాలును. బల్లలకును భవనాదులకును అతివ్యయము చేయనక్కఱలేదు. విద్యాశాఖాధికారులు ప్రస్తుతనియమకాఠిన్యమును తగ్గించి యట్టిబడులు పెట్టుట కనుజ్ఞ యీయవలెను. ప్రాథమికపాఠశాలలలోకంటె నిం కెక్కువగా వృత్తివిద్యలు నేర్పు ఏర్పాటులు గానింపవలెను. మాధ్యమికపాఠశాలతోఁ జదువు ముగించుకొను బాలుఁడు సుఖజీవనముచేయుటకుఁ జాలిన యొకటిరెండు వృత్తివిద్యలు నేర్చుకొని యుండవలెను. ప్రస్తుతదేశస్థితిలో విశ్వకరిగానివిద్య నిష్ప్రయోజనమైనవిద్య. తర్కవ్యాకరణాదివిద్యలు నేర్చుకొనియున్న సంస్కృతపండితుల కావిద్య లెట్లుపకరించుచున్నవో, కేవ లాంగ్లభాషావేత్తలకు వారి విద్యలును ముం దట్లే యుపకరించును.

ఉన్నతవిద్యాబోధకములగు కళాశాలలకు ధనవత్కుటుంబముల బాలురే పోవలెను. సామాన్యసంసారస్థితిలో నున్నవారు తమతాహతునకు మించిన పరుగులెత్తి పడిపోఁగూడదు. అసాధారణమేధాసంపన్నులగు పేద

పిల్లలు దేశాభిమానులగు వదాన్యుల తోడ్పాటు పడయఁగలిగినచోఁ బై చదువు చదువవచ్చును.

అ—ఇది చేయవలెను, ఇది చేయఁగూడదు, అని యేమేమో విధినిషేధవాక్యములు సెలవిచ్చుచున్నారు గాని సాధ్యతాసాధ్యత లాలోచించి చెప్పుచున్నట్లగపడదు. వృత్తివిద్యలు వృత్తివిద్యలు అందురుగదా, ఆవిద్య లేవి? వర్ణధర్మములు పాటింపరా? బోధ్యవిషయములేవో, పఠనీయ గ్రంథములేవో, విద్యాపరిసమాప్తికిఁ బట్టుకాలమెంతో, సవిస్తరముగాఁ జెప్పిన బాగుగానుండును.

నే—నాయభిప్రాయము లిట స్థూలముగామాత్రమే యీయఁగలను. తప్పీర్లలోనికి దిగినయెడలఁ బెద్దగ్రంథమగును.

తాటాకులు వెదురుబద్దలు పేము మున్నగువానితోఁ జేయు అల్లికపనులు, నారతోను పీఁచుతోను నులక పురి త్రాళ్లు మొదలగునవి పేనుట, వ్యవసాయము, వడ్రంగిపని, కమ్మరపని, చెంబులచేఁత పోఁత, నూలువడుకుట, బట్టలనేఁత, రంగులపని, దర్జీపని, అచ్చుకూర్పు, పుస్తకములు కుట్టి యట్టలుగట్టుట—ఇట్టి వెన్నియో యున్నవి. స్థలమునుబట్టి ద్రవిణబలమునుబట్టి యితరపరిస్థితులఁబట్టి యట్టివెన్నుకొని నేర్పవలెను. చేసినసరకులవలన వచ్చుసొమ్ములోఁ గొంతభాగము అవిచేసినపిల్లలకు బహుమతిగా నిచ్చుచుండునెడల, నది మఱియుఁ బ్రోత్సాహకముగానుండును.

నాయనా! వర్ణధర్మములు పాటించుకాలము పోయినది. ఏమొండ కాగొడుగు పట్టవలెను. ఇప్పుడు వర్ణములఁబట్టి వృత్తులులేవు. ఇప్పుడన నేల? చిరకాలమునుండి లేవు! వీరివృత్తులు వారును వారివృత్తులు వీరును జేయుచున్నారు. వ్యాపారములలో న్యూనాధికభేదములు చూడఁగూడదు. సరిగా న్యాయ్యముగాఁజేయునెడలఁ బ్రతివృత్తియును బ్రశస్తమైనదే; తెలివితేటలును యోగ్యతయునే గౌరవార్హములైన ప్రధానలక్షణములు.

అ—మీయాశయమునుబట్టి మాధ్యమికవిద్యయగుటకు నెన్ని యేండ్లుపట్టును?

నే—ప్రాథమికవిద్యకు మూఁడేండ్లును, మాధ్యమికవిద్య కాఱేం డ్లును—వెరసి తొమ్మిదేండ్లు చాలునని తోఁచుచున్నది.

అ—వృత్తివిద్యలు చేర్చియును మీరు 11 సంవత్సరములచదువును తొమ్మిదేండ్లకు దిగలాగినారే!

నే—ఔను, అనావశ్యకములైన వేడబములు విసర్జించినయెడల నించుమించుగాఁ దొమ్మిదేండ్లు చాలుననుకొనియెదను.

నే నుద్యోగము చాలించుకొనినపిదప, రోజున కొకయఱగంటచొప్పునఁ, దత్పూర్వ మింగ్లీషేమియు నెఱుఁగని స్వకీయుఁడగు నొకబాలున కింగ్లీషుచెప్పి, రెండేండ్లలో నతఁ డాంగ్లభాషయందు నాల్గవఫారమున కర్హుఁడగుట కనుఁగొనినాను.

ప్రైమరీతరగతులలో స్వభాష వ్రాయుట, చదువుట, సామాన్యపులెక్కలు చేయుట—యివి నేర్పినఁ జాలును. ఇంగ్లీషు అక్కఱలేదు. ఉపవాచకపుస్తకము లంతకంటె నక్కఱలేదు. నీతి, ఆరోగ్యము, సత్పురుషుల చారిత్రములు, నిత్యానుభూతములగు వ్యవహారవిషయములు, సుగ్రాహములగు ప్రకృతిశాస్త్రవిషయములు—వీనింగూర్చి చక్కఁగా వ్రాసిన పుస్తకము సంవత్సరమున కొక్కటె చాలును.

ఆంగ్లభాష మాధ్యమికపాఠశాలలలోఁ బ్రారంభింపవచ్చును. వ్యవహారమునకుఁ గావలయు నాంగ్లభాషాజ్ఞానము సంపాదించుకొనుట కాఱేండ్లు చాలును. మాధ్యమికవిద్యఁ గఱపుబడులందు స్వభాష, రాజభాష, స్వదేశచరిత్ర, భూగోళశాస్త్రము, ప్రధానప్రకృతిశాస్త్రములందలి మూలవిషయములు, గణితశాస్త్రము—ఇవి నేర్పవచ్చును. లెక్కలలో క్షేత్రబీజగణితము లంతర్భూతములై యుండవచ్చును.

అవశ్యపఠనీయములు, ఐచ్ఛికములు—అను విభాగమువృత్తివిద్యలలోఁ దక్క ఇతరత్ర యుండఁగూడదు. సవిమర్శపఠనీయభాషాగ్రంథములు, సామాన్యపఠనీయభాషాగ్రంథములు—అను ప్రస్తుతవిభాగమనా

వశ్యకము. మంచి గద్యగ్రంథ మొకటియుఁ జక్కని పద్యగ్రంథమొకటి యు—సంవత్సరమునకు భాషలో రెండు సవిమర్శపాశ్యగ్రంథములున్నఁ జాలును.

వృత్తివిద్యలందును భాషాదీతరవిషయములందును మూఁడేసితరగతుల కొక ముఖ్యపరీక్షచేసి, యందు విజయమొందినబాలురకు అర్హతా పత్త్రిము లీయవచ్చును.

అ—పై కళాశాలలఁగూర్చి మీ రేమైనఁ జెప్పెదరా ?

నే—వాని యనుభవము నా కంతగాలేదు. క్రిందిమెట్ల కనుగుణముగాఁ బై మెట్లు విశ్వవిద్యాలయాధికారులు ఆలోచించి యేర్పాటు చేయవలెను.

అ—తప్పీళ్లలో కొన్నితంటాలు రాకమానవు, వానికేమి పోనిండు ; మీరు చెప్పినట్లుచేసిన, దేశారిష్టములన్నియుఁ బోవునా ?

నే—కొన్ని పోవుననియే నానమ్మిక. తల తిరుగుచున్నది. సంభాషణ మిఁకఁ జెరుఁగనీయకుము. ఉపసంహారవాక్యములు కొన్ని చెప్పి నా యుపన్యాసము కట్టిపెట్టెదను.

పరిపాలకులకు నిజదేశాభిమానముకంటెఁ బ్రజానురాగ ప్రజాశ్రేయోభిలాష లెక్కుడగా నుండవలెను. వారు తమవారికిఁగల యంత్రనిర్మాణపాటవమును శిల్పనైపుణ్యమును పాలితప్రజావర్గమునకు నిష్కపటముగాఁ గఱపవలెను. దేశమునుండివచ్చు ఆదాయము దేశాభివృద్ధికే వినియోగపఱుపవలెనుగాని దానిని దేశముదాఁటి వృథాగాఁ బైకిఁ బోనీయఁగూడదు. పరిపాలనాతంత్రములో జ్ఞానవంతులగు ప్రజల నంతకంత కెక్కువగాఁ బాల్గొనఁజేయవలెను. యుక్తవయస్సువచ్చినబిడ్డ నుపేక్షించి యధికారలుబ్ధుఁడై వృద్ధపిత గృహభారమ తయుఁ దనమీఁదనే యుంచుకొనునట్లు వ్యవహరింపఁజనదు.

"నా దేశీయులు చేయఁగలపదార్థములు దక్కఁ దక్కినభోగపదా

ర్థములు సాధ్యమైనంతవఱకుఁ దృజించెదను.'' అని ప్రజలు గట్టిప్రతిజ్ఞపట్టి యట్లు జరపుకొనవలెను. "పైతృకమగుఆస్తి కేదోకొంత యదనముగాఁ జేర్చిపోవనివాఁ డప్రయోజకుఁడు'' అని ప్రతివాఁడును అనుకొని యుచిత మైనమితవ్యయముతో నట్లు తా జీవయాత్రచేసికొనవలెను. సత్త్వవేషధారి యై మనల నిపుడు మోసపుచ్చుచున్న తమోగుణమును దఱిమివేసి రజోగుణద్వారమున యథార్థమైన సత్త్వగుణమును సమార్జించుకొనవలెను. పుస్తకకంటె బుద్ధియు సౌశీల్యమును బూజ్యతరములని మెంచుకొనవలెను. అనేకకారణములచే నంతరించిపోయిన ప్రాచీనదయాధర్మసత్యశౌచశౌర్యములు మరల సంపాదించుకొనవలెను. అన్యోన్యకలహము లణఁచుకొని పరస్పరమైత్రీపరోపకారచింత లలవడఁజేసికొనవలెను. ఉచితవృత్తు లగపడని దృఢగాత్రులగు బీదలకు జీవికాసాహాయ్యము చేయుట నిజమైన లోకోపకారకృత్యముగాని యపాత్రదానములుచేసి సోమరితన మభివృద్ధిచేయుట కేవలదేశాపకారము అని వివేచించి తెలిసికొనవలెను.స్వహితపరాఙ్ముఖత్వ పరహితపరాయణత్వములు సర్వమతసమ్మతములయిన యుత్తమ ధర్మములని యోజించుకొనవలెను.

ఇట్లు మనము నడచుకొనినచో, పోయినకీర్తి సంపదలు మనదేశము నకు మరల వచ్చునని నే నాశాపూర్ణుఁడనై యున్నాను.

అ.—చాలశ్రమ యిచ్చితిని, క్షమింపవలెను. నమస్కారము. (అని లేచెను.)

నే.—(అర్థానుస్వారమువలెఁ గురిచీలోనుండి ముందఱికి సగము వంగి) శుభమస్తు! శ్రీరామచంద్రప్రసాదసిద్ధిరస్తు! లోకాస్సమస్తాస్సుఖినోభవంతు! (అని యాశీర్వదించి మరల వెనుక కొఱగితిని.)

---

# ౧౦ గురుశిష్యసంవాదములు.



## 11-1

(అభివంద నాశీర్వాదముల తరువాత)

శిష్యుఁడు—ఈనడుమ మీ రేమైన వ్రాసినారా ?

గురువు—ఈనడుమ ననఁగా ?

శి—భారతీపత్త్రికకు వెనుక మీరంపిన "గురుశిష్యసంవాదము" నకుఁ బిదప నన్నమాట.

గు—ఆ! ఏవో యొకటిరెండు. వార్ధివలెఁబొంగుచున్న వాఙ్మయములో నవి కణములవంటివి; పేర్కొనఁదగినవికావు. ఏ మిట్టిప్రశ్న వేసితివి?

శి—మఱేమియులేదు. ఇంకొక్క "గురుశిష్యసంవాద"మీనావలికి వచ్చునేమో యనునాశతో నట్లడిగినాను.

గు—ఎట్లురాఁగలదు నాయనా? బుద్ధిచేఁపుపోయినది.

శి—వత్సవక్త్రిసంస్పర్శమువలన మరల రావచ్చును. ఏదో వార్తాపత్త్రిక చదువుచున్నట్లున్నారు !

గు—ఔను, "తరుణభారతపత్త్రిక—Young India." ముసలితనములో నాకది నల్లమందైనది.

శి—నల్లమందుపట్టు పోకముందే నాలుగుమాటలు సెలవిండు మఱి. అతిశ్రద్ధతో నిప్పుడు మీరు చదువుచున్న పత్త్రికాభాగమేది ? ఏవిషయమునుగూర్చి వ్రాయఁబడినది ? ఎవరిచే వ్రాయఁబడినది ?

గు—"దేశాయము, దేశదారిద్ర్యము" అనుశీర్షకముతోఁ బ్రకటింపఁబడిన యొక విలేఖనము; దానిని వ్రాసినాయన ప్రస్తుతము "ఘూర్జరవిద్యాపీఠము" లోఁ బనిచేయుచున్న యొక గొప్పపండితుఁడు, అర్థశాస్త్రవేత్త, ప్రపంచపర్యటనముచేసి వివిధదేశప్రజలసుఖాసుఖములను

స్వయముగాఁ జూచివచ్చిన లోకజ్ఞుఁడు. ఆయనపేరు శ్రీ కుమారప్పగారు.

శి—సరియేకాని, దేశదారిద్ర్యమనుచున్నా రేమికర్మము? చీమలబారులవలెఁ గ్రిందఁ బ్రాఁకుచున్న శతసంఖ్యాకములగు రెయిలుబాటలతో, తంబుతీఁగలవలెఁ బైని వ్యాపించు విద్యుద్వార్తాతంత్రులతో, బహుళములైన భారతీభవనములతో, చిత్రవిచిత్రవ్యాధినివారణపరికరములతో నిండియుండు చికిత్సాశాలలతో, సస్యసమృద్ధములగుభూములతో, సమస్తసుఖసదుపాయములతో, నొప్పారుచు స్వర్గతుల్యముగనుండు మనదేశము దరిద్రదేశమని యెవఁడు చెప్పఁగలఁడు? ఇప్పటి మిద్దెలు, మేడలు, కుర్చీలు, సోఫాలు, విద్యుద్దీపములు, విద్యుద్వ్యజనములు, ఏఁటఁజేయనగు పనులు పూఁటలోఁజేయు నానాద్భుతయంత్రశాలలు—ఇవన్నియు మాముత్తాతలుగాని తాతలుగాని యెఱుఁగుదురా?

గు—మీముత్తాతలకును తాతలకును లేని సౌకర్యము లిప్పుడనేకము లున్నవనుమాట వాస్తవమే. కాని వారియాయురారోగ్యజవసత్త్వము లిప్పటివారికి లేవనుమాటయు నంతసత్యమే! దీనికిఁ గారణమేమో కనిపట్టవలెను. పూర్వకాలములతోఁ బోల్చి చూచుకొనియు సమకాలికులగు నితరదేశజాతులవారితోఁ బోల్చి చూచుకొనియుఁ గష్టసుఖతారతమ్యనిర్ణయము చేసికొనవలెను. పాశ్చాత్యుల యద్భుతమైన ప్రకృతిశాస్త్రప్రావీణ్యమువలన, దానియొక్క దినదినాభివృద్ధివలనఁ,బూర్వులెఱుఁగని సౌకర్యము లనేకములు యావత్ప్రపంచమందును ప్రజ లిప్పు డనుభవించుచున్నారు. తల్లాభములవలనఁ గలుగు సుఖమైనను మనకంటె నితరదేశస్థులకే యెక్కువగా నున్నది. యంత్రాదినిర్మాణశక్తి మనకు లేదు; లేకపోవుటకు మన బుద్ధిమాంద్యమో కారణము, ఇతరకారణము లేమైన నున్నవో, కనిపట్టవలెను. ధూమశకటాదిగమనసౌకర్యములవలనఁ బ్రజలనుండివచ్చు రాబడి దేశాభివృద్ధికొఱకు వినియోగపడుచున్నదో, ధనసంపన్నులగు నితరదేశీయుల మఱింత శ్రీమంతులఁ జేయుటకును స్వాతంత్ర్య

హీనులైన ప్రజలను మఱింత యస్వతంత్రులఁజేయుటకును ఉపయోగప డుచున్నదో—అది చూచుకొనవలెను. యంత్రములువచ్చి చేతిపనులు చెడఁగొట్టుటయును బూర్వము జగత్ప్రసిద్ధిఁగాంచిన శిల్పాదివృత్తుల నశిం పఁజేయుటయును అభ్యుదయసూచకమో అనర్థసూచకమో దూరదృష్టి తోఁ గనుఁగొనవలెను. ఇఁక నీవు పేర్కొన్న మేడలును మిద్దెలును వి ద్యుద్దీపవిమ్యువ్యజనాదులును దేశములో నెంతమందికున్నవో చెప్పు ము. వేయిమంది పొట్టలు చేతఁ బట్టుకొని తిరుగులాడుచుండ నెవఁడో యొకఁడు పంచభక్ష్యపరమాన్నములు గుడుచుచుండుట దేశభాగ్యలక్షణ మో దేశాభాగ్యసూచనమో—అది వాఁపో బలుపో—బాగుగానాలో చించి చెప్పుము.

శి—ఇవన్నియు శ్రీకుమారప్పగారు పరిశీలించి చెప్పినారాయేమి?

గు—దీనిలో నవియన్నియు లేవుగాని, ముందుపత్త్రికలలో రా వచ్చును. ఆయన వ్రాసినవిషయము లందఱు శ్రద్ధతోఁ బఠింపఁదగినవని శ్రీ గాంధిమహాత్ముఁడుగారు చెప్పినారు. ఆచెప్పుసందర్భమున మన కుతూ హలము రేఁపుట కొకమాట చెప్పినారు.

శి—అది యేది?

గు—ప్రపంచములో నెల్ల ధనవత్తమమైన దేశము అమెరికాదేశ మని యెఱుఁగుదువుగదా!

శి—ఆ! ఎఱుఁగుదును.

గు—మహత్తమమైన యాదేశము తనకు వచ్చుపన్నులమొత్త ములో—సైన్యపోషణమునకును, అప్పులుదీర్చుటకును, పరిపాలనకృత్య ములకును—నూటికి 48.8 వ్యయముచేసికొనునఁట; ఇఁక దరిద్రదేశమని పేరెక్కిన మనదేశము ఆప్రయోజనములకే నూటికి 93.9 వెచ్చపెట్టునఁట.

శి—ఎవరు చెప్పినారు?

గు—కుమారప్పగారే వ్రాసినారఁట.

శి—కాని, అయ్యా! అర్థవంతమైన అమెరికాకంటె దాదాపుగా రెండురెట్లు వెచ్చింపఁగల మనదేశము దరిద్రదేశమని యెట్లుచెప్పఁగలము?

గు—అట్లు వ్యయించుకొనుచుండుటచేతనే దరిద్రదేశమైనది. ఆరోగ్యాభివృద్ధికి, విద్యావ్యాప్తికి, జీవికాకల్పనములకుఁ, బ్రజాసౌఖ్యావహములగు నితరసత్ప్రయోజనములకు, డబ్బు చాలకున్నది. పొదుఁగులో నున్నపాలన్నియుఁ బిదికి పైవారికే పోయుచో నిఁక దూడత్రాగి బ్రతుకుటకుఁ బా లెక్కడనుండును? అమెరికా ఖర్చుపెట్టు 48.8%ను ఆదేశములోనే తనవారికే వినియోగపడుచున్నది. మన హిందూదేశము ఖర్చుపెట్టు 93.9% లోను అత్యధికభాగము దేశముదాఁటిపోయి యన్యదేశీయుల పెట్టెలలోఁ బడుచున్నది. మన దేశమాత యీమహోపద్రవమునుండి విముక్తురాలైనఁ దక్క నామెకు స్వరాజ్యసుఖముగాని మఱి యేరాజ్యసుఖముగాని యలవడనేరదు.—అని మహాత్ముఁడు చెప్పుచున్నాఁడు.

శి—ఆలాగుననా? కుమారప్పగారీయన్నియు వ్రాసినారాయేమి?

గు—వ్రాసినట్టే; దేశము సుఖవంతమై భాగ్యవంతమై యుండుటకుఁ బరిపాలనాపద్ధతి ప్రాచీననవీనార్థశాస్త్రసంప్రదాయములఁ బట్టి యెట్లుండవలయునో కుమారప్పగారు కొన్ని చక్కని సామాన్యసూత్రములతో నిటుఁ దెల్పినారు.

శి—అవేవో సెలవిండు.

గు—నీ వింగ్లిషు రానివాఁడవుగావు. ఇదిగో! పుచ్చుకొని చదువుకొనుము.

శి—అందులకుఁ బనికట్టుకొని నే నింతదూరము మీకడకురానేల? మీమాటలతోఁ జెప్పునెడల నింగ్లిషురానియాంధ్రుల కవి యుపయోగించును.

గు—అర్థశాస్త్రవాసన నా కంతగా లేదు. అయినను నీమాటత్రోసివేయఁజాలను. కుమారప్పగారియుపదేశముల నతిసంగ్రహముగాఁ జెప్పెదను విను.—

పన్నులనఁగాఁ బ్రజలు సత్పరిపాలనముకై రాజున కిచ్చుపారితోషికములని ప్రాచీనాభిప్రాయము; కనుకఁ బోషకస్థానమునం దుండు రాజునకును పోష్యస్థానమునందుండు ప్రజకును ఒకరీతి యొడంబడిక యున్నదన్నమాట. "ప్రతిఫలరూపముగాఁ బ్రభువు సమస్తభోగములు ననుభవింపవచ్చును, కాని ప్రజారక్షణ విషయమున బానిసీనివలెఁ బనిచేయవలెను." అని నీతిశాస్త్రకర్తయగు శుక్రాచార్యుఁడు చెప్పినాఁడఁట.

శి—అవి కృతయుగము నాఁటి మాటలు, పోనిండు; ప్రస్తుతకాలపుఁ బరిపాలకులఁ గూర్చి కుమారప్పగారేమని చెప్పినారు?

గు—అర్థశాస్త్ర వేత్తలును ప్రజాహిత పరాయణులును అగువారే పరిపాలనకృత్యములలోఁ బ్రవేశింపవలెను; అర్థశాస్త్రజ్ఞానము దుర్వినియోగము చేయు స్వార్థపరులు ప్రభువు లగునెడలఁ బ్రజాపీడకు లగుదురు.

సత్పరిపాలకులు, తమకాలపుఁ బ్రజల క్షేమమే యాలోచింపక, భావిదేశలాభమునుగూడ మనసులోఁ బెట్టుకొని దూరదృష్టితోఁ దమ పాలనకృత్యములు నెఱవేర్చుకొందురు. దాదాపుగా ప్రపంచమందలి దేశములన్నియును ఇప్పుడు వాణిజ్యాదులచేఁ బరస్పర సంబంధములు గలిగి యున్నవి గనుకఁ, దాత్కాలిక లాభమునే చూంచి వ్యవహారము నడుపుకొనుదేశము రాఁబోవు తనవారికే కాక యితరదేశీయ భావిప్రజావర్గమునకుఁ గూడ బాధగలిగించున దగును. ప్రస్తుతలాభమునే యపేక్షించి, అమెరికా సంయుక్తరాష్ట్రములవారు, సేద్యమునకును రాచబాటలకును తమ పెద్ద పెద్ద యడవుల నఱకి తగులఁ బెట్టుచున్నారఁట; యితరులతో వర్తకపుపోటి పెట్టుకొని తమదేశములోనుండు ఖనిజతైలరూపములనుండి చమురు వేవేగ తోఁడివేయుచున్నారఁట. ఇది ముందుముం దాదేశమునకే కాక యన్యదేశములకుఁ గూడ మహానర్థముగాఁ బరిణమించునని కుమారప్పగారు చెప్పుచున్నారు.

శి:—అమెరికామాట మనకేల? మనహిందూదేశపు పరిపాలనఁ గూర్చి యేమైనఁ జెప్పినారా?

గు.—నాయనా! తొందరపడకు! స్వదేశసమాచారకథనమున కుపోద్ఘాతముగా నవి యన్నియుఁ జెప్పినారు. హిందూదేశమును గూర్చి విపులముగానే విమర్శించినారు, విను:—

మనదేశ మిప్పుడు తానుండిన స్థితినుండి మాఱి మఱియొకస్థితిలోఁ బ్రవేశింపనున్నది. ప్రజలు కేవలకృషిజీవనము వదలి శిల్పాద్యన్యవ్యాపారములలోఁ జొరఁ జూచుచున్నారు; చేతిపనులు మాని కర్మాగారములు స్థాపించి వానిని యంత్రసాహాయ్యమునఁ గావించుకొనఁ బ్రయత్నించుచున్నారు. విషమమైన యీసంధికాలములో వేయికన్నులతోఁ జూచుచు బహుజాగరూకతతోఁ బరిపాలకు లీమహత్తమమైన ప్రజోత్సాహశక్తిని దేశక్షేమానుకూలముగాఁ ద్రిప్పి నడపవలెను.

శి.—ఈసందిగ్ధ శుష్కోపన్యాస వచనములతో నేమి ప్రయోజనము? ఎట్లు నడపవలెనో నిర్ధారకముగా నేమైనఁ జెప్పినారా?

గు.—చెప్పినారయ్యా! కొంచె మోపికపట్టుము; గ్రుక్క త్రిప్పకొననీయ వేమి గ్రహచారము! "కట్టె, కొట్టె, తెచ్చె"నని సంక్షిప్త రామాయణమువలెఁ జెప్పిన లాభములేదు గదా! ముసలివాఁడను, విషయ మనభ్యస్తము, ఆలోచన కించుక యవకాశ మీయవలెను.

శి.—క్షమించి యట్లే సావకాశముగానే సెలవిండు. ఎట్టి వారికైనను ముసలితనములోఁ బూర్వవయస్సునందొక్కవడి యుండుట కష్టము.

గు.—ఏ మార్గమైనను, మంచిదగు నెడలఁ, బ్రజల యొక్క పదార్థోత్పాదన శక్తి హెచ్చుచేయవలెనుగాని క్షీణింపఁ జేయఁగూడదు. కనుకఁ బ్రభుత్వమువారు నవీనవ్యాపారఫలపరీక్షణార్థము యుక్తమైన వ్యయముచేసి పరిశీలనపర్యవసానము ప్రజల కెఱుకపడు నేర్పాటులు గావింపవలెను. అర్థబలమును వ్యాపారనైపుణ్యమును గల పరదేశస్థులు పోటిగావచ్చి క్రొత్తగా నంకురించినవృత్తుల నశింపఁజేయకుండఁ గఠినమైన దిగుమతిపన్నులువేసి వానిని సంరక్షింపవలెను. ప్రథమావస్థలోఁ బ్రజా

సుఖకరములైన నూత్నవ్యాపారములకుఁ జాలిన ధనసాహాయ్యము చేయు చుండవలెను. బహుముఖముగా నిట్లు పరిపాలకులు తోడ్పడుటవలన నం దఱుజనులకు వారు సమానమైన యవకాశము లొసఁగినవా రగుదురు. కాని దేశములో నెవరో యల్పసంఖ్యాకులు విత్తాఢ్యులై యుండుటగాని యేదో యొకవృత్తికయియే ప్రజలు ప్రభువులనుండి తోడ్పాటుపడయుట గాని దేశమునకు మంచిదిగాదు.

శి—నాకు బోధపడలేదు. ఏల మంచిదిగాదు?

గు—మొదటిదానివలనఁ బెక్కుర కతృప్తి గలుగును; అందుచే నంతఃకలహములు పుట్టును.

శి—అతృప్తి యేల కలుగవలెను?

గు—సమానముగాఁ బాటుపడుప్రజలలోఁ గొందఱకడ ధన మత్యధికముగాఁ జేరియుండుట సహజముగా నితరుల కసూయాజనకమగును.

శి—సరియే, రెండవదానివలన నేమిబాధ?

గు—దేశములో నందఱుఁ గృషీవలవృత్తియే యవలంబించి జీవింపఁజూతురనకొనుము; ఆ యొక్కవృత్తి నభివృద్ధినొందించుటకే పరిపాలకులు ధనాదిసాహాయ్య మొనస్తురనుకొనుము; దీర్ఘానావృష్టి క్షామబాధలు తటస్థించు నెడల నప్పుడు దేశదురవస్థ యెట్లుండునో యోజించుకొనుము.

శి—కాలము సరిగా లేకున్నచో నేకజీవిక నాధారముచేసికొను దేశప్రజలు బాధపడుదురనుట నిజమే.

గు—కాలము సరిగానున్నను ఆయపాయము పూర్తిగాఁ బోదు. ఏఁటేఁట బ్రజాభివృద్ధి యగుచుండును.

శి—ఏమో! పుట్టుకలతోపాటు చావులు నున్నవి.

గు—న న్నొకవిషయమునుండి యొక విషయమున కీడ్చుచున్నావు. ప్రజాగణనముచేసి ప్రకటించు ప్రభుత్వమువారి లెక్కలను ప్రమాణముగాఁ గొనుచో నీ కట్టిసందేహము కలుగఁ గూడదు. మనదేశములో

స్త్రీలకు వివాహము లైచ్ఛికములు గావు. సంతానహీను లత్యల్పసం ఖ్యాకులుగా నుందురు. అర్థలోపము కావలసినంత యున్నదిగాని అపత్య లోప మింతమాత్రము లేదు. "బీదలకు బిడ్డ లెక్కువ" యను లోకోక్తి నీవు వినియేయుందువు. ఆయుగురుబిడ్డలఁగని తలిదండ్రులిద్దఱు గలించిన, జనసంఖ్యలో మునుపటికంటె నలుగు రెక్కువగానుండరా ?

శి—ఔను, మీమాటల కడ్డురాను, సంభాషణముసాఁగిపోనిండు.

గు—ప్రజలు నానాఁటికి హెచ్చుచుందురు, భూమిమాత్రము యథాపూర్వముగానే యుండును, భూసారము తగ్గిపోవుచుండును, ఎన్ని క్రొత్తయెరువులువేసి సేద్యముచేసినను తిండికిఁజాలు సస్యముండనిరోజులు రాకమానవు. కనుకఁ బరిపాలకు లీచిక్కులన్నియు నాలోచించి వ్యవసా యము, వర్తకము, శిల్పములు, నింక నితరవృత్తులు—వీని కన్నిటికి య థోచితముగా సాయపడుచుఁ బ్రజలను గాపాడవలెను. యావద్దేశప్రజావర్గ ములో నుండు బుద్ధిబలదేహబలములకుఁ దగు నవకాశములిచ్చి తోడ్పడి వారు వానిని దేశాభివృద్ధికై యుపయోగించుకొనవలెను.

శి—ఇన్నిటికి సాయపడుటకు సొమ్ముండవలెనుగదా !

గు—ఉండవలెను. అందుకయియే పన్ను లేర్పడినవి. కాని యా పన్నులు వేయుటలో రాజు ప్రజల కెంతమాత్రము బాధకలిగింపక వారు సంతోషపూర్వముగా నవి చెల్లించుకొనునట్లు చూచుకొనవలెను—అని కుమారప్పగారు చక్కని ప్రాచీననవీనోపమానములతో విశదీకరించినారు. చెట్టునకు హానికలుగకుండ బాగుగాఁ బక్వమైనపిదపఁ బండ్లుకోసికొనునట్లు ప్రజల కావంతయైన నొప్పి కలుగకుండఁ బ్రభువు వారినుండి పన్నులు గొ నవలయును—అని కౌటిల్యుఁడు చెప్పినాఁడఁట.

శి—ఏకాత్ముఁడుగా రేమియుఁ జెప్పలేదా ?

గు—ఎరువువేసి నీరుపోసి మొక్కలను బుష్టముగాఁ బెంచినపిదపఁ దోఁటకాఁపు పూవులును ఫలములును ఎట్లుకోసికొనునో రాజట్లే ప్రజ

లను సుఖపెట్టి యనాయాసముగా పన్నులు చెల్లింపఁగలశక్తి వారికి మొట్టమొదట నిచ్చి పిదపఁ బన్నులు పుచ్చుకొనవలెను—అని శుక్రాచార్యుఁడుకూడ నట్లే చెప్పినాఁడు. మఱియుఁ బన్నులవలన బ్రజలవస్తూత్పాదనశక్తి తగ్గఁగూడదు. కత్తిరించి గొఱ్ఱెలనుండి ఉన్ని గొనవలెనుగాని వానిమెడ లొలిచి తీసికొనరాదు. సుఖజీవనమునకుఁ జాలినధనము ప్రజలకడనుంచి యతిరిక్తముగా నున్న విత్తమునుండియే రాజు పన్నులు గ్రహింపవలెను. అధికారులు ఆయమూలములను శుష్కింపఁజేసి నాశముచేయఁగూడదు. మరలఁ బుష్పించుశక్తి పుష్కలముగా మొక్కల కుండనిచ్చి పుష్పవిక్రేత యిఁక నటనున్న వాడి రాలిపోవుట దక్క ననన్యోపయోగమేమియు వానివలన లేనప్పుడే పూవులుకోసి యమ్ముకొనును. సరిగాఁ బ్రభు వట్లే ప్రజలనుండి పన్నులు రాఁబట్టుకొనవలయును; లేనిచో బాగ్గులకై ఫలవృక్షములను బడఁగొట్టి కాల్చినకాఁ పెంతబుద్ధిమంతుఁడో భూపతియు నంత బుద్ధిమంతుఁడే యగును.

శి—నిదర్శనములు చాల హృదయంగమములుగానున్నవిసుండీ!

గు—బుద్ధిమంతులగు పూర్వులు తెచ్చిన దృష్టాంతము లన్యథాయుండునా నాయనా! కుమారప్పగారింకొక ముఖ్యమైన విషయమును గూర్చి చెప్పినారు విను.

శి—చిత్తము.

గు—కుడువఁ గూడును కట్ట బట్టయు నున్నవారా, కారా? యను సందిగ్ధదశలో—లేమియొక్క సరిహద్దులలో—నున్నవారినుండి రాజ్యెట్టి పన్నును గ్రహింపఁగూడదు; ఆలోటు ధనాఢ్యులనుండి కూడఁదీసికొనవలెను. క్రేతలకు భారముగలిగించు "పరోక్షకరములు—Indirect taxes" జీవనమున కత్యావశ్యకములగు సామాన్యాహారపదార్థములపై వేయక, కేవల భోగపదార్థములపైనే వేయవలెను. అట్లు చేయుటవలన బీదల కేబాధయు నుండదు. ధనవంతులగు భోగపరాయణు లట్టిపదార్థము

లెంతడబ్బుపెట్టియైనను గొనఁగలరు. ఇట్టి యపరిత్యక్షపుఁ బన్నులవలన దేశపుటాదాయము హెచ్చగును. చివర కాపన్నులు చెల్లించువారు భోగులగు ధనికులేకనుక వారి కవి చెల్లించుచున్నట్లే కాన్పింపదు. అది పూవు లెఱుఁగకుండఁగనే తేఁటి పుష్పమరందముఁ గ్రోలినట్లుండునని పూర్వులు చెప్పినారు.

శి—యథాన్యాయముగాఁ బరిపాలించుకొనఁదలఁచు రాజు బహు జాగరూకుఁడై యుండవలెనన్నమాట.

గు—ఔను నాయనా! అందుచేతనే "రాజ్యాంతమందు నరకము ధ్రువము" అన్నారు పెద్దలు. సామాన్యకుటుంబియగు సంసారియే ధనార్జనములోకంటెఁ దద్వినియోగములో నెక్కువ తెలివితేట లగపఱుపవలెనుగదా, యిఁక దేశకుటుంబియగు దేశాధిపతి యెంత తెలివితేట లుపయోగింపవలెనో యోజించుకొనుము. పన్నురూపముగావచ్చు ప్రతిరూపాయయును ప్రజాపదార్థోత్పాదనపాటవ మెక్కువచేయుచున్నదో లేదో యతఁడు కనిపట్టుచుండవలెను, ధనబలముగలవారినుండి విశేషముగా డబ్బులాగి బలహీనులగు దరిద్రులను బోషించుచుండవలెను, విత్తవంతులనుండి గ్రహించిన విత్తముతోఁ బామరులలో విద్యావ్యాప్తి గావింపవలెను అంతేకాని పేదలను బాధించు పన్నులువేసి యవి ధనవంతులను ధనవత్తరులఁ జేయుట కుపయోగించుట యవివేకము, అధర్మము, చివర కది యాత్మవినాశహేతువుకూడ నగును. అబ్ధినుండి యత్యధికమైనజలము ఆవిరిగాఁ బైకిఁబోయి వర్షరూపమునఁ గ్రిందఁబడి యల్పజలాశయములను బుష్టము చేయుచుండుటలేదా?

పరిపాలనము బాగుగా నడపుటకైనను యుక్తవ్యయమే చేయవలయునని కుమారప్పపండితుఁ డింకొక హితోపదేశము చేసినాఁడు.

శి—మంత్రిబృందముల వేతనము లధికముచేసి చిన్నచిన్న యుద్యోగుల గొంతుకలు గోయుమనియా?

గు—కాదు, పరిహాసములు కట్టిపెట్టి పండితునివాక్యములు శ్రద్ధతో వినుము :—

రాబడినిబట్టి గృహస్థుఁడు నవుకరుల నెట్లుపెట్టుకొనునో దేశముయొక్క ఆయమునుబట్టియు దేశభాగ్యమునుబట్టియుఁ బన్నులు చెల్లింపఁగల ప్రజాశక్తిఁబట్టియుఁ బ్రభువు పరిపాలనపు టేర్పాటులు గావించుకొనవలయును. రాజ్యాంగవ్యాపారము చక్కఁగా గడియారమువలె నడచుచున్నదిగదా యని యమితవ్యయము చేయఁగూడదు. పరిపాలనపుఖర్చు ప్రజలు సునాయాసముగా భరించుటకై యది దేశమునందలి మనుష్యుని సగుటాదాయమున కిన్నిరెట్లుండవలయును — అని యొక కఠిననియమము చేసికొనుట మంచిదని కుమారప్పగారు చెప్పుచున్నారు. అట్లు చేసికొనునెడల భిన్న దేశప్రజాసామర్థ్యములలోఁ గాని భిన్న దేశవస్తుమూల్యములలోఁగాని కన్పట్టుభేదము దానియంతట నదియేఁ యంతరించిపోవునఁట. రాజ్యము విత్తవీర్య సుఖసంపన్నముగావించుటకు కవశ్యావలంబనీయములగు సూత్రము లివ్వియని యాయన యీపత్త్రికలో వ్రాసినాఁడు.

శి—అయ్యో ! అప్పుడే ముగించినాఁడా ?

గు—ఇందం తేయున్నది. మన దేశమాత మహావైభవ మనుభవించిన చంద్రగుప్తుఁడు అశోకుఁడు మున్నగు చక్రవర్తులకాలముమాట యెత్తుకొనక బ్రిటిషురాజ్యమునకు సన్నిహితపూర్వమున హిందూదేశపు టార్థికస్థితి యెట్లుండెనో సప్రమాణముగా ముందు పత్త్రికలోఁ బ్రకటించెదనని కుమారప్పగారు చివర వ్రాసినారు.

శి—అయినను నింకొక గురుశిష్యసంవాదమునకు సామగ్రియున్నది.

గు—సామగ్రి కేమికొదవ? పనిగట్టుకొని నీవు వచ్చుచుండవలయును, అప్పుడు నా కారోగ్యమును తీఱికయును నుండవలయును.

శి—శ్రమయిచ్చినందులకు క్షమించి యిఁక నాకు సెలవిండుఁ నమస్కారము.

గు—శుభమస్తు ! సుఖీభవ !

# II-2

( వందనాశీర్వాదముల పిదప )

శి—కుమారప్పగారు తరువాత నేమిచెప్పినారో విను కుతూహల ముతో వచ్చినాను. వెనుకఁ జెప్పినది సత్పరిపాలనాపద్ధతి.

గు—పందొమ్మిదవశతాబ్ది ప్రారంభమున హిందూదేశస్థితి యె ట్లుండెనో తరువాతిపత్త్రికలో సప్రమాణముగాఁ జెప్పినారు.

శి—తత్పూర్వస్థితిమాట యేమియు నెత్తికొనలేదా?

గు—ఎత్తుకోకయేమి? ౧౦౦౦—౧౮౦౦ సంవత్సరముల మధ్యకాల ములో మనదేశము మహోచ్చస్థితిలో నుండెనని వ్రాసినారు.

శి—ఏమివ్రాసినారో కొంచెము సెలవీయరా ?

గు—అప్పుడప్పుడు కొన్ని దేశోపద్రవములు సంభవించుచుండి నను ఇతరదేశములతోఁ బోల్చి చూచినయెడల మొత్తముమీఁద భారత వర్ష మారోజులలో సిరిసంపత్తులును ప్రశాంతిసుఖమును అనుభవించిన దని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

సముద్రముమీఁదను మెట్టమార్గముననుగూడఁ దనసరకులనంపి హిందూదేశము దూరదేశములతో విపులమైన వాణిజ్యవ్యాపారము పె ట్టుకొని యమితమైన ధనలాభము నొందుచుండెను.

నాఁటి హైందవులకు విశేషముగా శిల్పనైపుణ్యముండెడిది. వారు తమదేశములోఁ బండిన ప్రత్తిమున్నగు పదార్థములతోఁ బ్రశస్తములైన వస్త్రాదులు నేసి పరదేశములకంపి యధికధన మార్జించుకొనెడువారు. విలువగల సరకులనిచ్చి వెండిబంగారములు దెచ్చుకొనెడివారు. అప్పు డెంతోరాజ్యబలముగల "రోము" కూడ "అయ్యో! మనధనమంత యు హిందూదేశమే లాగుకొనిపోవుచున్నదే!" యని పరిదేవనము నొం దుచుండెడిదఁట.

ప్రజలు తమ తెలివితేటలచే దేశములోని ద్రవ్యములతో మంచి

మంచి సరకులు కల్పించి వానిని స్వదేశీయులకును బరదేశీయులకును విక్ర యించి డబ్బు చేసికొనెడువారు; వారికి చేయినిండఁ బనియుఁ గడుపునిండఁ దిండియు నొడలునిండ బట్టయు నుండెడివి.

తూర్పుసముద్రతీరమున ఢాక్కానుండి బందరువఱకు నుండువారు ఉల్లిపొరలవంటి "మస్లిన్" బట్టలు నేసి యెగుమతిచేసికొనెడువారు; పశ్చిమసముద్రతీరమున "కాలికట్టు" నుండి ప్రశస్తమైన "కాలికో" బట్ట లమితముగా వచ్చుచుండెడివి. ఈవర్తకము ౧౮ వ శతాబ్ది యుత్తరార్ధ మునఁగూడ నుండెడిదఁట.

శి—స్వదేశవాణిజ్యపోషణార్థము పాశ్చాత్యప్రభువు లట్టిసరకుల పై దిగుమతిపన్నులు వేసెడివారుకారా ?

గు—ఏల వేయకుందురు? వేయకుండినఁ బ్రజలు నిలువనిత్తురా ?

౧౭౩౫ వ సంవత్సరములో నొకపత్త్రిక గట్టిగా మొఱపెట్టుకొనఁగా స్వదేశవయనవ్యాపారము పడిపోకుండ కాపాడుటకు ఇంగ్లండు దిట్ట ముగా దిగుమతిపన్నులు విధింపవలసి వచ్చినదఁట.

శి—మనవా రారోజులలో నొక్క నూలిబట్టలే యెగుమతిచేసెడి వారా యితరమైనసరకులు కూడఁ బంపెడువారా ?

గు—నూలిబట్టలేకాదు—పట్టువస్త్రములు, బుటేదారుపనిచేసిన బట్టలు, తివాసులు, చక్కని చెక్కడపుపనిచేసిన రత్నభూషణములు, దంతపుసరకులు, సుగంధిద్రవ్యములు—ఎన్నెన్నో యెగుమతిచేసి యింద్ర వైభవ మనుభవించెడువారు.

శి—అవన్నియు నెవరిపడవలమీఁదవేసి పంపెడువారు?

గు—తమ పడవలమీఁదనే. కొన్ని పర్షియాసింధుశాఖ అరేబి యామీఁదుగా నావల యూరప్పునకు సరకులు కొనిపోయెడివి; కొన్ని యీవల చీనా జపానుదేశములకుఁ గొనిపోయెడివి.

శి—అబ్బా! మనవారి కప్పుడు నౌకానిర్మాణనిపుణతకూడ నుం డెడిదేమి ?

గు—ఆ! నిస్సందేహముగా! "రాధాకుముదముఖర్జీ" గారు తాము వ్రాసినగ్రంథములో నొకలేఖ యుదాహరించినారు. అది "బాలాసోరు" లో నున్న పాశ్చాత్యవణిక్ప్రతినిధులు లండనులోనుండు "ప్రణేతలసభ — The Court of Directors" కు ౧౬--౧౨--౧౬౭౦ తేదీని వ్రాసినయుత్తరము. అం దిట్లు వ్రాయఁబడియున్నది :—

"అనే కాంగ్లవర్తకులును తదితరులును వారిపడవ లిటఁ బ్రతిసంవత్సరము కట్టించుకొనుచున్నారు. పరిశస్తముగాఁ బెరిఁగిన ముదురుకఱ్ఱ యిటఁ గావలసినంత యున్నది. తీరమునందు దివ్యమైన యినుమున్నది. లంగరులు మున్నగు నినుపసరకు లీదేశస్థులు మిక్కిలి నేర్పుతోఁ జేయుచున్నారు. సుప్రసిద్ధ నౌకానిర్మాత లనేకు లిట నున్నారు. పడవలు నిర్మించి వానిఁ గడలిపై విడుచుటలో వారికంటె నెక్కువ కుశలుల నీప్రపంచములో నే నెచటను జూడలేదు. తెరచాఁపలు, ఓడపగ్గములు, నూలినిచ్చెనలు, మున్నగు పోతోపకరణములు వారు చేయుపద్ధతి కడుఁ బ్రశస్తమైన పద్ధతి."

౧౮౦౨ వ సంవత్సరమునఁగూడ ఇంగ్లండునకు యుద్ధనావలు ఇండియా కట్టిపెట్టెడిదఁట. హైందవపోతనిర్మాతలనుండి ఇంగ్లండువారు నమూనా లర్థించి తెచ్చుకొనెడువారఁట.

శి—అయ్యో! యెట్టిదేశ మెంతయున్నతస్థితినుండి యెంతనిమ్నస్థితికిఁ బడిపోయినది!

గు—పూర్వకాలపు దివ్యభవనములు, కాలువలు, ఘంటాపథములు—అక్కడక్కడఁ గొన్ని ప్రాచీనవైభవ స్మారకచిహ్నములుగా నిప్పటికిని నిలిచియున్నవి.

శి—అప్పుడు క్షామబాధలే ప్రజ లెఱుఁగరుకాఁబోలు.

గు—ఎఱుఁగరని చెప్పుట యసత్యము; కాని యేవద్దేశము నొక్కమారు కఱవు లప్పుడు బాధించెడివిగావు. ఆరోజులలో రాకపోకల

సౌకర్యము లిప్పటికంటె మిక్కిలి తక్కువగా నుండెడివి గావున పండిన చోట్లనుండి పంటలేనిచోట్లకు సరకులు తీసికొనిపోవుట కడుఁ గష్టముగా నుండెడిది. ఆకాలములలో క్షామబాధాకారణ మనావృష్టి హేతుకమైన సస్యాభావముగాని ధాన్యాదులు కొని బ్రతుకుటకుఁ జాలినడబ్బు ప్రజల చేతిలో లేకపోవుటగాదు. ఆవిపత్తు దైవికముగాని దుష్పరిపాలనముచే మనుష్యుఁడు బుద్ధిపూర్వముగాఁ దెచ్చి నెత్తినివైచుకొన్న విపత్తుకాదు.

శి—ఇప్పటివలెఁగాక యప్పుడు బలవంతులగు పరరాజులు దేశముపైఁ బడి దోఁచుకొనెడువారని విందుమే!

గు—అప్పుడప్పు డట్టివిప్లవములు సంభవించెడివన్నమాట వాస్తవమే. సారవంతమైన భూములు గలిగి ధనవంతమైయున్న దేశము చూచినఁ బరరాజులకన్నులు గుట్టకమానవు; వారిదోఁపిడివలనఁ గొంతనష్టము ప్రజలకుఁ గలుగకయును మానదు. కాని, కంటికగపడి చేతికి దొరకు డబ్బును సరకులును దోఁపిడికాండ్రు లాగుకొని పోఁగలరుకాని ప్రజల పదార్థోత్పాదనశక్తి నెట్లు పట్టుకొని పోఁగలరు? కనుక ఆబాధలు తఱచుగాఁ బట్టనములలో నుండు విత్తవంతులను దాఁకెడివిగాని పల్లెలలోనుండు కర్షకులకును చేతిపనులు చేసికొని జీవించువారికిని దగిలెడివిగావు.

మఱియు, సేద్య మొకపవిత్రవృత్తిగా నప్పటివారు భావించుకొనెడివారు. అందుచేత నెక్కడనో రాజులకును రాజులకును జరుగురణముల వలన సేద్యకాండ్రకుఁగాని చేలపైనుండు సస్యములకుఁగాని మొట్టిసేగియుఁ దటస్థించెడిదిగాదు. పంటకాఁపులయాస్తి పాడుచేయుట పాతకముగాఁ బరిగణించెడువారు.

కనుక ౧౭౩౯వ సం॥లో జరిగిన "నాదర్షా" కొల్లవంటి యుపద్రవములవలన మనదేశమునకుఁ గొంత తాత్కాలికబాధ కలిగెడిదికాని పెద్ద నష్టము సంభవించెడిదిగాదు.

శి—కష్టపడి సంపాదించుకొన్న యాస్తియంతయు నపహరించి

మనుష్యులను బ్రాణావశిష్టులఁజేసి విడిచిపెట్టిపోవుట పెద్ద నష్టముగాక చి న్ననష్టమా? మీ యీమాట నా కేమియు నచ్చుటలేదు.

గు—నష్టములేదని నేఁ జెప్పుటలేదయ్యా! ఆనష్టము కొందఱకే కలిగి కొంతకాలమే యుండెడిదని చెప్పినాను; ప్రజలజీవికలును వృత్తులు ను నశించెడివికావని చెప్పినాను. ఒకఁడొకనిని దోఁచుకొని యంతటితో విడిచిపెట్టినాఁడనుకొనుము; మఱియొకఁడున్నసొమ్మెల్లఁ బట్టుకొనిపోవు టయేకాక వానిగుఱ్ఱిల్లు మీఁకి చేతులు నఱికికూడఁ బోయినాఁడనుకొనుము. పునర్ధనార్జనశక్తి పోఁగొట్టి రెండవవాఁ డెక్కువహాని చేసినవాఁడుకాలేదా?

శి—ఔను; కథ సాఁగిపోనిండు.

గు—కనుక స్వరాజపీడయో పరరాజపీడయో వదలిపోయినవెం టనే పడిపోయినవృత్తులు మరలఁ దలలెత్తి కామధేనువులవలెఁ బ్రజల మరల నైశ్వర్యవంతులఁ జేయుచుండెడివి.

దుర్వినియోగము చేసినను సద్వినియోగము చేసినను పన్నుమొత్త మంతయు స్వదేశములోనే వ్యయింపఁబడుచుండెడిది. రాజులు భోగైక తత్పరులైనను వారు వెచ్చించుడబ్బు తమ ప్రజలకడకే పోయెడిది. చిత్ర చిత్రభోగపదార్థములు క్రొత్తక్రొత్తవి చేయునేర్పు ప్రజల కలవడుచుం డెను; ఆనూత్నవస్తుకల్పనశక్తి దేశమునకే లాభకారి యగుచుండెను.

స్వదేశీయులే పరిపాలనకృత్యములలోఁ బాల్గొనుచుండుటచేతఁ బెద్దపెద్దవేతనములు బుద్ధిశాలులగు మన దేశమువారికే ముట్టుచుండెడివి. దేశభక్తితోఁ బాలనము జరుపఁబడుచుండుటచే వేనవేల క్రొ వృత్తులు కల్పింపఁబడుచుండెడివి.

గ్రామములోని పంచాయతిసభ్యులే స్థితిగతులు స్వయముగాఁ జూచి పన్నులు విధించెడివారు. పొరపాటుచే నందు హెచ్చుతగ్గు లేమైన వచ్చినచోఁ బ్రజలు చెంతనుండునధికారులతోఁ జెప్పుకొని వెంటనే వానిని సవరించుకొనుట కవకాశ ముండెడిది.

పంటనుబట్టి పన్నులువేసెడివారు. అవి ధనరూపముగాఁ జెల్లించిన నుసరే ధాన్యాదివస్తురూపముగాఁ జెల్లించిననుసరే—అది రైతులయిష్టము నసు విడిచిపెట్టెడువారు. అందుచేత వ్యవసాయము చేసినవానికి ఏఁటి పంటయంతయుఁ బన్నురూపముగాఁ దుడిచిపెట్టుకొనిపోకుండ సంవత్సరగ్రాసమునకే కాక క్షామాదికష్టకాలమునకుఁగూడఁ గొంత మిగిలియుండెడిది.

శి—సరియే; యన్న వస్త్రముల కేకొదవయులేకుండ నప్పటి ప్రజలు జీవించెడివారన్న మాట.

అనాఁడు వర్ణములఁబట్టి వృత్తు లుండెడివిగనుక నిండ్లే పాఠశాలలుగాను వారివారి కర్మాగారములే యుచితముగాఁ గళాప్రయోగభాగములు నేర్పు అభ్యాసస్థానములుగాను నుండెడివని యూహించుకొనఁగలను. కాని లోకవ్యవహారమునకుఁ గావలయు సామాన్యవిద్య జనులకు బాల్యములోఁ గఱపుటకు ఊళ్లలో నిప్పటివలె నప్పుడు బడులుండెడివా ? ఉన్నచో నవి యెట్లు పోషింపఁబడుచుండెడివి ?

గు—ఊరూర నొకబడి యుండెడిది. వృత్తిమాన్యములిచ్చి యట్టి పాఠశాలలను నిలిపి పోషించెడువారు, ఆలాగుననే యితరములైన స్థానపరిపాలనాశాఖలకుఁ గావలయునుద్యోగులను నియోగించెడివారు. కావునఁ బ్రతిగ్రామమును బ్రజాపరిపాలనము క్రిందనేయుండు నొక చక్కని చిన్న రాష్ట్రముగా నుండెడిదని నీ వనుకొనవచ్చును.

శి—ఆలాగునఁ బరిపాలింపఁబడు దేశము భూలోకస్వర్గముగా నుండదా? ౧౮ వ శతాబ్ది చివరవఱకు మనదేశ మన్నివిధముల నట్లే సుఖపడుచుండెడిదికాఁబోలు !

గు—ఉండినట్లు మనవారేకాక నాఁటిదేశము నద్దెసలు దిరిగిచూచిన యూరప్పువారగు బాటసారులును దదితరులునుగూడ లిఖించిపెట్టినారు. అట్టినలుగురసాక్ష్యములు దిశ కొక్కటిచొప్పున నెత్తి కుమారప్ప పండితుఁడుగారు పత్రికలో నుటంకించినారు.

శి_ఆలాగుననా? అవియేవో తెలియఁబలుపఁబ్రార్థించుచున్నాను.

గు—ఉత్తరముననున్న భరతపురసంస్థానమునుగూర్చి "బిషప్ హీబరు" గారు తన దినచర్యాపుస్తకములో నిట్లు వ్రాసినారు :—

"జలసమృద్ధమై సేద్యము ప్రశస్తముగా జరుగుచున్నట్లు నా కగపడిన హిందూదేశభాగములలో నిదియొకటి. పొలములలో పైరు పరమసుందరముగా నున్నది. ప్రత్తిపంట ప్రశస్తముగా నున్నది. పండినచెఱకు లప్పుడేకోసి బయలుచేసిన విశాలక్షేత్రములును అనేకములైన చెఱకుగానుఁగలును నేఁ జూచినాను. అన్నిటికంటెను దేశభాగ్యమున కివి యమోఘదృష్టాంతములు. ప్రజాబాహుళ్య మంతగా లేదుకాని, పల్లెలన్నియు మిక్కిలిమంచిస్థితిలో నున్నవి. మరమ్మతులు బాగుగా జరుగుచున్నవి. కంపెనీయధికారములో నున్న రాష్ట్రములఁజూచి రాజపుత్రస్థానములో నింపైన యిట్టి వ్యాపారములు చక్కఁగా సాఁగుచుండు ప్రదేశముండునని నే ననుకొనలేదు. దీనిఁబట్టి భరతపురప్రభువు ప్రజలఁ దనబిడ్డలవలెఁ జూచుకొని పరిపాలనముచేయు నసాధారణప్రజ్ఞావంతుఁడనియైన నూహింపవలెను, లేదా బ్రిటిషురాష్ట్రములందలి పరిపాలనావిధానము స్వదేశప్రభువుల పరిపాలనాపద్ధతికంటెఁ బ్రజాసౌఖ్యవిషయమునను దేశాభ్యుదయవిషయమునను దక్కువయనుకూలముగా నున్నదనియైన నూహించుకొనవలెను.".

శి—మతగురువుగనుక నసత్యభీతిచే నున్నదున్నట్లు వ్రాసినాఁడు.

గు—కల్లలాడకుండుటకు క్రైస్తవగురువే కానక్కఱలేదు. దక్షిణమున నప్పుడు మహమ్మదీయరాజ్యమై టిప్పుసుల్తానుచేఁ బరిపాలింపఁబడుచుండిన మైసూరురాష్ట్రమునుగూర్చి "లెప్టినెంటుకర్నల్ మూర్" గారు వ్రాసినమాటలు విను.

శి—చిత్తము.

గు—"దేశములోఁ బ్రయాణముచేయుచున్న పరదేశికి—చక్కఁ

గా సాగుబడిచేయఁబడుచున్న క్షేత్రములు, పాటుపడి పనిచేయు ప్రజల తో కిటకిటలాడుచుండు ప్రదేశములు, కంటికి కింపుగాఁ గట్టఁబడి యభి వృద్ధిలో నుండు పట్టనములు, విపులవ్యాప్తిగల వాణిజ్యము, ఎటు తిరిగి చూచినను ప్రజాసంతుష్టిని సూచించు లక్షణములు—ఇవి కనఁబడినప్పు డు ఆదేశపరిపాలనము ప్రజాప్రియమై సుఖకరమైన పరిపాలనమని యతఁ డనుకొనుట సహజము. పై యభివర్ణనము టిప్పుగారి పరిపాలనముయొక్క ప్రతిరూపమే.

అతనియేలుబడిలో నెల్లజనులు సుఖించిరనియు వారికంటె నే యితరరాజ్యప్రజలును ఎక్కువ సుఖవంతులు గారనియు ననుకొనుటకు జాలినంత హేతుబల మున్నది.

టిప్పుయొక్క ప్రవర్తనను గూర్చి ప్రతికూలవాక్యములు విని పర మానందమునొందుట కధికారసత్త్వముగల శత్రువు లతని కుండిరి. ఉండి నప్పటికిని, టిప్పుసుల్తానునకుఁ గలంక మాపాదించు నుడులుగాని సడుగు లుగాని యెవరినోటినుండియు వినఁబడెడివి గావు.''

శి—ఇఁకఁ దూర్పుపడమరలు మిగిలియున్నవి.

గు—అవియు వచ్చుచున్నవి తొందరపడకుము. తూర్పుననున్న వంగదేశమునుగూర్చి ''హాల్వెల్'' దొరగా రిట్లు వ్రాసినారఁట :—

''ప్రజలయర్థప్రాణము లిట నబాధ్యములు. సరకుతోఁబోవు వ ర్తకుఁడైననుసరే, సామాన్యపథికుఁడైననుసరే, యీదేశములోఁ బ్రభు జాగరూకతచే సురక్షితముగాఁ బ్రయాణము చేయఁగలఁడు. దమ్మిడిఖర్చు లేకుండ ఆరెకులు వెంటనేవచ్చి యంగరక్షకులై యతని నొకమజిలీనుండి యొకమజిలీకిఁ గొనిపోదురు......ధనవంతమగు 'డాక్కా' మండలపు భూములన్నియు సాగులో నున్నవి. ప్రజలకు నిష్పక్షపాతమైనన్యాయము దొరకుచున్నది. పరిపాలకుఁడగు 'జెస్వంతరాయఁడు' సద్విద్యాశిక్షితుఁ డై సప్రభువు, విమలాంతఃకరణుఁడు, ఋజుమార్గవర్తి, విసుగుకొనక

శ్రమకోర్చి యప్రమత్తుఁడై తన పరిపాలనకృత్యములు చేసికొనుచుఁ బ్రజాసౌఖ్యస్వాస్థ్యము లొనగూర్చుచున్నాఁడు. ప్రభుత్వమువా రెవరికో కొందఱకు సర్వగ్రాహకముగా సరకుల జట్టికిచ్చుపద్ధతి యతఁడు కొట్టివేసినాఁడు; ధాన్యములపైఁ బన్నులువేయుట మానివేసినాఁడు.”

శి—అట్టిసత్ప్రభువుల సంరక్షణమున జనులు నిర్భయులై సమస్త సౌఖ్యము లనుభవింతురన్న నం దాశ్చర్యమేమున్నది?

గు—ఇఁకఁ బశ్చిమరాష్ట్రములలో నొకటియగు మహారాష్ట్రము నుగూర్చి “అంక్వెటిల్ డూపెర్రాన్”గా రిట్లు సాక్ష్యమిచ్చుచున్నారు:—

“మహారాష్ట్రిలదేశము నేఁ జొచ్చినప్పుడు కృతియుగమునాఁటి యకాపట్యానందములమధ్యమున నే నుండినట్లు నాకుఁ దోఁచినది. ప్రకృతి యొక్క సహజసౌందర్య మట నింకను మాఱిపోలేదు. యుద్ధపీడ లింకను వారిని జెనకలేదు. ప్రజలు పూర్ణారోగ్యవంతులుగను జవసత్త్వసంపన్నులుగను చిత్తోల్లాసముగలవారుగను నాకుఁ జూపట్టినారు. అత్యంతమైన యతిథిసత్కార మాదేశములో సర్వజనసామాన్యమైన సద్ధర్మముగా నాకుఁ గాన్పించినది. వచ్చి మాకున్న దేమో యథేష్టముగా ననుభవింపుఁడు—అని యానందముతో నాహ్వానించుచున్నట్లు స్నేహితులకు ఇరుగుపొరుగువారికి అపరిచితులగువారైన దేశికులకు అందఱకు నచ్చటి ప్రతిగృహము సుగమమై సిద్ధముగా నుండును.”

శి—పందొమ్మిదవశతాబ్ది ప్రారంభముననున్న మనదేశస్థితి వినుటకెంతయు సంతోషకరముగా నున్నది. ఇరువదవశతాబ్ది యాదియందలిస్థితి యెట్లుండెనని కుమారప్పగారు చెప్పినారో వినఁగోరుచున్నాను.

గు—దానిఁగూర్చి నీవు మరల వచ్చినప్పుడు ముందు ముచ్చటించుకొందము.

శి—అట్లైన, నే నిప్పటికి సెలవుకొనికొందును; నమస్కారము.

గు—కల్యాణమస్తు!

# 11-3

( వందనాశీర్వాదముల పిమ్మట )

శి—20 వ శతాబ్దియాదినున్న మన దేశస్థితినిగూర్చి ముందుమాటాడుకొందమని వెనుక సెలవిచ్చినారు. అందుకై యేయిప్పుడువచ్చినాను.

గు—మంచిది నాయనా! వెన్నెలరాత్రుల పిమ్మటఁ జీకటిరాత్రులు వచ్చునట్లు సుఖదశ తరువాతఁ గష్టదశ వచ్చుచుండును. ఏకరీతిగా కాల మెప్పుడును గడవదు.

శి—తత్త్వోపదేశములు చేయుచున్నారేమి ?

గు—దారిద్ర్యమునకును దత్త్వోపదేశములకును దగ్గఱబాంధవ్యమున్నదిలే. దానిమాట యటుంచి కుమారప్పగారు మరలఁ బాశ్చాత్యులనే బోనులోఁ బెట్టి సాక్ష్యమిప్పించినారు వినుము.

శి—అలాగుననా! ఎవరెవ రేమనిచెప్పినారో సవిస్తరముగా సెలవిండు.

గు—సవిస్తరముగాఁ జెప్పినఁ బెద్ద భారతమగును. సంగ్రహముగాఁ బ్రస్తుతవిషయమునకుఁ గావలయు మాటలే చెప్పెదను.

శి—చిత్తము.

గు—"దినములకొలఁదిఁ బ్రయాణముచేసి చూచినప్పటికిని పశువులవలెఁ బాటుపడుచుఁ గాళ్లీడుచుకొని నడచిపోవుచుండు కటికిదరిద్రులే, ఎముకలగూండ్లవలెనుండు శుష్కశరీరులే, కంటి కగపడుదురుగాని యితరులు గానిపింపరు. హిందూదేశము దారిద్ర్యదేవతాసదనమని చెప్పవచ్చును. చక్కని మానవలక్షణములుగల మూర్తులలో ఆదైన్యపిశాచము ప్రవేశించియుండుట నాకు మఱియు శోచనీయముగాఁ జూపట్టినది...... హిందూదేశము పరమదరిద్రదేశమన్నమాట యభిప్రాయమాత్రము గాదు, పరమసత్యము."

శి— ఈమాటలు చెప్పినవారెవరు ?

గు—ఇంగ్లండుదేశపుఁ బ్రస్తుతమంత్రియగు "రామ్జేమెక్డోనల్డు" గారే, అసత్యములాడు నన్యులుగారు.

"డాక్టరుజోసియాఓల్డుఫీల్డు" గారు మనహిందూదేశము స్వయముగాఁ జూచివచ్చి దానిఁగూర్చి యొకవార్తాపత్త్రికకు వ్రాసినమాటలు వినుము.

"గ్రామగ్రామమునకు నేఁ బోయి యటనుండు పురుషులయొక్కయు స్త్రీలయొక్కయు శిశువులయొక్కయు దురవస్థఁ జూచి కడుదుఃఖించినాను. పొట్టకూటికై ప్రతిదినము వారు పడరానిపాట్లు పడుచు అర్థభుక్తితోఁ గాలము కడపుకొనుచున్నారు.

రోఁతగానుండు లండనుసందుగొందులుదాటి యచటి ప్రజలదుర్దశ చూచినాను. వారైన నొకప్పుడు నాకు మఱపువత్తురుగాని, ఋజుమార్గవస్తులై మితవ్యయులై ధీరులై సదా కాయకష్టపడి చెమటలూర్చి పనిచేసికొనుచు ముతుకపిండితోఁజేసిన చిన్నరొట్టెముక్కతోను నంజుకొనుట కేవోకొన్ని యూరుఁగాయముక్కలతోను రోజునకు రెండుసార్లు మాత్రమే త్రాగుటకుఁజాలిన మజ్జిగతోను కాలక్షేపముచేసికొను వీరు మాత్రము నామనోనేత్రముల కెప్పుడును గాన్పించుచునేయుందురు.

ఈ 1902 వ సంవత్సరము కఱవుసంవత్సరముగాదఁట. అయినప్పటికి నేనుజూచిన యనేకగ్రామములలోని పెక్కుకుటుంబములలో నిలువ ధాన్యపుబుట్టలప్పుడే దాదాపుగా వట్టివైనవి. అనఁగాఁ గొలఁదిగాఁబండిన తమపంట పన్నులుచెల్లించుటకై వారప్పుడే యమ్మివేసికొన్నారన్నమాట; ఇఁక రెండుమాసములలో వారికిఁ దినుట కేమియు నుండదన్నమాట."

శి—పరులకంటె కింతఘోరముగాఁ గన్పట్టు లేమిబాధ మనదేశ మెట్లు భరించుచున్నదో భగవంతునికే యెఱుక.

గు—"నేను మతప్రచారకుఁడను. నాక్రిందనున్న క్రైస్తవబృందము మూఁడువందలమంది. వారి యాదాయములఁ బరీక్షించి సిసలుగాఁ

గనుఁగొంటిని. రోజున కం దొక్కొక్కరికివచ్చు సగుటురాబడి యొక ఫార్దింగునకుఁ దక్కువ—అనఁగా నొకకానియైన గాదన్నమాట."

శి—వీ రెవరయ్యా!

గు—లండన్మిషన్ సంఘములోని "నోల్సు" దొరగారు. మొన్న మొన్న 1927 వ సంవత్సరములో "డాక్టర్ రూథర్ఫర్డు"గారు గ్రామస్థుల ఘోరకష్టములు మిక్కిలి విచారముతో వ్రాయుచుచు నాడినపలుకులు వినుము.

"జీవనమునకై ప్రజలు పడుశ్రమ భయంకరముగా నున్నది...... వారి శరీరస్థితిఁ జూడఁగా నొక్కమాటు అనాయాసముగాఁ జంపివేయకుండ నది వారిని బాధపెట్టిపెట్టి మందమందముగా మృత్యుముఖములోఁ జొరఁబెట్టఁ జూచుచున్నట్లున్నది. ప్రభుత్వమువారు పంటకై సస్యమైన నీటివసతు లేర్పఱిచికాని భూమిసిస్తులు తగ్గించికాని కఱవు లాఁపుటకుఁ బ్రయత్నించుటలేదు. నేనును బ్రిటిషుపౌరులలో నొకఁడనే కనుక నందు నాకును బాధ్యతగలదని యెంచుకొనుచున్నందువలన నాకెంతో మనోవేదన గలుగుచున్నది."

శి—బ్రిటిషువారిలోఁ గొందఱైన దీనవత్సలులును దయాంతఃకరణులును నున్నారు!

గు—ఉండకేమి? యోగ్యత యొకజాతి సొత్తుగాదు. ఈమాటలుకూడ వినుము:—

"మనము చూచుచుండఁగనే హిందూదేశ మంతకంతకు దుర్బలమై పోవుచున్నది. మన పరిపాలనలో నసంఖ్యాకులుగానుండు హైందవుల ప్రాణరక్తము పాటువాఱుచున్నవార్ధివలె రోజురోజునకు క్షీణించిపోవుచున్నది."

శి—ఇది యెవరియభిప్రాయము?

గు-అర్థశాస్త్రవేత్తయగు "హిండ్మన్"దొరగారి యభిప్రాయము.

శి—ఈసాక్ష్యములు చాలును, ఇతరనిదర్శనముచూపి దేశస్థితిని దెల్పుఁడు.

గు—పూర్వము చేతిపనులయం దెంతో నేర్పరులుగానుండిన శిల్పులు వృత్తినాశనమగుటచే జీవికలు దొరకక పొట్టకూటికై భూమి మీఁదఁ బడవలసినదురవస్థ సంప్రాప్తమైనది. సంవత్సరములోఁ గొంతభాగమే వారికిఁ బనియుండును, వానలు వెనుకపట్టినతరువాత ఏఁటిపొడుగున ను జేయుట కేపనియులేక వారు సోమరులై పడియుండవలసివచ్చుచున్నది.

శి—పాపము! ప్రజాభివృద్ధియైనకొలఁదిని కూడుగుడ్డలకు మఱియు నిబ్బందిగా నుండకమానదు.

గు—ఔ నామాట నిజమే, కాని ప్రజాభివృద్ధియైనను జనాభా లెక్కలనుబట్టి "గ్రేట్ బ్రిటన్" తోఁ బోల్చిచూచుకొనునెడల మన హిందూదేశములో గతించిన ౧౮౯౧-౧౯౨౧ నడిమి ముప్పదియేండ్లలో ను తక్కువగానున్నట్లే కన్పట్టుచున్నది.

శి—అలాగుననా?

గు—ఇదిగో ప్రజావృద్ధిపట్టిక :—

| | 1891-1901 | 1901-1911 | 1911-1921 |
|---|---|---|---|
| హిందూదేశములో నూటికి | 2.5 | 7.1 | 1.2 |
| గ్రేట్‌బ్రిటన్‌లో నూటికి | 12.2 | 11.6 | 5.4 |

కనుక మన హిందూదేశమునకుఁ బ్రజాభివృద్ధిబాధ అంతగాలేదు.

శి—పోనిండు, ఉన్నబాధలేవో యవియే చెప్పుఁడు.

గు—స్వదేశసస్య ద్రవ్యములతోఁ జక్కని వస్తువులుచేసి విదేశములకుఁ బూర్వము పంపుచుండిన మనదేశ మిప్పుడు పండిన ప్రత్తిమున్నగు పంటలు పండినట్టుగానే పరదేశములకంపి చదికిలఁబడి చేతులు ముడుఁచుకొని చూచుచున్నది.

వెనుక విపులముగానుండు నూలివడుకుడు బట్టనేత మున్నగు

కుటీరవ్యాపారము లంతరించిపోయినవి; పోయినవానికి మాఱుగాఁ జేయుటకుఁ గొత్తవియు లేవు.

ఇఁక హిందువులు పడవలు గట్టఁగలరనుమాట యెప్పటిదో పూర్వకాలపు సందిగ్ధవార్తయై పోయినది.

కడచిన యర్ధశతాబ్దిలోను కఱవుబాధలు తత్పూర్వముకంటె తఱచుగాను ఘోరముగాను నున్నవి.

శి—ఆబాధలు ప్రజలు నివారించుకొనకేల యూరకున్నారు?

గు—అట్టిశక్తి మనకున్న, నందఱవలెనే మనము నుందుము.

భారతమాతబిడ్డలే వెనుక గొప్పగొప్ప యుద్యోగములందుండెడువారు. వారంద ఱిప్పుడు కూటికి గుడ్డకుఁ జాలని కొలువులలో గుమాస్తాలు మున్నగువారుగాఁ బ్రవేశించినారు. ఉన్నతోద్యోగములు విశేషముగా యూరపువారిచేతిలోనే యున్నవి. వారిబాగు వారు చూచుకొందురు గాని ప్రజలక్షేమము చూడరు. ఏలచూతురు? మనదేశముతో వారి కర్థసంబంధమేకాని యనురాగసంబంధము లేదయ్యెను. పరిపాలితుల బాధలు పరిపాలకుల నంటునప్పుడుకదా వారికి పూఁచిభారములుండుట. ఉద్యోగముండినన్నినాళ్లు సాధ్యమైనంత డబ్బు కూడఁబెట్టుకొనుచు బొందు లిక్కడను డెందము లింగ్లండులోను నిల్పి యెప్పు డింటికిఁబోదుమాయని వారు చెప్పులలో కాళ్లుపెట్టుకొని యుందురు.

విద్యచూడఁబోయిన నదియు నట్లే యున్నది.

శి—విద్యకేమి? బి. ఏలు, ఎం. ఏలు, ఇంకేమేమోలు--ఎందఱో తేగలపాఁతఱవలె బయలుదేఱుచున్నారే!

గు—ఉన్నారు, నాయనా ఉన్నారు! కూటికి గుడ్డకుఁ గఱవైపడియున్నారు. స్థలభాండవిసర్జనముతోఁ జదువు సాఁగించుకొన్నారు పాపము! బిరుదులు సంపాదించుకొన్నారు! ఉద్యోగములుమాత్రి ముత్తమాటలైనవి. చేసికొనుటకుఁ బనులులేవు, శక్తులులేవు. ఘనపాఠిమైనను

గడ్డపాఱ పుచ్చుకొని పనిచేయఁగలఁడు గాని, షేక్స్పియరు మిల్టనులు జిహ్వాగ్రమందుండునట్లు పఠించిన మనపాశ్చాత్యవిద్యాపారంగతులు చేతి పనులు చేయఁజాలరు. సమర్థత తక్కువ, స్వాభిమాన మెక్కువ, గ్రామ స్థులతోఁ గలసిమెలసి మాటలాడుటయే కష్టముగా నుండును. వ్యామోహాపెట్టి వృత్తులనుండిలాగి అవసరమునుబట్టి యుద్యోగములిచ్చుట సుకరముగాని యిసుల్ల తెరలవలె నేఁటేఁట బయలుదేఱు బక్కపాశ్చాత్య విద్యావేత్తలకు సరిపడిన క్రొత్తయుద్యోగస్థానములు కల్పించుట కష్టము గాదా!

శి—ఉచితముగా గ్రామములలో పిల్లలకు చదువుచెప్పుటకువృత్తి మాన్యములిచ్చి బడులుపెట్టెడువారని మీరు వెనుకఁ జెప్పినారే!

గు—ఇతరములైన దేశీయపుటేర్పాటు లన్నిటివలెనే యవియు గంగలోఁ గలిసినవి. ఆమాన్యములకుఁ బన్నుగట్టినారు.

శి—వలలవలె దేశమంతటను రెయిలుబాటలు వైచినారే!

గు—ఔను, వైచి మనదేశపు సిరిసంపత్తులనెడి చేఁపలను బట్టుకొని పైకిఁ బంపుచున్నారు. వానిపై వెచ్చించుసొమ్ములో నల్పాంశము కాలువలు చెఱువులు నూతులు త్రవ్వించుటకు వినియోగించిన, నది సస్యాభివృద్ధికరముగ నుండును.

శి—పరదేశపుసరకులు చక్కనివి చౌకగా మనకు దొరకుటకు, పెద్ద దిగుమతిపన్నులువేయక విదేశవాణిజ్యము నిరవరోధముగా నడపుచున్నారే!

గు—నిజమే! అనావశ్యకమైన భోగపదార్థములపై పన్నులు తగ్గించి ఆలోటు కూడఁదీసికొనుటకై జీవనమున కత్యావశ్యకములగు పదార్థములపైఁ బన్ను లధికముగా వేయుచున్నారు. ఉప్పుపన్ను భూమి పన్ను నట్టివే.

శి—పందొమ్మిదవశతాబ్దిప్రారంభమున కలకలలాడుచు నంత

చక్కఁగా నున్న దేశము ఇరువదవశతాబ్దిలో నిట్టి విశంతులక్షణములతో నుండుటకుఁ గతమేమో తెలియదు. ఇంత స్వల్పకాలములో నంత క్షీణ దశ యేల ప్రాప్తించినదో యెఱుకపడకున్నది.

గు—కారణము కుమారప్పగారు అరఁటిపండొలిచి చేతఁబెట్టినట్లు చెప్పినారు, వినుము.

దేశముయొక్క భాగ్యాభాగ్యములు రెండింటినిబట్టి యుండును:- ౧. ప్రజలయొక్కప్రకృతి. ౨. పరిస్థితులప్రకృతి. పరిస్థితులను మరల (క) స్వభావసిద్ధములనియు (చ) మనుష్యకృతములనియు రెండుగా విభజించు కొనవచ్చును.

౧. హిందూదేశపురైతునకు స్వతస్సిద్ధముగా నుండుబుద్ధి, అభి నివేశము, కష్టాతికష్టమైన స్థితిలోనైనను అతఁడగపఱుచు క్షమాబలము —ఇవి జగద్విదితములై యున్నవి. అవి లేవని చెప్పువాఁడింతవఱకొకఁ డును గాన్పింపఁడు. కనుక మంత్రి "మెగ్డానెల్డు" గారి యీక్రింది యభి ప్రాయముతో ఏతద్విషయకమైనచర్చ కట్టిపెట్టుకొనవచ్చును.

"హైందవప్రజలు ప్రపంచమందలి యితరజను లందఱికంటెను ఎక్కువపాటుపడి పనిచేయువారు; వారిభూములలో నత్యధికభాగము సార వంతమై పుష్కలముగా ఫలించును."

౨. (క) ఇఁక దేశస్వభావము పరికించి చూచిన మంచి ధనాపా దకములగు నిన్ని ఆయమూలములుగల యితరదేశము ప్రపంచములో నె క్కడనోకాని కానరాదు. ఇనుము, రాగి, మేంగనీస్, బంగారము, రాక్షసి బొగ్గు, పెట్రోలియమ్, సీసము, ఉప్పు, పెట్లుప్పు—ఇట్టి వెన్నియో భూ మిలో నున్నవి. భూమిపై వివిధములైన ధాన్యములేకాక కాఫీ, తేయాకు, నీలిమందు, మున్నగు పెక్కుపంటలు పండును. గోఁగునార యిండియాలో నున్నంత యితరత్ర యెక్కడనులేదు. ప్రత్తిపంటలో భారతదేశము ప్రపం చమున ద్వితీయస్థాన మాక్రమించియున్నది. గోదుమలు, చముురుగింజలు

గూడ, బరదేశాపణములకుఁ బంపఁబడు సరకులలో ముఖ్యమైనవి. కావలసినంత విద్యుచ్ఛక్తి నుత్పాదించి పనిచేయించుకొనుట కనుకూలములైన యనేకపర్వతశ్రేణులున్నవి. నిక్షేపమువంటి యిన్ని సదుపాయములుగల దేశముయొక్క కటికిదరిద్రతకు దేశమే కారణమనిచెప్పుట కెవరికినినోరురాదు. కనుక విమర్శనముపై, మనుష్యప్రకృతియు దేశప్రకృతియుఁ గూడ నిరపరాధములని తేలినది.

౨. (చ) తరువాత మనుష్యకృతములైన "కృతక" పరిస్థితులఁ గూర్చి విచారించుకొందము.

హిందూజాతిజనులు మితవ్యయులు, తృప్తాత్ములు, ఎంతచాలని జీవనాధారపదార్థములతోనైనను కాలము గడపుకొనఁగలరు; అందుచేతనే వారికి పదార్థోత్పాదనశక్తి తక్కువగానున్నది—అని కొందఱొక విచిత్రసిద్ధాంతము లేవఁదీసినారు. దానికి "డాక్టరు డేవెనోర్పోర్టు"గా రిట్లు ప్రత్యుత్తర మిచ్చుచున్నారు:—

"ఇఁక నక్కఱలేదని పర్యాప్తకాముఁడై మనుష్యుఁ డెప్పుడు నాహారాదిసౌఖ్యము లనుభవించుట మానఁడు, అవి సంపాదనశ్రమార్హములు గావని తెలిసికొనినప్పుడుమాత్రమే మానివేయును."

శ్రమార్హములు గావని యట్టివానికై ప్రయత్నింపక ప్రజ లూరకుండుటకుఁ గారణమేమో విమర్శించి చూచుకొందము.

కృత్రిమపరిస్థితులు వివిధములుగా నుండును. అవియన్నియుఁ బరిశీలించుట కిది తావుగాదు. దేశాయవ్యయములఁగూర్చిమాత్రము దెల్పెదను. వానితోపాటు పరిపాలకులవశముననున్న రెయిల్వేలనుగూర్చియు ను స్వదేశ విదేశ నాణక వినిమయముఁగూర్చియును గొంత విమర్శనము చేయఁబడును.

౩—వచ్చుబడినిబట్టి వ్యయముచేసికొనుచు సంసారులు తమకుటుంబవ్యాపారములు సాఁగించుకొనునట్లే దేశప్రభువులు తమదేశవ్యవహార

ముల నడపుకొందురు, దానికిఁ బూర్వపక్షసిద్ధాంతముల యావశ్యకత యే
మున్నది ?

గు—ఉన్నది. గృహస్థులకును దేశపాలకులకును గొంచెము భేద
మున్నది. గృహస్థులరాబడి యింతయని స్థిరపడియుండును ; దానిఁబట్టి
వారు చేసికొనవలయుఖర్చులు నిర్ధారణముచేసికొందురు. ప్రభువులు దేశ
వ్యయములు దొలుత స్థిరపఱుచుకొని తరువాత వానికిఁ గావలయునాదా
యము పన్నులరూపమున సంగ్రహించుకొందురు.

శి—దానికిమాత్రము మితిలేదా ? ప్రభునిష్ఠమైయున్న యాయధి
కారము దుర్వినియోగముచేసినఁ, బ్రజలు బాధపడరా ?

గు—సత్యము పలికినావు. అదియే చెప్పఁబోవుచున్నమాట. చె
ల్లించుటకుఁ బ్రజలకుఁగల శక్తి ననుసరించి రాజు పన్నులు వేయుచుండవ
లెను. అన్నోదకములకుఁ జాలినయర్థము ప్రజలకుంచి హెచ్చుగానున్న
సొత్తునుండియే ప్రభువు పాలనవ్యయములకుఁ గావలయుసొమ్ము పన్నురూ
పమునఁ బుచ్చుకొనవలయును. విశిష్టభోగపదార్థములపై వేయుపన్నులు
ప్రజాపీడకములు గావు, సామాన్యభోగపదార్థములపై వేయునవియైనను
అంతబాధకములుగా నుండవు, కాని జీవనమున కత్యంతావశ్యకములగు
నన్నవస్త్రాదులపై వేయుపన్నులవలనఁ బ్రజలు మిక్కిలి క్షోభించి తిరుగఁ
బడుదురు. సత్త్వహీనులకు వస్తూత్పాదనశక్తి తగ్గిపోవును, అది దేశానర్థ
కరము.

శి—పోనీ ! అంతవఱకే ప్రభువులు పన్నులువేసి పాలనవ్యయ
ము తగ్గించుకొనరాదా ?

గు—అదియే సత్ప్రభువులు చేయుపని. ప్రజలనుండి పన్నురూప
ముగాఁ గొను ప్రతిపైసయును వారిక్షేమమునకైయే వినియోగపడవలె
ను. ప్రజాపదార్థోత్పాదనశక్తి హెచ్చుచేయుటకుఁ బతిపాలకు లెంతవ్య
యించినను అది యతిమాత్రముగాదు, దుర్వ్యయముగాదు.

శి—మనదేశములోఁ బన్నులనుండి వచ్చినధన మెట్లు వ్యయింపఁ బడుచున్నదో యిఁకఁ జెప్పుఁడు.

గు—ఇప్పటి కింతటితోఁ జాలించి అది యింకొకసారి విమర్శించు కొందము.

శి—అట్లైన సెలవుమఱి, నమస్కారము!

గు—శుభమస్తు!

---

# 11-4

శి—అయ్యా! నమస్కారము.

గు—సుఖీభవ! కూరుచుండుము. నేటిప్రసంగము పరిపాలనవ్యయములఁ గూర్చి జరుగనున్నది గావున అంకెలతోను వేరీజులతోనునుండి యది కొంచెము విసుగు గలిగింపక మానదు.

శి—స్వదేశముయొక్క యథార్థస్థితిఁ గనుఁగొనఁ గుతూహలపడువాఁ డామాత్రపువిసుగు భరింపఁగలఁడు లెండు. అదియుఁగాక యట్టికష్ట విషయములను స్పష్టీకరించుటకుఁ గావలయు శ్రమ మీరేపడి పఠితలబాధ తగ్గింతురని నే నెఱుఁగుదును.

గు—ఇవి నమస్కారబాణములుకాఁబోలు! కానిమ్ము ముందు ప్రసంగమునకుఁ బునాదిగాఁ గొన్నిమాటలు విషయగ్రహణసౌకర్యార్థము మొదటఁ జెప్పకొందము.

శి—చిత్తము.

గు—తగినయుద్యోగులనేర్పఱిచి భూమిపన్నులు మున్నగునవి వసూలుచేయుట, న్యాయస్థానములు నెలకొల్పి వివాదములు పరిష్కరించి దుష్టశిక్షణశిష్టరక్షణములుచేయుట, పోలీసు వారినిబెట్టి ప్రజల యర్థప్రాణములు కాపాడుట—ఇట్టి సర్వదేశసామాన్యవ్యవహారములు యుక్త

వ్యయములో నడపుట రాజ్యతంత్రములో నొకభాగము. ఇంగ్లిషులో దీనిని Civil administration అందురు.

పరులు దేశముపైఁబడి కొల్లమున్నగునుపద్రవములు గావించి రాజ్యమునకు నష్టముఁ గలిగింపకుండఁ గావలయుసైన్యమును తగినజీతము లిచ్చిపెట్టి రాష్ట్రరక్షణముచేయుట రెండవభాగము. దీని నింగ్లిషులో Military administration అందురు.

చెఱువులు కాలువలు త్రవ్వి, రెయిళ్లు మున్నగు గమనాగమనసౌకర్యములు కల్పించి, ఇంక నిట్టి యితరశాశ్వతోపకారకృత్యములుగావించి, తన్మూలమునఁ బ్రజాసౌఖ్యసంపదల నభివృద్ధిపఱచుట మూఁడవభాగము. వీనివలన దేశమునకుఁ దాత్కాలికలాభముకంటె భావిలాభ మెక్కువగాఁ గలుగవలెను. ఇట్టిపనులకుఁ జేయవలయువ్యయ మత్యధికముగానుండును. ముందువారికై వెచ్చించునంతధనమును క్రొత్తపన్నులువేసి యిప్పటివారి నుండి రాఁబట్టుట యధర్మమేకాక ప్రజాపీడాకరముగ నుండును. కనుకఁ బరిపాలకు లట్టిపనులకుఁ గావలయుధనమును ఈయఁగల స్వజనమునుండి కాని విత్తవంతులగు పరదేశీయులనుండికాని ఋణరూపముగాఁ బుచ్చుకొని దానిపై నుచితమైనవడ్డి చెల్లించుచుందురు. అందుచేతనే యీవ్యయభాగమునకు ఋణాపాకరణభాగము (Debt services) అనుపేరు వచ్చినది. ఇట్టియప్పులు సప్రయోజనములై దేశమునకు పూర్ణప్రతిఫలదాయకములై యుండవలెను. ఉండనిచో నవి దేశానర్థకరములగును. అట్టి ఋణము లతిమాత్రములు గాకుండ, మొదటిరెండుశాఖలకుఁ బట్టువ్యయమును దూరదృష్టిగల ప్రభువులు సాధ్యమైనంతవఱకుఁ గుదించుకొనుచుందురు.

ఈ మూఁడు తెఱఁగులవ్యయముల కగుమొత్తము పోఁగా దేశపుటాదాయమునుండి మిగిలిన నిలువసొమ్మెంతయధికముగానున్న దేశాభ్యుదయ మంతచక్కఁగా సాఁగును.

శి—ఎందుచేత ?

గు—దేశపురోభివృద్ధికిని ప్రజాపుష్టితుష్టులకును ప్రభువులు దాని నుపయోగింపవచ్చునుగనుక.

శి—సరియే, ఇఁక నా మూడుబాపతులక్రిందను మనదేశపు వచ్చుబడి యెట్లు వ్యయమగుచున్నదో సప్రమాణముగఁ జెప్పుఁడు.

గు—బేరీజులలోనికి వచ్చుచున్నాము. సావధానచిత్తుఁడవై వినుము. 1925-26 వ సంవత్సరమున మనదేశపుటాదాయ మెట్లువ్యయింపఁబడెనో పరిపాలకులుప్రకటించిన యీక్రిందిలెక్కల వలన గోచరించుచున్నది.

| | |
|---|---|
| I. మొదటిభాగమగు సామాన్యపరిపాలన వ్యయములనిమిత్తము :— | 39.2% |
| (విద్యావ్యాప్తికైన 7.6% ను, వైద్యకృత్యములకైన 2.28% ను, ప్రజారోగ్యరక్షణమునకైన 1 25% ను, ఇందుఁ గలిసియున్నవి.) | |
| II. రెండవభాగమగు సైన్యపోషణమునకు:— | 39.5% |
| (పోలీసుశాఖకగువ్యయము I లోఁజేరినది. అదియిందులేదు.) | |
| III. మూడవభాగమగు ఋణాపాకరణమునకు :— | 15.2% |
| IV. ఇతరప్రయోజనములకు:— | 6.1% |
| | 100.0 |

శి—అనఁగా ఆయములో 93.9% అప్పులకును, సేనలకును, సామాన్యపాలనకృత్యములకును, వినియుక్తమైనదన్నమాట; రాష్ట్రసత్త్వాభివృద్ధికై వినియోగించుటకు 6.1% మాత్రమే మిగిలినదన్నమాట.

గు—ఔనట్లే. విద్యారోగ్యాదిపోషణముకై వెచ్చించిన 11.13% మాత్రి మా 93.9% లో నిమిడియున్నది. ఇది పరపరిపాలనములోనున్న మనదేశపుస్థితి. ఇఁక స్వాతంత్ర్యసౌఖ్య మనుభవించుచు ఆయవ్యయములు తమయధీనతలో నుంచుకొన్న ప్రజలదేశమగు అమెరికాసంయుక్తరాష్ట్రములస్థితి యాసంవత్సరముననే యెట్లుండెనో పోల్చి చూచుకొందము.

శి—చూచుకొనవలసినదే. ఒకటి పరమదరిద్రదేశము, రెండవది లక్ష్మీదేవి యెప్పుడు తాండవమాడుచుండు మహాభాగ్యవంతమగు దేశము.

గు—I. సామాన్యపరిపాలన వ్యయములకు :— 7.8%
(విద్యాదులకై చేసినవ్యయము IV లోనున్నది. ఇందుఁజేరలేదు.)

II సైన్యపోషణమునకు :— 18.7%
(పోలీసుశాఖకైన వ్యయముకూడ నిందే యున్నది.)

III. ఋణములకు :— 22.3%

IV. ఇతరప్రయోజనములకు :— 51.2%

100.0

శి—అబ్బా! ఋణ, సేనా, పరిపాలన, వ్యయములకు శ్రీమంతు లగు నమెరికాసంయుక్తరాష్ట్రములవారు 48.8% ఖర్చుపెట్టినారు, మనము 93.9% ఖర్చుపెట్టినాము. ప్రజాపుష్టికరములగు పనులకు వారు 51.2% వినియోగపఱచినారు, మనము 6.1% మాత్రమే వినియోగపఱుచుకొన్నాము.

గు—51.2% లో విద్యాసంబంధవ్యయము కలిసియున్నదిగనుక నందుకై వారువ్యయముచేసినది 31.7% మాత్రమే యనిచెప్పవలయును.

శి—అయినను మనకంటె నైదురెట్లకుఁ బైగా వారు వెచ్చించు కొన్నారన్నమాట. విద్యావ్యాప్తికైనను మనవారు 7.6% వ్యయముచేసి నారు. వారు 19.5% వ్యయముచేసినారు.

గు—ఔను. ఆ స్వల్పవ్యయములోఁగూడ నొక యన్యాయము గలదని కుమారప్పగారు వ్రాసినారు.

శి—ఏమది ?

గు—హిందూదేశపరిపాలకులు, చదువునిమిత్తము, దేశీయులగు హైందవులబిడ్డల కొక్కొక్కనికి 4 అణాలచొప్పునను, దేశములోనుండు విదేశీయులగు యురపియనులబిడ్డల కొక్కొక్కనికి 25 రూపాయలచొప్పునను, ఖర్చుపెట్టుదురఁట.

శి—వారిదృష్టిని తెల్ల విదేశీయశిశువు నల్ల స్వదేశశిశువుకంటె నూఱురెట్లు విలువగలవాఁ డన్నమాట! ఇట్లు చెప్పుట కాధారమేమి?

గు—లజపతిరాయిగారు వ్రాసినగ్రంథము.

శి—ఇఁక సామాన్యపాలనకృత్యములకై అమెరికావారికంటె మన కంత యెక్కువఖర్చగుటకు హేతువేమి?

గు—కుమారప్పగారు హేతువులు వివరించి చెప్పినారు, విను.

పెరటిలోఁ బండినకూరకంటె బజాఱుకూర ప్రియమైనట్లు, ఎక్కడనోయుండు "గ్రేట్బ్రిటను" నుండి దిగుమతిచేసికొనిన యుద్యోగిబృందము దేశీయోద్యోగిబృందముకంటె నెక్కువ వ్యయాత్మకమగును. తెల్లవారితిండి, దుస్తులు, ఉనికి, భోగములు, మనవానికంటె నెన్నోమడుఁగు లధికవ్యయసాధ్యములు. పెద్దయుద్యోగములకు బ్రిటనువారినే తెత్తురుగాని మనవారిని నియోగింపరు.

శి—బ్రిటిష్వరిపాలనప్రారంభదశలో వారిభాష రాజ్యపద్ధతులు మనకు క్రొత్తవిగనుక, వారివారిని వారెంత లోకానుభవములేని యల్పవయస్కులైనను దెచ్చి యుద్యోగములలోఁబెట్టి పెద్దపెద్దజీతములిచ్చి యచిరకాలసేవాంతమున నమితపారితోషికములతో దేశమునకుఁ దిరుగ నంపుట క్షంతవ్యము గానచ్చునుగాని, రాజనీతిపారంగతులగు హైందవులు వేలకొలఁదిగానుండు నీకాలమునఁగూడ నట్లుచేయుట యన్యాయము కాదా? అల్పవ్యయముతోఁ బాలనకృత్యములు జరిగించుకొని, నిలువ సొమ్ముతో దేశధనోత్పాదనశక్తి హెచ్చుచేయరాదా?

గు—చేయవలసినదే, చేయకుండుట యధర్మమే, కాని నీయరణ్యరోదనములు వినువారెవరు? పొరుగింట మీఁగడపెరుఁగుజుఱ్ఱుకొనుట కలవాటుపడిన యదృష్టవంతుఁ డదివదలి నిజగృహమునకేగి నిస్సారభోజనము చేయుట కిచ్చగించుటయెట్లు? కథాప్రవాహమున కడ్డురాక శ్రద్ధతో విను.

శి—చిత్తము.

గు—1913 వ సంవత్సరమున నెలకు వేయిరూపాయలును అంత కంటె నెక్కువవేతనమునుగొను నుద్యోగస్థులలో నూటికి 96 గురు తెల్ల వారును మన నల్లవారు నలుగురును ఉండిరఁట. రాజ్యములో యురపియన్ ఉద్యోగి సగటుజీతము రూ. 933 లును హైందవోద్యోగి సగటుజీతము రూ. 371 లును అని కుమారప్పగారు వ్రాసినారు.

శి—పరిపాలనవ్యయము ప్రజావర్గములోని యొకమనుష్యుని సగటు రాబడి కిన్ని రెట్లకంటె మించఁగూడదు—అని యొకమితి యేర్పఱుచుకొనుట మంచిదని మూలసూత్రములలోఁ జెప్పినట్లు నాకు జ్ఞప్తిలో నున్నది.

గు—ఔను, అట్లే కుమారప్పగారు మొదటఁ జెప్పినారు. ఆ సూత్రి మిట నెట్లు వర్తించుచున్నదో చూచుకొందము. పన్ను చెల్లించు మనుష్యుని సంవత్సరపు సగటురాబడి 1911 వ సంవత్సరములో రూ 50 లు—అనఁగా నెల 1 కి రూ 4-2-8 అన్నమాట. అందుచేత యురపియన్ ఉద్యోగియొక్కసగటాదాయము దానికి దాదాపు 224 రెట్టున్నది, హైందవోద్యోగియొక్క సగటాదాయము 89 రెట్లకు కొంచెముపైగానున్నది.

శి—పన్ను చెల్లించుటకుఁగల ప్రజాసామర్థ్యమునుబట్టి చూచిన రెండును గడునధికముగ నున్నట్లే కాన్పించుచున్నవి.

గు—ఔను. అమెరికాసంయుక్తరాష్ట్రము లన్ని దేశములకంటెను ధనవత్తమములైనవి. అందులో న్యూయార్కు-మండలము తక్కిన యన్ని మండలములకంటెను ధనవత్తమమైన మండలము. దాని పెద్దపరిపాలనాధికారికి సంవత్సరమునకు 10 వేల డాలర్లు (అనఁగా రమారమి రూ. 26,666 లు)జీతమిత్తురు. అది యామండలప్రజలో నొక్కొక్కని సగటాదాయమునకు 14 రెట్లు. ఇఁక మన బొంబాయిగవర్నరుగారి వర్షవేతనము రూ. 120,000 లు; పన్ను చెల్లించువాని సగటురాబడికి అది 2,400 రెట్లు.

శి—పొట్టివాని ప్రక్క నిలఁబెట్టిచూచినపొడుగుమనుష్యునివలె, అమెరికాతోఁ బోల్చి చూచుకొను మన దేశపరిపాలనవ్యయము మఱియు విపరీతముగాఁ జూపట్టుచున్నది.

గు—1913 వ సంవత్సరముతర్వాతఁ గొన్ని పెద్దయుద్యోగము లు తత్పూర్వముకంటెఁ దఱచుగా మన హిందూదేశస్థుల కిచ్చుచున్న మాట నిజమే. దానివలన నల్పసంఖ్యులగు దేశీయులు బాగుపడుచున్నా రుగాని, అధికవేతనములవలన దేశప్రజకుఁ గలుగుచున్నపీడ యామట్టునసే యున్నది.

శి—అత్యున్నతస్థానము లింకను ఆంగ్లేయులచేతనే యధిష్ఠింపఁబ డుచున్నవి. ఎన్ని చీమతలకాయలుగలిసిన నొక యేనుఁగుతలకాయ కాఁ గలదు? వారు నిలువచేసికొను పెద్దమొత్తములును ఉద్యోగానంతరము బహుమానరూపముగా వారికొసఁగఁబడు గొప్పపెన్షనులును హైందవులి చ్చు పన్నులనుండియే సంగ్రహింపఁబడినవైనను, ఆయుద్యోగు లవియన్ని యుఁ బట్టుకొని స్వదేశమునకుఁబోయి యటఁ జక్కఁగా వ్యయించుకొని సుఖపడుచున్నారు. అవ్యయలాభమైనను మనదేశపువారికి దక్కక యన్య దేశీయులకుఁ బోవుచున్నది. ఇది కలవులో కసువుల్లన్న ట్లున్నది.

గు—సత్యమే వచించితివి.

శి—ఇఁక సేనావ్యయ ఋణవ్యయములనుగూర్చి సెలవిండు.

గు—ఆసంబంధమైన ఖర్చుమొత్తము వివిధదేశములలో 1922 వ సంవత్సరమున నెట్లుండెనో చూపుచు 'షా'పండితుఁడుగా నొకపట్టిక వ్రా సిపెట్టినారు. అది పరికించినయెడల నొకరు చెప్పనక్కఱలేకుండఁగనే, యీ రెండువిషయములందును మనదేశస్థితి యెట్లున్నదో స్పష్టముగా గోచరిం పఁగలదు.

1922-వ సం॥ సైన్యఋణ సంబంధవ్యయపుపట్టిక.

| దేశము | నూఱుపాళ్లవ్యయములో నెన్నిపాళ్లు? |
|---|---|
| ఇండియా | 63.8 |
| గ్రేట్ బ్రిటన్ అండ్ ఐర్లండు | 53.7 |
| ఆస్ట్రేలియా | 48.3 |

| | |
|---|---|
| కెనడా | 24.2 |
| దక్షిణాఫ్రికా | 5.2 |
| స్పెయిన్ | 17.6 |
| ఫ్రాన్సు | 20 |
| ఇటలీ | 17.3 |
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | 38.2 |
| జపాను | 49 |

శి—మీరు కష్టపడి చెప్పనక్కఱలేదు. అద్దములోవలె సత్యము స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. భాగ్యములోఁ గాకున్నను వ్యయములోనైనను మనదేశ మగ్రస్థాన మాక్రమించినది, సంతోషము. సేనను గూర్చి ప్రత్యేకముగా 'షా'పండితుఁ డేమైనఁ జెప్పినాఁడా?

గు—ఆ, యిట్లు చెప్పినాఁడు :—"హిందూదేశపుసేన యెంత వ్యయాత్మకమో అంత నిరుపయోగము. ఉన్నదని చెప్పఁ నుపయోగము కంటె దానికగు వెచ్చమెంతో హెచ్చుగానున్నది."

దీనిఁగూర్చియే ప్రస్తుతపుమంత్రిగారగు రాజ్జేమెగ్డానల్డుగారు చెప్పినమాటలు విను :—"ఈవిషయమున ఇండియాయెడల మనము న్యాయ్యముగాఁ బ్రవర్తింపలేదనుట నిస్సందేహము. ఇండియాలో నెలకొల్పినసేనలో విశేషభాగము (అర్ధభాగమని చెప్పుట కెంతమాత్రము సంశయింపఁబనిలేదు) కేవలహిందూదేశమునకుఁగానియితరప్రయోజనములకు—అనఁగా బ్రిటిషాజ్యప్రయోజనములకు—మనకుఁ గావలసియున్నది. కనుక దానికగువ్యయము బ్రిటిషాజ్యము భరింపవలెనుగాని, ఒక్కహిందూదేశము భరించుట ధర్మముగాదు."

శి—అప్పులనుగూర్చి చెప్పవలయుమాట లేమియులేవా?

గు—లేకేమి? అదియొక యగాధమైనగాథ:—ఇంగ్లండువర్తకులు కొందఱు సంఘీభవించి "ఈస్టిండియాకంపెనీ" యనుపేర హిందూ

దేశములోఁ దొలుత వర్తకవ్యాపారములకై ప్రవేశించి అప్పటి హైందవ ప్రభువుల నాశ్రయించి యచ్చటచ్చట నిమ్మైనయిరువులు సంపాదించుకొని తమ యదృష్టబలమునను దేశీయప్రభువులమైకమత్యాభావముచేఁ గలిగిన యంతఃకలహములవలనను చివరకు మనదేశమునకుఁ బ్రభువులైరన్నమాట నీకు జ్ఞప్తిలో నున్నదికదా!

శి—ఆ, ఉన్నది. విక్టోరియామహారాజ్ఞిగారి పరిపాలనలో నింగ్లండుప్రభువులే ఆ యిండియారాజ్యమును కంపెనీవారినుండి బదలాయించుకొని తాము పుచ్చుకొన్నారు. కాని కంపెనీపరిపాలనలో ఇండియానుండి ఆంగ్లప్రభువుల కేమియు లాభమే ముట్టలేదా?

గు—ముట్టకేమి? కంపెనీవారికి ఫర్మానాయిచ్చినది ఆంగ్లప్రభువులే. పార్లమెంటువారు పరిపాలనలోని న్యాయాన్యాయవిమర్శనమంతగాఁ జేసియుండలేదుగాని, కంపెనీవారెట్లు ఏలుబడిసాఁగించుకొన్నను తమ యాంగ్లరాష్ట్రకోశములో సాలునకు 4 లక్షల పౌండ్లచొప్పునఁ బడవేయుచుండవలెనని వారితో షరతుగావించుకొన్నారు. ఇది "హిందూప్రభువర్గ ప్రజావర్గమును దోఁచుకొనుటకు కంపెనీవారికిఁ గామచారానుజ్ఞయిచ్చుట" యని రాబర్టునైట్టుగారు తమపుస్తకములో వ్రాసినారు.

శి—సరియేకాని, రాజ్యపరివర్తనకాలమున అప్పాస్తులెట్లు పంచుకొనినారు?

గు—ఆస్తియంతయుఁ బాలనాప్రణేతల (Directors) కు సంక్రమింపఁజేసినారు. అప్పు మన హిందూదేశమున కంటఁగట్టినారు.

శి—అంతడబ్బు మనదేశమునుండి లాగుకొనినవారికి అప్పు లేలచేయవలసివచ్చెను?

గు—ఇండియా వశపఱుచుకొనుటకును, స్వప్రయోజనములకొఱకు చీనా, బర్మా, ఆఫ్ఘనిస్థాన్, పర్షియా, మానిల్లా, మున్నగు ఏషియా ఆఫ్రికాలలోని స్థలములందుఁగావించిన యుద్ధములకును, అప్పులు చేయ

వలసివచ్చినది. ఇవేమియు ఇండియాకు ప్రతిఫలరూపముగా లాభములు తెచ్చు ఋణములుగావు. 1858 వ సంవత్సరమున జరిగిన పెద్దపితూరీకైన 4 కోట్ల ఖర్చును ఆఋణములలోనే చేర్చినారు.

శి—అం దాశ్చర్యమేమున్నది? హైందవసేనలు తిరుగఁబడినవి గనుక, దానికిశిక్షగా ఆయప్పంతయు హిందూదేశముపై వేసినారు.

గు—నీ కాశ్చర్యములేదుగాని జగత్ప్రసిద్ధిఁగాంచిన జాన్ బ్రైట్టు గారికి మాత్ర మాశ్చర్యమే వేసినది.

శి—ఆయన యేమిచెప్పినారు ?

గు—"పితూరీకికారణము పార్లమెంటుయొక్కయు ఆంగ్లప్రజల యొక్కయు దుష్పరిపాలనమేకనుక ఆంగ్లదేశప్రజనుండియే పన్నులరూపముగా వసూలుచేసి యా 4 కోట్ల పౌండ్లఋణమును దీర్చుట న్యాయ్యము" అని.

ఇట్టి వ్యర్థఋణములమొత్తము 1874 సం॥లో 100కోట్లుండెనఁట. క్షామబాధానివారణార్థము ప్రతిసంవత్సర మీయఁబడి వేఱుగా నుంపఁబడవలయు 1 కోటి 50 లక్షలనుండియును, ప్రజలపన్నుల బరువుతగ్గించుట కుపయోగింపఁబడవలయు ఆయపుపెచ్చుమొత్తములనుండియును, ఏపాట్లోపడి చెల్లుపెట్టి, ఆయప్పులను 1915 వ సంవత్సరములో 30 లక్షల పౌండ్లుమాత్రమే యుండునట్లు చేసికొనినారఁట.

కాని; మొన్నజరిగిన ప్రపంచఘోరసంగ్రామములో—'షా' పండితుఁడుగారి గణనముప్రకారము ఇండియాకు 180 కోట్ల నష్టముగలిగిన కాలమందు—1917 వ సంవత్సరమున, మనదేశమునకు సంరక్షకులుగాను దాని యోగక్షేమములకుఁ బూఁటకాఁపులుగాను ఉన్నామని చెప్పుకొను మనపరిపాలకులు గ్రేటుబ్రిటన్ దేశమునకు 10 కోట్లపౌండ్లు దానముచేసినారఁట !

సాలుసాలునఁ జెల్లించు పెద్దపెద్ద వడ్డీమొత్తములుగాక, యీ నిరర్థకఋణములు నేఁడు 20 కోట్లకుఁ బైగా నున్నవఁట.

శి—అందుచేతనే కాఁబోలు—ఇంఁడియాకొఱకనిచేసిన పరదేశపు టప్పులు దుర్భరముగా నున్నవనియు, స్వాతంత్ర్యసంపాదనము తరువాత తత్పరిశీలనార్థము కూర్పఁబడు నిష్పక్షపాతసభవారు అన్యాయములని తీర్పుచెప్పఁబుణములు స్వతంత్రహిందూదేశము నిరాకరించివేయుననియు, అట్టిబుణములకు బాధ్యులయిన యింగ్లీషువారిదేశమే వానిని దీర్చుకొన వలసియుండుననియు—1929 వ సంవత్సరపు కాంగ్రెస్సులో భారతీయు లు నిశ్చయముచేసికొన్నారు.

గు—ఔను, చాలసేపయినది! నేఁటి ప్రసంగపర్యవసానము సంక్షేపముగాఁ జెప్పు, చూతము!

శి—చిత్తము. మొదటి మూడుబాపతులలోఁ జేరిన 93.9% వ్య యమును మన దేశసారమును బీల్చివేయుచున్నది కాని, దేశపుష్టికి విని యోగపడుటలేదు. అందు విశేషభాగము మనదేశములో వ్యయింపఁబ డక పరదేశములో వెచ్చింపఁబడి యచటివారి కుపయోగించుచున్నదిగాని, మన కుపయోగపడుటలేదు. ఈపరిపాలనపద్ధతి మాఱక యిట్లేసాఁగుచున్న చోఁ గొలఁదికాలములో భారతదేశము పరమదరిద్రదేశము గాకమానదు.

గు—శ్రద్ధతోనే వినినావు, సంతోషించినాను. ఇప్పటికింతటితోఁ జాలింతము.

శి—నమస్కారము! సెలవు!

గు—శుభమస్తు!

---

# II-5

( మామూలుమర్యాద లయినపిమ్మట )

శి—ఏవిషయముమీఁద నేఁడు ప్రసంగింపఁదలఁచుకొన్నారు?

గు—కుమారప్పగారు వ్రాసినదంతయు నగువఱకు విషయాంతర ములోఁ బ్రవేశించుటకు వీలులేదుగదా! పరిపాలకు లప్పులుచేసి చేయు

వ్యయములనుగూర్చి నేఁడు ముచ్చటించుకొందము. ఇంగ్లిషులో వానిని Capital Expenditure అందురు.

శి—అనఁగా ముఖ్యముగా రెయిలుబాటలనుగూర్చి మాటలా డుదురన్నమాట.

గు—ఔను. అవకాశముండునెడలఁ దరువాత పత్త్రినాణకపరి చారముఁగూర్చియు స్వర్ణరజతనాణకవినిమయమునుగూర్చియు నించుక చెప్పెదను.

శి—సరియే! అయోమార్గము లత్యంతసుఖదాయకములై యు న్నవి. పూర్వము వారాణసికేగుటయు వల్లకాటికేగుటయు నొక్కటియే యని చెప్పుకొనెడువారఁట. చోరభయాద్యపాయములు లేకుండ నిప్పుడు కాశీరామేశ్వరముల కిట్టెవెళ్లి యట్టెరావచ్చును. దేశములుకాని దేశముల నుండి కొలఁదికాలములో వింతవింతసరకులు వచ్చిపడి భోగానుకూలము లగుచున్నవి—అట్లు చూచుచున్నారేమి? ఆయురారోగ్యములు హ్రస్వ ములగుచున్నవనియు, సోమరితనము పెరుఁగుచున్నదనియు, భోగపదార్థ ములవాడుక యనావశ్యకముగా వృద్ధినొందుచున్నదనియు, కష్టసహనశక్తి సడలిపోవుచున్నదనియు, నింక నేమేమో యనర్థములు వచ్చుచున్నవని యు, మీమామూలుపాట పాడఁజూచుచున్నారుకాఁబోలు!

గు—నాయుపదేశభారము నీపైనే వైచుకొని నాశ్రమ తగ్గింపఁ దలఁచుకొన్నావుకాఁబోలు! అట్లేకానిమ్ము. నే నూరకుండెదను. నన్నుండి యేవో నాలుగుమాటలు వినఁగోరివచ్చి "దగ్గఱగఁ బిలిచి దాసరీ! నీ కన్నులొట్ట" యన్నట్లు చేయుచున్నావేమోయి?

శి—క్షమింపుఁడు. మీరు వెనుకఁజెప్పినమాట లింకను జ్ఞప్తిలో నేయున్నవని చూపుటకును మీరుచెప్పినట్లు శక్తివంచనలేకుండ మీశ్రమ తగ్గించుటకును అట్లంటినిగాని, మీకుఁ గోపము దెప్పించుటకుఁ గాదు. వచోమార్దవలోపముండిన నుండవచ్చును.

గు—దానికేమిలే! కొన్నినష్టములు నీవే పేర్కొంటివిగనుక వా నిని విడిచి యితరానర్థములఁగూర్చియే ముచ్చటించుకొందము.

అయోమార్గములు స్వతః మంచివేకావచ్చును. కాని యావశ్య కతనుబట్టి వానిని నిర్మించుకొనవలెను. వానిని భరించుటకుఁ గావలయు అర్థాభివృద్ధి దేశమునకు లేనప్పుడును, తగినప్రయోజనములులేనప్పుడును, అవి యుపకారకములగుటకు మాఱుగా నపకారకములు కాకమానవు. ఆఁకలిలేనప్పుడు తినుతిండివలెనే యావశ్యకతలేనప్పుడు వేసికొనురెయిల్లు ను అనర్థకారులగును. ఇండియా కిప్పుడు ముఖ్యముగాఁ గావలయునవి కృషికర్మానుకూలములగు నీటివసతులును, జనులను సరకులను సునాయా సముగా నొకగ్రామమునుండి యొకగ్రామమునకుఁ గొనిపోవుటకుఁ జాలిన చౌకబాటలును.

శి—కోపముమాత్రము రానీకుఁడు, మీకు మీరే ప్రమాణమా, పరిమాణాంతర మేమైన నున్నదా?

గు—నాది టపామోఁతయని మొట్టమొదటనే చెప్పితిని. కుమా రప్పగారి భావములే తెనుఁగున నీకుఁ జెప్పుచున్నాను. ఆయనమాటలు నిష్ప్రమాణములుగావు.

ప్రభుత్వమువారిలెక్కలనుబట్టి ౧౯౨౫-౨౬ వ సంవత్సరముచివర వఱకు సేద్యపునీటివసతులకు ఖర్చుపెట్టిన మొత్తము ౯౬ కోట్లనియు, రెయిలుబాటలకు వ్యయించినమొత్తము ౬౨౬ కోట్లనియు స్పష్టమగు చున్నది. ఇండియాలో నంతటను ౩౮,౫౦౯ మైళ్ల పొడుగుగల రెయిల్వే లున్నవఁట. ఏషియాలోని యేయితరదేశమునందును ఇంతదీర్ఘమైనయిను పబాటలు లేవఁట.

శి—తక్కిన యక్కఱలన్నిటిని ఉపేక్షించి, చిక్కిన ధనమంతయును ఈరెయిల్లమీఁదనే పెట్టి వెచ్చించుటకు హేతు వేమైయుండునో?

గు—మెగ్డానల్డుమంత్రిగారు వ్రాసిన యీక్రిందిమాటలనుబట్టి

హేతువు నీవే గ్రహించుకొనుము. "అప్పుచేసి తెచ్చిన మొత్తములనుండి ఖర్చుపెట్టి రెయిల్వేలుమున్నగునవి వేసినారు; అవి ఆయవ్యయగణనము చేసికొను అర్థాలోచనకార్యస్థానములందుఁగాక యుద్ధాలోచనకార్యస్థానములందు పరికల్పింపఁబడినవి; కనుక ఆయోధనవ్యయమును అయోమార్గపరిపోషణవ్యయవేషముతో మఱుఁగుపఱిచి మన కగపఱిచినారు."

శి—సేనల నొకచోటినుండి యొకచోటికి శీఘ్రకాలములోఁ గొనిపోవుట కనుకూలముగా ఈ రెయిళ్లు వేసినారన్నమాట. ఇతరస్వప్రయోజనము లేమైన నున్నవా?

గు—ఉండకేమి? రెయిళ్లకుఁగావలయు యంత్రములు పట్టాలు మున్నగు ననేకములైన యుక్కు సామానులు ఇంగ్లండునుండియే రావలెనుగనుక నచటికర్మాగారములలోఁ బనిచేయువారికిఁ జేయినిండఁబని, కడుపు నిండఁదిండి, యొడలునిండదుస్తులు; ఇండియానష్టి యింగ్లండునకు పుష్టి.

హిందూదేశములోపండు ముడిసరకులు ఈ రెయిళ్లమూలమున సులభముగా రేవుపట్టనములకుఁ దేవచ్చును; అట వాని నోడలలోని కెక్కించి యింగ్లండునకు రవానా చేయవచ్చును.

మఱియు నింగ్లండులో తయారై మనదేశమునకు దిగుమతియగు నసంఖ్యాకములగు సరకులు అమ్మకమునకై యీ రెయిలుబాటలమీఁద సులభముగా మనదేశములోని వివిధప్రదేశములకుఁ గొనిపోవచ్చును.

శి—మీరు నిష్పక్షపాతబుద్ధితో మాటాడవలెను. నానాప్రదేశములకు విదేశవస్తువులను గొనిపోవుట కుపయోగించు రెయిళ్లే మనదేశములోఁ జేయఁబడు సరకులనుగూడ నాయాతావులకుఁ గొనిపోవుట కుపయోగించుచుండుటలేదా?

గు—ఇంగ్లండువర్తకమునకుఁ బ్రోత్సాహముగలిగించుటకును, స్వదేశపువర్తకమును నిరుత్సాహపఱచుటకును, రెయిలుబాడిగ లేర్పఱుచుటయందుఁ జేసినయన్యాయమునకు మహాత్మాగారు మూడునాలుగునిదర్శనము లిచ్చినారు విను.

శి—ఏ పని ?

గు—బొంబాయిలో దిగుమతియైన విదేశపు అగ్గిపుల్లలపెట్టెలను అటనుండి రెయిలుపై ఢిల్లీకిఁ గొనిపోవుటకు నియమితమైన రెయిలుబాడిగయును మనదేశములో తయారైన అగ్గిపుల్లలసరకును అహమ్మదాబాదునుండి ఢిల్లీకిఁ గొనిపోవుట కీయవలయు మూల్యమును సమానములుగా నుండెడివఁట. అహమ్మదాబాదునకును ఢిల్లీకినిగలదూరము బొంబాయికిని ఢిల్లీకినిఉండు దూరముకంటె 300 మైళ్లు తక్కువ.

శి—అనఁగా సరకులు బొంబాయినుండి అహమ్మదాబాదువఱకును ఉచితముగాఁ దీసికొనివెళ్లి రెయిల్వేవారు విదేశవస్తుకారుల కుదారసహకారు లయ్యెడివారన్నమాట. ఆపాక్షికపుబాడిగ లింకను అట్లేయున్నవా?

గు—లేవు; ప్రజలు పదేం డ్లదేపనిగా పోరఁగాపోరఁగా చివరకు అధికారులు అహమ్మదాబాదునుండి ఢిల్లీకిఁ గొనిపోవుసరకులపై మణుఁగు ౧ కి రు ౨-౭-౧౧ చొప్పునను బొంబాయినుండి కొనిపోవువానిపై మణుఁగు ౧ కి రు 3-౭-౨ చొప్పునను తక్కువబాడిగలు విధించి పుచ్చుకొనమొదలుపెట్టినారఁట.

శి—రెండవనిదర్శనమేది ?

గు—ద్వితీయతృతీయనిదర్శనములు చక్కెరనుగూర్చియు బెల్లమునుగూర్చియు నీయఁబడినవి. బొంబాయికిని కాన్పూరునకును దూరము ౮౭౦ మైళ్లు; కాన్పూరునకును అకోలాకును దూరము ౬౮౯ మైళ్లు. ఎక్కువఖరీదుగలిగిన విదేశపుదిగుమతితెల్లచక్కెర బొంబాయినుండి కాన్పూరునకుఁ గొనిపోవుటకుచెల్లించుబాడిగ మ ౧ కి రూ ౦-౧౩-౬. చౌకస్వదేశపుతెల్లచక్కెర కాన్పూరునుండి అకోలాకుఁ గొనిపోవుటకుఁ జెల్లింపవలయు మూల్యము మ ౧ కి రూ ౧-౨-౮.

భోగపదార్థమగు తెల్లని పరదేశప్రపంచదార బొంబాయినుండి బార్సీకిఁ గొనిపోవుటకు మ ౧ కి ౬. అణాలచొప్పున రెయిలుబాడిగయూ

యవలెను. ఇఁక బీదవాండ్రకుపయోగపడు ముడిబెల్లము బార్సీనుండి
బొంబాయికిఁ గొనిపోవుటకు మ ౧ కి రూ ౦-౯-౯ చొప్పున బాడిగ చె
ల్లింపవలెను-అనఁగా ౧౪ రెట్లకంటె నధికమగుమూల్యము చెల్లింపవలె
నన్నమాట.

శి—మూడవయుదాహరణము ?

గు—అదియు వచ్చుచున్నది, ఓపికపట్టుము. అది స్వదేశవిదేశకా
ర్పాసవస్తునిర్మాతలఁగూర్చి యీయఁబడినది. ఢిల్లీలోఁ స్వదేశీయుల వస్త్ర
వయనయంత్రశాలయును కాన్పూరులో యురపియనులబట్టలమరయును
నున్నవి. చౌదనినుండి ౨౩౬ మైళ్లదూరముననున్న కాన్పూరునకు ముడిపత్తి
గొనిపోవుటకు రెయిలుబాడిగ మ ౧ కి ౫ అణాలు. అచ్చటినుండి ౧౨౮
మైళ్ల దూరముమాత్రమేయున్న ఢిల్లీకి బాడిగ మ ౧ కి రు ౦-౬-౭.

ఇట్లే పచ్చింశోల్లు గోదుమలు మున్నగు ముడిసరకులు రేవుస్థల
ములకుఁ గొనిపోవుటకు రేట్లుతక్కువ. అవియే దేశమధ్యమందున్న హైం
దవకర్మాగారములకుఁ గొనిపోవుటకు రేట్లు హెచ్చు. రెయిల్వేలు తమ
చేతిలోఁ పెట్టుకొని యీవిధముగా హిందూదేశపరిపాలకులు విదేశవస్తుని
ర్మాతలకుఁ దోడ్పడుచు స్వదేశవస్తునిర్మాతలకు నష్టముఁ గలిగించుచు
నున్నారు.

ఘోస్, వాచా, డిగ్బీ, హిండ్మన్—మున్నగు అర్థశాస్త్రజ్ఞులిట్టి
యభిప్రాయములనే యిచ్చుచున్నారు. వాని నన్నిటిని ఎత్తి యిట వ్రా
యుటకుఁ దావులేదు.

శి—పోనిండు ; మీమాట ప్రమాణముగానే గ్రహించెదను.
కాని శీఘ్రగమనాగమనసాధనము లగు రెయిళ్లవలన లాభములే లేవని చె
ప్పసాహసింతురా ?

గు—అదిగో ! మరల మొదటికే వచ్చుచున్నావు. ఏవో కొన్ని
కొలఁదిసౌఖ్యము లున్నవనిచెప్పి గోఁచిపాఁతరాయఁడు కోటీశ్వరుఁ డెత్తు

పరుగులెత్తఁదగునా ? మనదేశములో రెయిలుబాట లతిమాత్రములుగా నున్నవి. అర్థసమృద్ధి గలిగినపిమ్మట నెలకొల్పఁబడవలయు రెయిలుబాటలు తత్పూర్వమే నెలకొల్పఁబడినవి. ఆవశ్యకతలేని యర్థవ్యయ మనర్థకారి. ప్రభుత్వమువా రితరసత్ప్రయోజనముల కెన్నిటికో వినియోగింపవలయు పెద్దమొత్తములు ప్రతిసంవత్సరము ఈయయోమార్గరూపబ్రహ్మరాక్షసికి బలిగా నిడుచున్నారు. అదియుఁగాక వేసినరెయిల్లను సద్వినియోగము చేయుటలేదని పై నిదర్శనములఁబట్టి నీవే తెలిసికొనఁగలవు. మితమైన దేశాయమును అమితముగా రెయిల్లపై వెచ్చించి కృషీవలుల కుపయోగించు చెఱువులు కాలువలు నూతులు త్రవ్వించుట, చౌకబాటలు వేయించుట, ప్రజారోగ్యవర్ధనములగు సాధనములు కల్పించుట, మున్నగు నవశ్యకర్తవ్యములను పరిపాలకులు మానివేయుచున్నారు. ఇదంతయుఁ బ్రిమాదజన్యమనిచెప్పి వారు తప్పించుకొనఁజాలరు. ఎందుచేత ? ప్రజలవిచ్ఛిన్నముగా మొఱ్ఱలుపెట్టుకొనుచున్నప్పటికిని వారవి పెడచెవినిబెట్టి పట్టుదలతో అక్షేమకరమైన ఆపద్ధతినే అవలంబించి నడచుచున్నారు గనుక.

శి—ఆదితప్పే. ఈనష్టమంతయు భరించువారు తుదకు హిందూదేశప్రజలే గనుక, రెయిల్వేసంబంధమైన దేశఋణభారము నిర్లక్ష్యభావముతో నేఁటేఁట నిట్లు పెరుఁగనీయఁగూడదు. నేఁడువచ్చి రేపు మల్లెయు మూటయుఁ గట్టుకొనిపోవు నల్పసంఖ్యాకులగు నన్యదేశీయుల యర్థతృష్ణానివారణముకొఱకు, కోట్లకొలఁదిగానుండు నోరులేని హైందవదరిద్రప్రజావర్గమును బాధించుట ధర్మముగాదు.

గు—నిజమే. ఒకదేశభాగమునుండి యింకొకదేశభాగమున కతివేగముగా సరకులను గొనిపోవుట కనుకూలించు ఈయయోమార్గములే, దేశములోఁ బండినపంటలన్నియు దేశమునుండిలాగి పరదేశముల కంపుటకుపయోగపడుచున్నవి; ఒకపాలు లాభముచేయుచున్న, నూఱుపాళ్లు నష్టముఁ గలిగించుచున్నవి. తలఁచుగా మనదేశమున క్షామపీడలు గలుగుచుండుట కిదియొక ప్రధానకారణము.

బ్రిటిష్వణిక్సంఘముల ప్రార్థనలు విని ప్రభుత్వమువారు రేవుపట్టనములకుఁ బెద్దపెద్ద యయోమార్గములువేయుట యెక్కువచేయుచున్నారు గాని, చిన్న తేలిక రెయిల్వేలును కాలువలును వైచి దేశములోపలి గ్రామములకుఁ బరస్పరసంబంధము వృద్ధిచేయుసదుపాయములు గావించుటలేదు.

శి—ఔనుగాని, దేశములోఁ బండిన చోట్లనుండి యాహారపదార్థములను పండనికఱవుపరిదేశములకుఁ గొనిపోయి రెయిల్లు క్షామబాధానివారకము లగుటలేదా?

గు—అగుచున్నమాట వాస్తవమే. కేవలనిరుపయోగపదార్థమేదియుఁ బ్రపంచమున నుండఁజాలదు. మనుష్యులఁ జిటికెలోఁ జంపు గరళముకూడఁ గొన్నిరోగములకు సిద్ధౌషధముగా నుపయోగపడుచున్నది. రోగములు దెచ్చి చికిత్సచేయుట మంచిదా? ఆరోగములు రాకుండఁజూచి యారోగ్యరక్షణము చేయుటమంచిదా?

శి—ఆరోగ్యరక్షణమే మంచిది.

గు—ఔనుగద! క్షామబాధకలిగినపిమ్మట దానిని తగ్గింపఁబ్రయత్నించుటకంటె పంటల నెక్కువచేయునీటివసతులుకల్పించి, రైతుచెల్లింపవలయు పన్నులుతగ్గించి, గ్రాసమునకుఁగావలయు ధాన్యాదులుపోఁగా కష్టదినముల కక్కఱకువచ్చుటకుఁ గొంతసామగ్రి నిలువచేసికొను సదుపాయము లతనికిఁ గావించి, పరిపాలకులు క్షామబాధలు రాకుండఁజేయుటకే యేల ప్రయత్నింపఁగూడదు? పరదేశవణిక్ప్రతినిధులగు జట్టీకాండ్రు, పంట యింకను పొలముమీఁదనుండఁగనే, చౌకగా బేరముకుదుర్చుకొని, అర్థాతురుఁడగు రైతుచేతిలో నేదోకొంత పైకముపెట్టి, పైరంతయు నీ రైళ్లమీఁదఁ బరదేశములకుఁ బంపుదురు. చాలునాహారపదార్థము దేశములో లేమిచే ధాన్యాదులవెలలు అపరిమితముగా లేచి కఱవులు గావించును. పుష్కలముగాఁ బండు భూములుండియుఁ దెచ్చిపెట్టుకొను

దారిద్ర్యముచే బాధపడుదేశ మీప్రపంచములో నొక్క మనదేశమే కాన్పించుచున్నది.

శి—కనుక నేమిచేయుమనెదరు ?

గు—ఏమిచేయవలయునా ? యుద్ధప్రయోజనముల మనస్సులోఁ బెట్టుకొని వృథాగా అమితధనము రైళ్లువేయుటకై పరిపాలకులు వినియోగింపఁగూడదు. ఇట్లే యనావశ్యకముగాఁ గ్రొత్తఢిల్లీవంటి రాజధానులు నిర్మించుటకు లక్షలకోలఁది ధనము వ్యయింపఁగూడదు. "వసూలుచేయు ౮౦౦ కోట్లపన్ను మొత్తములోను దాదాపుగా ౨౦౦ కోట్లు హిందూదేశమున కేమాత్రము నుపయోగింపని వ్యర్థప్రయోజనములకు వెచ్చింపఁబడుచున్నవి" అని 'షా' పండితుఁడు వ్రాసినాఁడు. పెక్కుమాటలేల ? ౫౦౦౦ మైళ్లదూరమందున్న చిన్నద్వీపములో మహాధనవంతులైయుండు నల్పసంఖ్యాకులగు తమవారిసుఖముకై హిందూదేశములోఁ బరమదరిద్రులై పడియుండు బహుసంఖ్యాకులగుప్రజల బాధపెట్టకుండ ఆంగ్లప్రభువులు ధర్మదృష్టితోఁ బాలనకృత్యములు నెఱపుకొనవలెను.

శి—ఏవో కాగితపునోట్లనుగుఱించియు కాసురూపాయనాణెములమాఱకమునుగూర్చియుఁ గొంచెము చెప్పెదనంటిరి. ఇవియైనను మనకు లాభకారులుగా నున్నవా నష్టకరములుగా నున్నవా ?

గు—నష్టకారులుగానే యున్నవని రాజ్యతంత్రజ్ఞుల యభిప్రాయము. విషయము దుర్బోధమగు చిక్కువిషయము. నే నప్రమత్తుఁడనై వినిపింపవలెను, నీ వశ్రద్ధలేకుండ వినవలెను.

శి—చిత్తము.

గు—వ్యవహారసౌకర్యార్థము, ప్రతిదేశములోను సాటాబేరముతో వస్తువినిమయము చేసికొనుటమాని ప్రజ లిప్పుడు నాణెములతోఁ గ్రియవిక్రయములు గావించుకొనుచున్నారు. అవి ప్రధాననాణకములనియుఁ జిల్లరనాణెములనియు రెండువిధములుగా నుండును. ఇంగ్లండు

మున్నగునాగరకదేశములలో బంగారునాణెములు ప్రధాననాణకములుగాను వెండిరాగినాణెము లుపనాణకములుగాను నుండును. పూర్వకాలమున మనదేశమందుఁగూడ రెండురకములనాణెములును ప్రచారములో నుండెడివి. ఇప్పుడు వెండిరూపాయ అసలునాణెమైనది; నికెల్ మొదలగు నల్పలోహములతోఁ జేయు పావులా బేడ మున్నగునాణెములు చిల్లరనాణెము లైనవి. వెనుక మనదేశములో నుండెడిటంకసాల యిప్పుడు తీసివేయఁబడినది.

శి—ఉపనాణకములు కూడ వెండితో నేల చేయఁగూడదు?

గు—అల్పమూల్యములగు అణామున్నగునాణెములు వెండితోఁ జేసినఁ గడుఁ జిన్నవియై వాడుక కననుకూలములుగా నుండును. పెద్దమొత్తములు చిల్లరనాణెములతోఁ జెల్లింతుమన్న నాకక్కఱలేదు రూపాయలిచ్చినఁగాని పుచ్చుకొనను అని మనము తిరుగఁగొట్టవచ్చును—అది శాసనదృష్టిని తప్పుగాదు.

రూపాయలుగా మిక్కిలి పెద్దమొత్తము లొకచోటనుండి యొకచోటికిఁ గొనిపోవుట కష్టముగను అపాయకరముగను నుండును గనుకఁ, బ్రభుత్వమువారు వ్యాపారసౌకర్యార్థము రూ. ౫ లు మొదలు ౧౦ వేల రూపాయలవఱకు కిమ్మతుగల కృత్రిమపు కాగితపునోట్లు కల్పించి చలామణీ చేయించుచున్నారు.

శి—ఈగొడవయంతయు మన ప్రస్తుతవిషయమున కెట్లు సంబంధింపఁగలదు?

గు—చివరవఱకుఁ జెప్పనిచ్చిన సంబంధ మగపడును.

శి—కానిండు, ముసలివారు ముంగోపులు.

గు—వెనుక కాసు రూ ౧౫ ల చొప్పున మాఱుచుండెడిది, జ్ఞప్తిలో నున్నదా?

శి—ఆ! అప్పుడు వెండి చౌకకాఁబోలు. యుద్ధానంతరము వెండి

ప్రియమూటచేతను మఱికొన్నికారణములచేతను కాసుధర తగ్గినది. పూర్వము ౧౧$\frac{}{3}$ షిల్లింగులకు సమానమగు మనరూపాయ కిప్పుడు ౧౪ షిల్లింగులకిమ్మతు వచ్చినదఁట. మన ప్రధాననాణకమువెల హెచ్చుగుట మనకు లాభమేకాదా?

గు—నేను శ్రమపడకుండ నీవే కథలోనికి దింపినావు మంచిదే, జాగ్రత్తతో విను మఱి.

శి—చిత్తము.

గు—ప్రతిదేశముయొక్క భాగ్యోన్నతియును దానియెగుమతి దిగుమతివ్యాపారములనుబట్టి యుండును. ఇంగ్లండు మున్నగుదేశములలో ప్రధాననాణకము బంగారునాణెమనుమాట మఱచిపోకుము. వారు కొను సరకులవిలువ చెల్లించుటకు వారు మనకుఁ బంపు హుండీలు కాసులలో నుండును. వారినుండి మనముకొను దిగుమతిసరకులవిలువయును వారికి కాసులరూపముననే మనము చెల్లింపవలసియున్నది. పూర్వపు పదియేను రూపాయల కాసిప్పుడు రూ ౧౦ లయినదనుకొందము. ఇఁక నీకుఁ గొన్ని ప్రశ్నలు వేసెదను, నిదానించి జవాబు చెప్పుము.

శి—ఈప్రశ్నోత్తరోపనిషత్తు న న్నెచటికిఁ గొనిపోనున్నదో తెలియకున్నది.

గు—గమ్యస్థానముగు సత్యమునకే! భయపడకు! ౧ పౌండు వెలగల ముకిసరకు నీ వెగుమతిచేసినావనుకొనుము. దానికి వెనుక నీకెంత వచ్చెడిది? ఇపు డెంత వచ్చుచున్నది?

శి—వెనుక రూ ౧౫ లు, ఇప్పుడు రూ ౧౦ లు.

గు—వెనుకటి రూ ౧౫ లు నీకు వచ్చుట కిప్పుడు నీవు వెనుకటి యంతసరకును, అదనముగా నందులో సగముసరకును, బంపవలెనాలేదా? అది నష్టమా? లాభమా?

శి—ఔను, నష్టమే.

గు—ఒకపౌండు వెలగల మల్లుతాను నీ విఁగ్లండునుండి దిగుమతి చేయించి తెచ్చికొనినావనుకొనుము.

శి—మఱిప్పుడో! వెనుకటి పదియేనురూపాయలతాను ౧౦ రూపాయలకే వచ్చుచున్నది. ఇది నష్టమా? లాభమా?

గు—చంకలు గొట్టుకొనక శాంతముగా వినుము. కొన్ననీకు లాభమును, స్వదేశపువర్తకునకు నష్టమును.

శి—ఎందుచేత?

గు—మన దేశమునందలి వయనయంత్రశాలలో నేసి పూర్వము ఇంగ్లండుతానుతోపాటు రూ ౧౫ లకమ్ము స్వదేశపువర్తకుఁ డిప్పుడు దానివెల ౧౦ రూపాయలకు దింపినఁగాని దివాలాదీయును. విదేశపుతానునకు పోటిగాఁ దానిప్పుడు ౧౪ తానో అంతకెక్కువయో యిచ్చినఁగాని తనసరకెవరును గొనరు. ఇది దేశక్షేమమా? దేశారిష్టమా?

శి—దేశారిష్టమే యనకలీఁబడు. విదేశపువర్తకునకుమాత్రమేమియు నష్టములేదు—వెనుకవచ్చెడు ౧ పౌండు ఇప్పుడును అతనికి వచ్చుచున్నది. సరియేకాని, పెద్దపెద్దజీతములు గొనుచుఁ బనిచేసి యుద్యోగానంతరమున సీమకువెళ్లు తెల్లవారికిచ్చు పెన్షనులలో లాభములేదా? ౧ పౌండు పెన్షనుకై పూర్వము రూ ౧౫ లు పంపవలసియుండఁగా నిప్పుడు రూ ౧౦ లు పంపినఁ జాలుచున్నదిగదా!

గు—మహామేధావులగు మనప్రభువు లట్టినష్టమును గూడఁ దీయుటకే, యున్నతోద్యోగులగు యురపియనుల జీతము లిప్పు డెక్కువచేసినారు. అన్యాయమని ప్రజలు ఘోషింతురనికాఁబోలు, వారితోపాటు మనవారికిఁ గొందఱకుఁగూడ వేతనాభివృద్ధిఁ గావించినారు. ఇఁకొకమాట చెప్పి నేఁటిప్రసంగ మింతటితోఁ గట్టిపెట్టుదము.

శి—అది యేది?

గు—లోపల ౧౦ అణాల వెండిమాత్రమే కల రూపాయ దేశము

లో ౧౬ అణాలకు చలామణియగుచుండుటచేత గవర్నమెంటునకు రూ ౧ కి ౬ అణాల లాభము వచ్చుచున్నదిగదా! ఏఁటేఁటవచ్చు నీలాభమంతయును వినిమయనష్టపూరణముకొఱకును, "గోల్డెక్స్ఛేంజి స్టాండర్డురిజర్వు—Gold Exchange Standard Reserve" అనుపేర నొకనిధి యింగ్లండులోఁ బెట్టినారు. మఱియు, ముద్రింపఁబడిన నోట్లన్నియును మాఱునో మాఱవో యనుదూరదృష్టితో వానికి సమానమైనకిమ్మతుగల స్వర్ణరూపధనము "పేపర్కఱెన్సీరిజర్వు—Paper Currency Reserve" అనుపేర మఱియొకనిధిగా నింగ్లండులోనే పెట్టినారు. అది నాలుగుకోట్లును ఇది రెండుకోట్లును ఉన్నదఁట. ఈనిధులు స్వదేశములో నుండక పరదేశముల కేగుటచే నింటికి జ్యేష్ఠాదేవులును బొరుగింటికి లక్ష్మీదేవులును అయి యిదివఱకే ధనవంతులుగానుండు విదేశపుకోతీదారులను ధనవత్తరులఁ జేయుచున్నవని అర్థశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

శి—పైయనర్థము లెట్లుపోఁగలవు?

గు—రూపాయలోని వస్తుక్రియశక్తి స్థిరముగానుండు నేర్పాటులు చేయవలెనుగాని విదేశవణిజులక్షేమముకై పొందునుబట్టి దానివెల తఱచుగా మార్చుచుండఁగూడదు. ఇండియాలోఁగూడ బంగారునాణెమును ప్రధాననాణకముగాఁజేసి దేశములో మరల టంకసాల నెలకొల్పవలెను. మాఱకపుటేర్పాటులును ఆయవ్యయనిర్ణయమును ప్రజలచేతులలోనికి రావలెను.

శి—నమస్కారము! సెలవు.

గు—సుఖీభవ!

---

# II-6

(వందనాశీర్వాదముల పిమ్మట)

శి—నేఁడు మన ప్రసంగవిషయము లేవి ?

గు—ప్రభుత్వమువారికి వచ్చుఆదాయము, ఆయమూలములు.

శి—మనదేశము విశేషముగాఁ గృషివృత్తి నాధారముచేసికొని బ్రతుకుబీదదేశము.

గు—అందుచేతనే పన్నులుగొనుటలో పాలకులు బహుజాగరూకులై యుండవలయును. ఎట్లుండవలయునో కుమారప్పగారు మూలసూత్రములలో విస్పష్టముగాఁ జెప్పినారు, అవి జ్ఞప్తిలో నున్నవా ?

శి—సింహావలోకనము చేసికొని చెప్పుమనెదరా ? లోపములు మీరు పూర్తిచేయునెడల నట్లే చెప్పెదను.

గు—మంచిది.

శి—రా జెల్లప్రజావర్గమునుండియుఁ బన్నులు గొనవలసియున్నప్పటికిని వానియొత్తుడు పేదవారిపైఁ బడనీయక అందలి విశేషభాగము భాగ్యవంతులనుండి గ్రహించి బీదలఁ గాచుచుండవలయును.

పరోక్షకరద్వారమున ఇండియావంటిదేశములో శుల్కము లధికముగా గ్రహింపవలెను. ఆపన్నులు దరిద్రప్రజల యాహారపదార్థముల మీఁద వేయఁగూడదు, సామాన్యప్రజావర్గ ముపయోగించు వస్తువుల పైఁ దేలికగా వేయవలయును, ధనపుష్టిగలవారుపయోగించు భోగపదార్థములపై నెక్కువగా వేయవచ్చును. గత్యంతరములేనప్పుడు దక్కఁ గేవలజీవనాధారములగు పదార్థములపైఁ బన్నులెప్పుడును విధింపఁగూడదు.

అనావశ్యకములును హానికరములును అగు భోగపదార్థములపై గఠినమైనశుల్కములువేసి ప్రజలు వాని నుపయోగించుకొనుటను సాధ్యమైనంతవఱకరికట్టుచుండవలెనుగాని ఆదాయ మధికమగుచున్నదిగదా యని వానిదిగుమతిని పెరుఁగనీయఁగూడదు.

ప్రజాపుష్టికిని తుష్టికిని పదార్థోత్పాదనకృత్యములకును గావలయు ద్రవ్యము వారియొద్దనుంచి యతిరిక్తముగానుండుదానిపైనే పన్నులు వేయుచుండవలెను. శుల్కగ్రహణపద్ధతులును వాయిదాలును ప్రజలకుఁ గష్టకరములు గాకుండ ననుకూలములుగా నుండవలెను.

గు—విఘ్నేశ్వరపూజ నీవు చేయించితివిగాన మిగిలినతంతు నేను నడపెదను. 1925-26 వ సంవత్సరపుటాయపులెక్కలనుబట్టి నీవిధినిషేధ సూత్రములు హిందూదేశపరిపాలనలో నెంతవఱ కవలంబింపఁబడుచున్న వో చూతము.

శి—చిత్తము.

గు—ఈక్రిందిపట్టిక ఆసంవత్సరమువచ్చిన ఆదాయపుమొత్తమును, ముఖ్యమైనబాపతులును, కొన్నిబాపతుల యాదాయమును వసూలు చేయుట కైనవ్యయమును జూపుచున్నది.

| బాపతు. | వసూలువ్యయము. | నికరపుటాదాయము (లక్షలలో) | |
|---|---|---|---|
| దిగుమతిఎగుమతిపన్నులు | 1.7% | 4696 | పైచిల్లర |
| రాబడిపన్ను | 3.6% | 1553 | ,, |
| ఉప్పు | 19.7% | 507 | ,, |
| నల్లమందు | 50.8% | 203 | ,, |
| భూమిపన్ను | 11.6% | 3143 | ,, |
| కల్లు గంజాయి మున్నగుమాదక ద్రవ్యములు | | 1729 | ,, |
| స్టాంపులు | | 1328 | ,, |
| అడవులు | | 260 | ,, |
| రెజిస్ట్రేషన్ | | 78 | ,, |
| రెయిల్వేలు | | 551 | ,, |

| | | |
|---|---|---|
| కాలువలుమున్నగు నీటివసతులు | 239 | ,, |
| పోస్టు అండ్ టెలిగ్రాఫ్ | 35 | ,, |
| వడ్డి | 656 | ,, |
| నాణెములు, టంకసాల | 393 | ,, |
| విశేషాయమూలములు | 192 | ,, |
| ఇతరములు | 119 | ,, |
| సంవత్సరాయపు మొత్తము | 15,688 లక్షలపైచిల్లర. | |

ఎగుమతిదిగుమతిసరకులపై వేసిన సుంకములవలన వచ్చురాబడి తొలుత విమర్శించిచూచుకొందము. కావలయునప్పీస్లు స్పష్టముగా నీయఁబడలేదుగాన స్థూలవిమర్శనమునకేకాని సూక్ష్మవిమర్శనమున కవకాశము లేదు. అయినను సత్యమునుగనుఁగొనుటకు మనకు స్థూలవిమర్శనము చాలును.

శి—రాబడిపద్దులలో నదియే పెద్దపద్దుగాఁ గాన్పించుచున్నది.

గు—పైచూపులవలన బుద్ధిని భ్రమాయత్తముఁజేయఁగూడదు. చెప్పినమాటలన్నియువిని చివర నీయభిప్రాయమును స్థిరపఱుచుకొనుము.

వచ్చిన 4696 లక్షలలోను, ఎగుమతిపన్నులును పెట్రోలుమీఁది పన్నును బీదల నట్టేబాధింపనిసైకిళ్లు మోటరుకార్లు యంత్రములు సారాయిమున్నగువానిపై వేసిన దిగుమతిపన్నులును ఉన్నవి; వాని మొత్తము 2293 లక్షలు; అవిపోఁగా శేషించిన దిగుమతిపన్నులు 2403 లక్షలు.

శి—అట్లుచూచినను భూమిపన్ను తరువాత నదియేపెద్దకత్తము.

గు—ఎచ్చుతగ్గు లితరమైన మనదేశపుపద్దులతోఁ బోల్చిచూచుకొనికాదు నిర్ణయింపవలసినది; ఇతరదేశముల కాబాపతురాబడి యెంత వచ్చుచున్నదో పరికించి దానిఁబట్టి నిర్ధారణచేసికొనవలెను.

శి—అట్లేచేయరాదా ?

గు—అట్లైన బ్రిటన్దేశమునుండి ౧౯౨౮ సం॥లో వివిధదేశముల

కెగుమతియైన సరకులపైని ఆయాదేశములవారు వేసిన టారిఫుల (సుంక ముల) తారతమ్యమునుజూపు నంకెలతో నొకపట్టీ బ్రిటిషువాణిజ్యసంఘ మువారే తయారుచేసి ప్రకటించినారు, చూడుము—

| దేశము | టారిఫ్ | దేశము | టారిఫ్ |
|---|---|---|---|
| రష్యా | 131 | కెనడా | 17 |
| స్పెయిన్ | 76 | జపాన్ | 9 |
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | 73 | టర్కీ | 8 |
| పోర్చుగల్ | 71 | దక్షిణాఫ్రికా | 6 |
| ఆస్ట్రియాహంగెరీ | 35 | చీనా | 5 |
| ఫ్రాన్సు | 34 | హాలెండు | 3 |
| ఇటలీ | 27 | బ్రిటిషిండియా | 3 |
| జర్మనీ | 25 | | |

మనదిగుమతిపన్నుపద్దు ఎక్కువయో తక్కువయో యిప్పుడు చెప్పుము.

శి—తక్కువయేయని చెప్పకతప్పదు. రష్యావారువేయు టారిఫ్ మనదానికంటె దాదాపుగా 44 రెట్లున్నది. అన్నిటిలోను మనదేశ మడు గుననున్నది. హాలండువారుమాత్రము మనకుఁ దోడుగానున్నారు.

గు—మన యిండియా సేద్యమునే జీవనమునకు ముఖ్యాధార ముగాఁ జేసికొన్న దేశముగనుక దిగుమతిసరకులమీఁద వేయుశుల్కము లధికముగా నుండవలసినది. నవ్యవస్తూత్పాదనసామర్థ్యమును కర్మాగార ములును ఇంకను శైశవావస్థలోనేయున్న మనదేశపు వర్తకవ్యాపారము కఠినమైన దిగుమతిపన్నులచే సంరక్షింపఁబడవలెను. యథేష్టవిదేశవణి గ్వ్యాపారపద్ధతి పరిపాలకు లవలంబించుట దేశానర్థకరము.

శి—పరదేశములును బ్రిటిష్సామ్రాజ్యములోనేచేరిన యితరదే శములునుగూడ విదేశవస్తుసామగ్రిపై దిగుమతిపన్ను లంతహెచ్చుగా వే యుచుండఁగా మన హిందూదేశపరిపాలకులు న్యూనశుల్కములు విధిం చుటకు హేతు వేమైయుండును?

గు_మన దేశమునకు వచ్చు విదేశవస్తుజాతములో విశేషభాగము పాలకుల స్వదేశమగు గ్రేట్బ్రిటన్ ద్వీపమునుండియే వచ్చుచున్నదిగనుక! ఎవరివారిని వారు బాగుచేసికొనఁ బ్రయత్నించుట స్వాభావికముగనుక!

శి—ఎగుమతిపన్ను లెక్కువచేసినచో దేవుఁడిచ్చిన యాహారపదార్థములు దేశములో నిలిచియుండి వెలలుతగ్గి ప్రజల కఱవుబాధ కొంతవఱకుఁ బోఁగొట్టునుగదా!

గు—ఆపనిమాత్ర మెట్లుజరుగఁగలదు? నేలబొగ్గుతోను ఇనుముతోను ఆఁకలి తీఱదుగదా! మన ముడిసరకులు—ముఖ్యముగా గోదుమలు—ఇతరదేశములకంటె విశేషముగా గ్రేట్బ్రిటన్నకే రవానాయగుచున్నవి. పరిపాలితులకు క్షామబాధరాకుండఁ బరిపాలకదేశప్రజ క్షుద్బాధ యెట్లు పోఁగలదు చెప్పవాఁడవుగాని?

స్వేచ్ఛావాణిజ్యవ్యాపారవిధాన మవలంబించి రాజ్యతంత్రము సాఁగించుచున్నంతవఱకుఁ దెల్లవారగు విదేశపువర్తకులకును విదేశవస్తువులను విరివిగా నుపయోగించు నల్పసంఖ్యాకులగు ధనవద్భారతీయప్రజకును లాభముచేయుచు నెగుమతిదిగుమతిసుంకములు తగ్గింపక తప్పదు; రాబడిలోని యాలోటుకూడఁదీసికొనుటకు భూములమీఁదను ఉప్పు మున్నగు జీవనాధారపదార్థములమీఁదను వేయుపన్నులు హెచ్చించి ప్రజల బాధింపక తప్పదు.

శి—పరిపాలకులుగా నెవరుందురో తుదకు రాజ్యలాభమంతయు వారికే కలుగునన్నమాట! బ్రిటిష్వారు మనదేశమునకుఁ బ్రభువులైనారు గావునఁ దత్పాలనలాభములన్నియు వారికిని వారిదేశమువారికిని బ్రాప్తింపక మానవన్నమాట!

గు—అవును. "మిల్లు" గారుచెప్పినమాటలే నీవును జెప్పినావు. "ఆత్మవత్సర్వభూతాని" అనువచనము లాధ్యాత్మికశాస్త్రములోనివిగాని అర్థశాస్త్రములోనివి గావు. "సి న్నితరు లెట్లు చూడవలెనని నీకుందునో

నీ వితరుల నట్లుచూడుము'' అని బైబిల్‌లోని యుపదేశవాక్యము భాను వాసరములందుఁ బాశ్చాత్యనాగారములలో నిచ్చు ధర్మోపన్యాసముల కుప యోగపడునుగాని పరదేశపాలనక్రియాకలాపమునం దవలంబించిపోవుట కనువుపడదు.

"ఇది దివ్యమైన దొడ్డదేశము, కాని అయ్యో! స్వదేశస్థు లం దుండిపోయిరే! అని నాకుఁ బట్టరానిదుఃఖము వచ్చుచున్నది!'' అని యొకఁడు వంగదేశపు గవర్నరుగారితో నన్నాఁడఁట!

శి—ప్రమాణమేమి?

గు—"హాలండు'' గారు తమగ్రంథములో వ్రాసినారు.

శి—అట్లన్న మహానుభావుఁ డెవఁడు?

గు—మనదేశముతో గోఁగునారవర్తకము చేయుచుండిన 'డండీ' పట్టనవాస్తవ్యుఁడగు నొక వర్తకుఁడు.

శి—వస్తునిర్మాణపాటవమునందును వాణిజ్యనైపుణ్యమునందు ను అర్థబలమునందును సమానులై యుండువారి దేశములకు విశ్శృంఖలము గా విదేశవణిగ్వ్యాపారములు సాఁగనిచ్చుపద్ధతి అనుకూలించునుగాని ప్రజలు విత్తహీనులై వ్యవహారజ్ఞానశూన్యులై యుండు మనదేశమునకు హానికరమగును. అందులో ఆయవ్యయనిర్ణయాధికారము పరులచేతుల లో నున్నప్పుడు మఱియు ననర్థకారియగును.

గు—నీవన్నమాట సత్యము. హిందూదేశమునకుఁ బ్రస్తుతావస్థ లో శ్రేయస్కరమైనది శాసననిరుద్ధమై నియతమై స్వదేశవర్తకమున కబాధకమై యుండు విదేశవాణిజ్యము.

శి—ఇఁకను పట్టీలో రెండవపద్దుగానుండు వచ్చుబడిపన్నునుగూ ర్చి ముచ్చటించుకొందము.

గు—పన్ను లన్నిటిలోను ఇది బహు పర్జాత్రుప్తికరమైన పన్ను గాఁ బరిగణింపఁబడుచున్నది.

శి—ఈరూపముగానైన రావలసినపన్నంతయు వచ్చుచున్నదా ?

గు—ఇండియాచేసిన ఋణములపైఁ జెల్లింపవలయు పెద్దవడ్డిమొత్తములు ప్రభుత్వమువారు ఇంగ్లండులోఁ జెల్లించుచున్నారు. వానిమీఁదఁ బరదేశఋణపరిదాతలనుండి వసూలుచేయవలయు రాబడిపన్ను ఇండియాకు ముట్టుటలేదు. ముట్టినచో సాలునకు రెండుకోట్లరూపాయలు హిందూదేశకోశములో బడుచుండునని 'షా'గారు లెక్కించి చెప్పినారు.

శి—ఇట్టిపద్దులు మఱేమైన నున్నవా ?

గు—గొప్పగొప్ప భూస్వాములనుండి భూమిపన్నులు పుచ్చుకొనుచున్నామని చెప్పి ఆభూములపై వచ్చు రాబడిమీఁద రాబడిపన్ను వసూలుచేయుటలేదు. సుఖజీవనమునకుఁ జాలిన యాదాయమును దాఁటి వచ్చురాబడులన్నిటిమీఁదను రాబడిపన్ను వేయుటయే మంచిపద్ధతి. "చెల్లింపఁగల శక్తిగలవారిపైఁ బన్నులు వేయవచ్చును" అనుసూత్రిమీఁపట్టున నాచరణములోనికిఁ దేవలసినదే. ఈబాపతు శుల్కాభావనష్టము సంవత్సరమునకుఁ బదికోట్లరూపాయలని పై "షా" పండితుఁడే వ్రాసినాఁడు.

ఇంకొకటి యిట్టిదే యున్నది.

శి—ఏది ?

గు—తెల్లదొరలనేకులు మనదేశములో వర్తకముచేసి మనలనుండి యమితమైనధనము వాణిజ్యలాభరూపముగా లాగుకొని తమ గ్రేట్బ్రిటన్దేశమునకుఁబోయి దానితో నచట గొప్పభూములు సంపాదించుకొని వానిపైఁ బన్నులు గ్రేట్బ్రిటన్ప్రభుత్వమువారికిఁ జెల్లించుచున్నారు. ఆపన్నులయాదాయమంతయు న్యాయ్యముగా హిందూదేశమునకు వచ్చుబడిపన్నుగా రావలసినది.

శి—ఇండియాపరిపాలకులు స్వదేశీయులే యగునెడల బ్రిటన్వారితోఁ దగు నొడంబడికలు చేసికొని యట్టి యాదాయములను బోకుండ రాఁబట్టుకొందురుగదా !—నవ్వుకొనుచున్నారేమి ?

గు_ఏమియులేదు. "మాఆయన బ్రతికియుండిన మంగలవానినైనఁ బిలుచుకొనివచ్చునుగదా!" అన్నలోకోక్తి నీమాటలవలన జ్ఞప్తికి వచ్చుచున్నది. మనవారు పాలకులగుచో నట్టియిక్కట్టు లేలపుట్టును?

శి—పోనిండు, తరువాతి యుప్పపన్నుమాట చెప్పుఁడు. దాని మూలముననే యిప్పుడు దేశమంతయు నల్లకల్లోలముగా నున్నది.

గు—బీదలను బాధించుపన్నులు రాజులు వేయఁగూడదు—అను రాజనీతిసూత్రము సర్వజనసమాదరణీయసూత్రమే యగునెడల ఉప్పుపన్ను ఘోరమైన యన్యాయపుఁబన్నని చెప్పకతీఱదు.

శి—ఎందుచేత?

గు—సర్వప్రాణులును సునాయాసముగా యథేచ్ఛముగా అనుభవించుటకు గాలి వెలుతురు నీరు భగవంతుఁ డెట్లు విపులముగాఁ బ్రసాదించినాఁడో అట్లే మనుష్యులును పశువులునుగూడ సుకరముగా నుప్పువాడుకొని సుఖపడి యారోగ్యరక్షణము చేసికొనుట కాసర్వరక్షకుఁడు సముద్రమంత యవకాశ మనుగ్రహించినాఁడు. అట్టిచో దానికి ప్రతిబంధకములు కల్పించి పన్నులువేసి ప్రజను బాధపెట్టుట యధర్మకృత్యము. దేశమున కీపన్ను మహావిపత్తని యేకకంఠముగా హిందూదేశ ప్రజానాయకులందఱును గర్హించినారు.

శి—ప్రజలకు ఉప్పు చౌకగా నమ్ముచున్నారేమో!

గు—చేయుటకు నూఱురూపాయలు పట్టినసరకు ప్రజలకు రూ 1200 లు మొదలు రూ 2000 లకు అమ్ముదురఁట.

శి—ఈమాట లెవరుచెప్పినారు?

గు—'బ్లంటు'గారు తమగ్రంథములో వ్రాసినారు.

శి—ఇంకను ఈవిషయమునుగూర్చి ఆయన యేమివ్రాసినారో చెప్పెదరా?

గు—"కొనలేక యుప్పు మిక్కిలి తక్కువగా వాడుకొనువారు

నిఱుపేదలు. దక్షిణదేశప్రజలలోఁ బెక్కు రట్టిబీదవారే. దక్షిణహిందూస్థానములో మనుష్యుఁడు శ్రమపడి పండింపనక్కఱలేకుండ భూమిపైనే సర్గికముగా ఉత్పన్నమై కాన్పించుఉప్పు గలప్రదేశము లనేకములున్నవి. ఎదుటఁ బుష్కలముగా దొరకు ఉప్పు చూచుచు అన్యాయమగు శాసనముచే ఉప్పుకఱవనుభవించుట అచటిప్రజలకు మఱియుఁ గష్టముగానున్నది.—ఉప్పు కొనిపెట్టలేక మాపశువు లుప్పునాకియైన బ్రతుకునని రాత్రిలందు వానిని దొంగతనముగా ఉప్పుపఱ్ఱలకుఁదోలు దుర్దశకు మేము వచ్చినాము, కాని కనఁబడినయెడలఁ జట్టముల నతిక్రమించితిమని కావలివాండ్రు మాపశువులను బందెదొడ్లలోఁ బెట్టుదురు. స్వతస్సిద్ధముగా నేలపై నుప్పు గాన్పించుచోట్లనెల్ల నూడిపించి యాయుప్పును గుట్టలుగాఁ బేరిపించి పోలీసువారు అది ప్రజలుపయోగించుట కనర్హమగునట్లు పాడుచేయవలయునని యిటీవల నుత్తరువులు పుట్టినవి—అని నేఁ ద్రోవలోఁ జూచిన యనేకగ్రామములరయితులు మొఱ్ఱలువెట్టుకొనినారు." అనికూడ ఆ 'బ్లంటు' గారు వ్రాసినారు.

శి—ఈపన్ను వసూలుచేయుటకుఁ బ్రభుత్వమువారి కగు వ్యయమెంత ?

గు—అదియు నెక్కువయే. అసలురాబడిలో 19.7% అని వెనుకటి పట్టీలో నున్నది—అనఁగా దాదాపుగా నైదవవంతన్నమాట.

శి—అధికారులలో నెవరైన నీయుప్పుపన్ను దుష్టమైనదని యొప్పుకొనినారా ?

గు—ఆ! యావద్బ్రిటిషారాజ్యమునకు మంత్రియగు మెగ్డానల్డుగారే యిట్లు చెప్పుచున్నారు :—"ఉప్పుపన్ను ప్రజలనుండి బలవంతముగాఁగొను పీడాకరమైనపన్ను. యథార్థస్థితి ప్రజకుఁ దెలిసినయెడల, నది వారి కతృప్తిఁ గలిగింపకమానదు. ఇది స్వలాభమే పరమార్థముగాఁ జూచుకొని దరిద్రహిందూదేశమును దోఁచుకొని తాము బాగుపడిన కంపెనీవారియొక్క దుష్పరిపాలనమృతశేషము."

శి—అబ్బా! మెగ్గానల్లుగా రిప్పటి సంక్షోభము వచ్చునని య ప్పుడే తెలిసికొనిన భావిజ్ఞులన్నమాట.

గు—ఔను! నేఁటి కీప్రసంగము చాలును.

శి—చిత్తము! నమస్కారము! సెలవు.

గు—సుఖీభవ!

---

# II-7

(నమస్కారాశీర్వచనానంతరము)

గు—ఈసారి యింత శీఘ్రముగా వచ్చినావేమయ్యా?

శి—ఆయభాగములన్నియు నింకను గాలేదుకదా!

గు—అన్నిటిఁగూర్చి చెప్పఁదలఁచుకొనలేదు. భూమిపన్ను కల్లు పన్ను అడవులనుండివచ్చుఆయము రెయిల్వేలనుండివచ్చురాబడి నీటివసతులయాదాయము వడ్డిరూపమునవచ్చురాబడి—వీనిఁగూర్చి కొంచెము కొంచెము చెప్పి యీవిషయమును గట్టిపెట్టుదము.

శి—చిత్తము. భుక్తికిఁగావలసినపంటయుంచి రైతులనుండి మిగిలినదంతయుఁ బన్నురూపముగాఁ బరిపాలకులుపుచ్చుకొనుచున్నట్లున్నారు.

గు—అవును. అదియే చేయఁగూడనిపని. కఱవుకాలములకును గాలుసేతులు సవరించుకొనుటకును సహాయభూతముగాఁ గొంత సస్యరూపధనము కర్షకులకడ నుండనిచ్చుట ప్రభుత్వమువారికి విధి. అట్లుచేయకుండుట సేద్యకాండ్రకు బాధగా నున్నది.

శి—ఏమో! ఆమాట నమ్మఁజాలను. అంత కష్టముగానున్నచో రైతులేల భూములు వదలిపెట్టిపోవుటలేదు?

గు—సుఖముచేతఁగాదు, గత్యంతరముగానక వదలిపెట్టి వారు పోఁజాలకున్నారు. అన్నము దొరకుచో టగపడినఁగదా యెవఁడైనఁ దన యంబలి దిగవిడిచిపోవును! అదియుఁగాక హిందూదేశస్థు లున్నదానితో,

నెంతకష్టమైనఁ, దృష్టిపడియుందురుగాని సుఖముకై మార్పు నపేక్షించి క్రొత్తవృత్తిని జూచుకొనరు. ఇది వారి ప్రకృతి. అందుచేతనే మనదేశపు రయితు నూతనారంభసంచలనమనుమాటయే లేక తాతలనాఁటినుండి వచ్చుచున్న తన ప్రాంతభూమిని బట్టుకొని పశువువలెఁ బాటుపడుచు బహుకుటుంబియై అప్పులపాలై తిండిచాలక కడుపాకప్రక్కమూఁడుచు కొని యర్ధభుక్తిఁతోఁ గాలము గడపుకొనుచున్నాఁడు.

శి—ఇది యెవరిదోషము ?

గు—ఉపవృత్తులు కల్పించుకొని యున్నజీవనాధారమునకుఁ దోడుగాఁ గొంతడబ్బు సంపాదించుకొనకుండుట రయితుతప్పు. శక్తివంచన లేకుండఁ గరభారము తగ్గించి కర్షకుల సుఖజీవనమునకుఁ దోడ్పడకుండుట పాలకులతప్పు.

శి—ప్రస్తుతపాలకులు భూమిపైఁ బన్ను లెట్లువేయుచున్నారు ?

గు—సర్వత్ర యొకరీతిగానున్నట్లు కాన్పింపదు, కాని యీ భూమి మీఁద నింతపంట పండవచ్చునని యుజ్జాయించి సిస్తునిర్ణయించి యా సిస్తు దాదాపుగా 30 ఏండ్లవఱకు వసూలుచేయుచుందురు. అదిధనరూపముగాఁ జెల్లింపవలయును. ఆగడువుతర్వాతఁ గరనిర్ధారణముకై తిరుగ నంచనచేసి ఆపన్ను హెచ్చించుటయో తగ్గించుటయో చేయుదురు. సాధారణముగా హెచ్చించుటయే జరుగుచుండును.

ఊహించినపంటకును పండినపంటకును ఎంతయోవారయుండును. ధనరూపముగా విధించిన పన్నునకును దానికై యుద్దిష్టమైన సస్యభాగముయొక్క విలువకును వారయుండును.

శి—పండినపంటలో రయితుచెల్లించుపన్ను సగటున నెంతభాగ ముండును ?

గు—40%—అయిదుభాగములలో రెండుభాగములు—అని రాధాకమలముఖర్జీపండితుఁడు వ్రాసినాఁడు. ఈపన్నులు చెల్లించి ప్రాంత

యప్పులపై వడ్డీచెల్లించి కఱవుకాలమునకుఁ గావలయు గ్రాసము నిలువ చేసికొనుట రైతునకుఁ గడుఁగష్టమని ఆయన యభిప్రాయము.

శి—పూర్వ మీభూమిపన్ను లెట్లుండెడివి?

గు—పూర్వ మనఁగా?

శి—బ్రిటిషురాజ్యమునకు సన్నిహితపూర్వమున—మొగలారాజ్యములో.

గు—అట్లే యుండెడివనియును, పూర్వప్రభువులననుసరించియే తాము ను భూమిసిస్తు లేర్పాటుచేసినామనియును, ఆంగ్లప్రభువులు చెప్పుదురు.

శి—సరే, ఇఁకనేమి? ప్రభుత్వమువారిపన్నులు భరింపలేమని ప్రజలు మొఱపెట్టుటకు క్రొత్తహేతు వేమియుఁ గానిపింపదు.

గు—సూక్ష్మదృష్టికిఁ గానిపింపకమానదు, విను! తా మనుకరించి పోవుచున్నామని యిప్పటిప్రభువులు చెప్పుపన్నులు యుద్ధాదిసంక్షోభములచే రాజ్య మశాంతముగా నున్నప్పుడు మొగలులు తాత్కాలికముగా విధించినపన్నులుగాని మామూలుగావేయు పన్నులుగావు. మనవారు వేయునవి స్థిరమైనపన్నులు. ఇది యొకభేదము.

శి—క్రొత్తకరనిర్ధారణసమయములందు హెచ్చుచేయుచుందురు గాన నివియు స్థిరములని చెప్పఁజాలము. ఇతరభేదములేవియో సెలవిండు.

గు—మొగలుపరిభుత్వములో రయితులు పన్నులను ధనరూపముగాఁగాని ధాన్యరూపముగాఁగాని తమ యిష్టానుసారము చెల్లించుటకధికారు లొప్పుకొనెడువారు. అందేది తనకు లాభకారిగానున్నఁ గర్షకుఁ డారూపముగాఁ బన్ను చెల్లించుకొనెడివాఁడు.

శి—ఇప్పు డట్లుగాదు. ఆపీకులాటలు పెట్టుకొనక, పరిస్థితపరిభువులు, స్థితిగతు లెట్లున్ననుసరే, పన్నులన్నియు ధనరూపముగానే గ్రహించుచున్నారు. భేదము లిఁకేమైన నున్నవా?

గు—ఒకటియున్నది. దుర్భిక్షసమయములలోఁ గరుణించి పూర్వ

ప్రభువులు, విధించినపన్నులు వసూలుచేయకుండుటయో తగ్గించి వసూలుచేయుటయో చేసెడువారు. ఇప్పుడాసదుపాయములు లేనందున యుక్తకాలమున సిస్తుచెల్లించుటకై యప్పులపై నప్పులుచేసికొనుచు ఘోరమైన చక్రవృద్ధులనిచ్చుచు అనుకూలమైనవిక్రయకాలమువఱకు వేచియుండలేక తత్పూర్వముననే పండినపంటలను అల్పమూల్యముల కమ్మివేయుచు రైతు సకలబాధలు పడుచున్నాఁడు.

శి—రైతిట్టిదుస్థితిలోనున్నట్లు శ్వేతముఖులప్రమాణ మేమైన నున్నదా?

గు—పెద్దప్రమాణమే యున్నది, మెగ్డానెల్డుమంత్రిగారిది.

శి—ఆయన యేమనిచెప్పినారు?

గు—"అమితముగా పన్నులువేయుటయు వానిని కఠినముగా వసూలుచేయుటయు నిస్సందేహముగాఁ బ్రజలను దరిద్రులఁజేయుచున్నవి. శుల్కగ్రహణపద్ధతి యథాశాస్త్రీయముగా రాజ్యతంత్రదృష్టిని నిరాక్షేపముగా నున్నట్లు కాన్పించినప్పటికిని వ్యవహారమునందు మహాప్రజాపీడాకరముగా నుండి యతితీవ్రముగా ఖండించి దూషించుట కనువైనవిషయమైపోయినది" అని.

శి—మఱియెవరైన దీనిఁగూర్చి వ్రాసినారా?

గు—"బ్లంటు"గా రిట్లు వ్రాసినారు:—

"భూమిపన్ను ధనరూపముగాఁ జెల్లింపవలయునని చేసిన నిర్బంధమే నిశ్చయముగా రయితు ఋణగ్రస్తుఁడై పోవుటకంతకుఁ గారణమని నానమ్మకము......ఆంగ్లపరిపాలనవలన హైందవకృషీవలవర్గమునకువచ్చిన యనర్థములలో నిది పెద్దది...బలవన్మరణాపాయమునుండి రైతును మనము రక్షించుచున్నాముగాని పస్తులవలన నతఁడు కృశించి మందమాదముగా మరణించునపాయ మెక్కువచేయుచున్నామేమో యని నాకు భయమగుచున్నది."

శి—పరపతిసంఘములు స్థాపించి యిప్పుడు రైతు నప్పులవాని బారిఁ బడకుండ రక్షించుప్రయత్నములు చేయుచున్నారు కాఁబోలునే!

గు—అది మంచిదే, కాని దానివలన నతనిబాధ పూర్ణముగాఁ బోఁజాలదు. బాధానిర్మూలనమున కమోఘమైన సాధనము పన్నుభారము తగ్గించుట యొక్కటియే. ఇఁక నీవిషయము వదలిపెట్టి కల్లుమున్నగు స్వదేశీయమాదకద్రవ్యములపై వేయు సుంకములఁగూర్చి మాట్లాడు కొందము.

శి—విదేశీయమద్యములపైఁ బన్ను వేయరా?

గు—వేయకేమి? మఱచితివి కాఁబోలు! అది మొదటిబాపతు లో—ఎగుమతి దిగుమతిపన్నుల లో—చేరిపోయినది. ఆబాపతును ఇంగ్లిషులో Customs అందురు, దీనిని Excise అందురు.

శి—ప్రస్తుతదేశసంక్షోభకారణములలో ఈకల్లుపన్నొకటి.

గు—హిందూదేశప్రజావర్గములోఁ బ్రధానులు, హిందువులును మహమ్మదీయులును. వారిమతములు రెండునుగూడ మద్యపానమును నిషేధించుచున్నవి.

శి—ఎందుచేత?

గు—పూర్వీర్షులు ఆదేశరూపముగా విధినిషేధములు చేసిరిగాని వానికి హేతువులు చెప్పలేదు. అవి మనము తేలికగా నూహించుకొనఁ గలము. ఆరోగ్యహాని, బుద్ధినాశనము, నీతినష్టము, ఇతరపాపకరణప్రవృత్తి—ఇట్టివన్నియు మద్యపానమువలనఁ గలుగునుగనుక నది మహాపాతకములలో నొకటిగాఁ బరిగణింపఁబడుచున్నది. తాత్కాలికపరిమిత్తతా సుఖముచే మూఢులు మద్యపానమును వదలలేకున్నారు.

శి—వారు వదలలేకున్నఁ బ్రభుత్వమువారు తమశాసనబలముచే మానిపింపరాదా?

గు—ధనతృష్ణచే మానిపింపఁజాలకున్నారు. తాము మానిపింపక

పోవుటయేకాక దాని నణంగింపఁ బ్రజానాయకులు చేయుప్రయత్నములకు విఘ్నములు గలిగించుచున్నారు. పన్నులరూపమున వచ్చునాదాయముల లో నిది పరమనికృష్టమైన యాదాయము.

శి—నాయకుల బలాత్కారముచేఁ బరిపాలకులు కొన్నిపట్లఁ దాగుడు తగ్గించునేర్పాటులు చేయుచున్నారని వినుచున్నామే !

గు—అది నటన ; మనదేశపుకల్లుత్రాగుడుతగ్గిన, విదేశమద్య పానము హెచ్చుట కవకాశములు గల్పించుచున్నారు. "బియర్ మున్న గు విదేశమద్యములు ప్రజలు త్రాగుట పెద్దపట్టనములలో హెచ్చుగుచు న్నది" అని 1927-28 సం॥ బొంబాయిరాష్ట్రపరిపాలనపురిపోర్టులో వారే వ్రాసి యొప్పుకొనుచున్నారు.

శి—నీతిభ్రంశహేతువై ఇదియుఁ బ్రజాపదార్థోత్పాదనశక్తి తగ్గించుచున్నదన్నమాట. ఇఁక నడవిపన్నులఁగూర్చి చెప్పుఁడు.

గు—అడవులు సంరక్షించి పెంచుటవలన అనావృష్టిబాధ కొంత వఱకు తగ్గించి ప్రభువులు దేశక్షేమమే కావించుచున్నారు. అందులకు వారి కెంతయు మనము కృతజ్ఞులమై యుండవలసినదే— కాని "పరిపాలన విధానము ప్రజలకు బాధాకరముగా నున్నది ; అట్లుండనక్కఱలేదు..... చెట్లయాకులు పూర్వ మెరువుగా జను లుపయోగించుకొనెడువారు, దాని కిప్పు డాటంకము వచ్చినది. పశువులుమేయు పచ్చికపట్లిప్పుడు తగ్గిపోయినవి, అందుచే మేఁతలేక పశువులు చచ్చిపోవుచున్నవి. ప్రజలకుఁ బూర్వము కలప యుచితముగా దొరకుచుండెడిది, మోపున కింత మూల్య మీయవలయునని యిప్పు డేర్పాటులు చేసినారు" అని బ్లంటుగారు చెప్పినారు.

శి—కనుక నీస్వల్పబాధలుకూడ జనులను సత్త్వహీనులనుజేసి వారి వస్తూత్పాదనశక్తి తగ్గించుచున్నవన్నమాట. ఇఁక రెయిల్వేలను గుఱించి మాటలాడుకొందము.

గు—అవియుఁ బ్రజల యర్థసంపాదనశక్తి కడ్డువచ్చుచున్నవి. పాశ్చిక పుబాడిగలు విధించి విదేశపువర్తకుల కుపకారమును మనదేశపు వర్తకుల కపకారమును గావించుచున్నారని వెనుకఁ జెప్పితిని; అది జ్ఞప్తిలో నున్నదా?

శి—ఉన్నది, వ్యయములనుగూర్చి ప్రసంగించుచుఁ జెప్పినారు.

గు—రెయిల్వేలు కేవలము అనర్థకారులని యెవరును జెప్పసాహసింపరు. మితముగా, వాణిజ్యావశ్యకతనుబట్టి, వేసికొను అయోమార్గములు దేశమునకు లాభకారులగును. అమితముగా అనావశ్యకముగా వేయఁబడి దుర్వినియోగము చేయఁబడు రెయిలుబాటలు దేశానర్థకరములు గాకమానవు.

శి—నిజమే, మితముగా జాగ్రత్తతోఁ జేసిపెట్టుకొన్న నిప్పు చలి గాఁచుకొనుటకును వండుకొనుటకును ఉపయోగించి ఇంటివారిని సుఖపెట్టును. అదియే యనర్హస్థలములం దుంచినఁగాని, అమితముగాఁ గూర్చినఁగాని, అజాగ్రత్తతో వాడినఁగాని, ఇంటికిని ఇంటివారికినిగూడ ముప్పు దెచ్చును.

గు—నీవుచెప్పినది నిజము. మనదేశమునకు రెయిల్వేలవలనఁగలుగు కీడులు కొన్ని యితఃపూర్వము చెప్పితిని, అవి నీకు జ్ఞప్తిలో నున్నవా?

శి—ఉన్నవి. జీవనాధారములగు మనదేశపు ముడిసరకులు పరదేశములకుఁ గొనిపోవుట యొకటి. అనావశ్యకములయిన విదేశభోగపదార్థములను దేశములోఁ బ్రవేశపెట్టి, ప్రజలను దరిద్రులఁజేసి, వారిపరాపేక్ష యెక్కువచేయుట యొకటి.

గు—సరియే. అవిగాక పూర్వవృత్తుల క్షీణింపఁజేయుట మూడవవిపత్తు.

శి—అది నాకుఁ దిన్నగా బోధపడుటలేదు.

గు—బండ్లప్రయాణములు తగ్గినవి, కావడిమోఁతలు తగ్గినవి.

శి—రెయిలుకడకును రెయిలునొద్దనుండియును సామానులుమోసి

జీవించుకూలివాండ్రు లేరా? బండ్లుతోలుకొని బ్రతుకువారు లేరా?

గు—"తగ్గినవి" అంటినిగాని ఇప్పుడు "లేవు" అని చెప్పలేదు. పూర్వము వ్యవసాయముచేసికొని జీవించువాని కతనియెడ్లు వర్షాకాలమునందుఁ బొలముదున్నుట కుపయోగించెడివి, వ్యవసాయములేని రోజులలో సవారిబండ్లులాగి యజమానున కుపజీవికను గల్పించి డబ్బు సంపాదించిపెట్టెడివి. పొలముపను లయిపోయినకాలమం దిప్పుడు రయితు లూరక కూరుచుందురు.

శి—కనుక ఏఁడాదిలోఁ గొంతభాగము రయితును అతనియెడ్లు లునుగూడ దేశభాగ్యాభివృద్ధికరములగు పనులేమియుఁ జేయక సోమరులై పడియుందురన్నమాట. దేశానర్థహేతువులలో నిదియొకటి. ఇఁకఁ గృష్యుపకారకములగు నీటివసతులనుగూర్చి చెప్పుఁడు.

గు—కృషివృత్తి జలాపేక్షకమైన వ్యాపారము. భూమి యెంత సారవంతమైనను యుక్తకాలములోఁ గావలయు నీరు రాకున్నఁ, బంటలు చెడిపోవక మానవు. అనాదిగా హిందూప్రభువులు తమ యన్నివిహితకృత్యములలోను ఇది ప్రధానతమమైన కృత్యముగా భావించుకొనెడువారు. ధర్మాత్ములు పుణ్యసంపాదనముకొఱకు నూతులు చెఱువులు త్రవ్వించెడువారు; ప్రభుత్వమువారు నదుల కానకట్టలుగట్టి, కాలువలుత్రవ్వించి, పొలములకు నీళ్లు పాఱించి సేద్యకాండ్రకుఁ దోడ్పడెడువారు.

శి—ఇప్పుడు బ్రిటిషువారును అట్లు చేయుచున్నట్లున్నారే పాపము!

గు—కొంతవఱకుఁ జేయుచున్నారు. చేయవలయునంత చేయఁ గలిగినంత చేయుచుండుటలేదు. అంతసొమ్మును రెయిల్వేలే మ్రింగివేయుచున్నవి. అవి పరిపాలకుల కనేకకారణములచేఁ బ్రియతమములైనవి. వానికిఁ బోఁగా మిగిలిన యల్పమూల్యము నీటివసతులకు వినియోగించుచున్నారు. దేశాభ్యుదయమున కదిచాలదు. దేశములో సగముభూమి

యింకను కేవలము ప్రజలస్వప్రయత్నమువలననే సాగుచేయఁబడుచున్న దని "షా" గారు వ్రాయుచున్నారు.

శి—ఇఁక వడ్డీవలనవచ్చు నాదాయమునుగూర్చి చెప్పఁడు.

గు—ఈక్రిందిపట్టిక పరిశీలింపుము :—

హిందూదేశములోనిచ్చినయప్పులమీఁద

వడ్డీమొత్తము (లక్షలలో)

| | |
|---|---|
| మ్యునిసిపల్సంఘములుసంస్థానములుమున్నగువానికిచ్చినయప్పులపైని | 227 |
| రెయిల్వేలు ప్రావిడెంటుఫండు మొదలగువానిపైని | 42 |
| రైతుల యప్పులపైని | 31 |
| చిల్లరయప్పులపైని | 29 |
| | 329 |
| ఇంగ్లండులోనిచ్చిన యప్పులపైని | 327 |
| మొత్తము | 656 |

ఎచ్చటెచ్చట నెంతెంతవడ్డీకి ఋణములిచ్చినారో ఆవైనము ప ట్టీనిబట్టి స్పష్టముగాఁ దెలియదు. ఒకసంగతిమాత్రము మన మూహించి గ్రహించుకొనవచ్చును.

శి—అది నేనును జెప్పుకొనఁగలను. హిందూదేశములో నిచ్చిన ఋణములకు దాదాపుగా సమానమైనమొత్తమును పరదేశస్థులకు అప్పి చ్చినారని తెలియవచ్చుచున్నది.

గు—దానివలన నష్టమేమో చెప్పఁగలవా ?

శి—చెప్పలేకేమి ? డబ్బులేక ఋణముదొరకు మార్గములులేక యంతకంతకు క్షీణదశ నొందుచున్నవ్యాపారము లనేకములు మన దేశము లోఁ గన్పట్టుచున్నవి. వానిపోషణమున కుపయోగింపఁబడవలయు సొమ్ము అన్యథా వినియోగింపఁబడినది.

గు—బాగుగానే గ్రహించినావు. సుప్రసిద్ధవాస్తువిద్యావిశారదుఁ

డును అర్థశాస్త్రవేత్తయు నగు సర్ విశ్వేశ్వరయ్యగారు పూనాపట్టన మందలి కళాశాలలో యువజనసంఘమున కుపన్యాసమిచ్చుచుఁ జెప్పిన యీమాట లాలింపుము.

శి—చిత్తము.

గు—"మనదేశమందలి యీభాగములోని పడుచువారుకొంద ఱు విద్యాసంగ్రహార్థము విదేశములకుఁబోయి కృతకృత్యులై వచ్చి యిట లాభకరములగు వ్యాపారములు బయలుదేఱదీయుటకుఁ బ్రయత్నించి పెక్కుపట్ల పాపము! విఫలమనోరథులైనారు. ఎందుచేత? పరిపాలకుల యవలంబనము లేదుగనుకను, దేశస్థులనుండి ధనముఁ గూర్చుకొని దానిని జక్కఁగా వినియోగించునేర్పాటులు చేసికొను సామర్థ్యము ప్రజలకులేదు గనుకను. ప్రభుత్వమువా రిట్టియుద్యమములఁ బోత్సాహపెట్టుటకుఁ ద గినశ్రద్ధ వహించుచున్నట్లు కాన్పింపదు; వారి నట్టిశ్రద్ధవహించునట్లు చేయుశక్తి ప్రజాభిప్రాయమునకు లేదు."

శి—అనుభవశాలిగనుక నున్నపరిస్థితులు గనిపట్టి యథార్థము చెప్పినాఁడు.

గు—ఆయన మన నల్లయాయనయగుటచేఁ బక్షపాతబుద్ధితో నట్లుచెప్పినాఁడని కొంద ఱనుకొనవచ్చును. తెల్లవారిలోనే గొప్పవాఁడగు "సర్ డానియల్ హామిల్టన్"గారినుండి వచ్చిన యీసూక్తులువినుము—

"పెచ్చుగానున్న పంటలను బైకి లాగివేయుటకు మనము వారికి రెయిల్వేల ననుగ్రహించినాము; కాని వానిమూల్యములను రాఁబట్టు కొని చక్కఁగా వ్యవహరించుకొనుటకుఁజాలిన కొశలను (Banks) బ్రసా దింపలేదు. ప్రజలసస్యము సర్వేతరప్రపంచమునకును బోవుచున్నది; డబ్బు సాహుకారుచేతులలోను వర్తకునిచేతులలోను బడుచున్నది; పాపము! ప్రజలు సైతానుపాలగుచున్నారు."

శి—ఈయనయును ఉన్నదున్నట్లే పలికినాఁడు. ఆయమూలలను

లన్నియును అన్యదేశముల కుపయోగపడుచున్నప్పుడును దేశక్షేమమున కుఁ బ్రతికూలములైనసంకల్పములు ప్రభుత్వమువారిహృదయముల నాక్ర మించుకొనియున్నప్పుడును దేశప్రజలు దరిద్రులుగాక ధనవంతు లెట్లు కాఁగలరు ?

గు—నేఁటి కీసంభాషణము గట్టిపెట్టుకొందము.

శి—అట్లైన సెలవు, నమస్కారము !

గు—శుభమస్తు !

---

# 11-8

శి—నమస్కారము.

గు—దీర్ఘాయురస్తు ! కూరుచుండుము.

శి—శ్రీకుమారప్పగారు వ్రాసినవిషయము లయిపోయినవా ఇంకను నున్నవా ?

గు—ఇఁకలేవు, కాని యింతవఱకును జెప్పినవిషయములసారము ను గొన్ని హిందూదేశచరిత్రాంశములతోఁగూర్చి మనసున కెక్కునట్లు ఆయన మరలఁ జెప్పినాఁడు. కావలయునన్న, ఆసంక్షేపకథనము నాశక్తి కొలఁదిఁ దెలుఁగున నీకిప్పుడు వినిపించెదను.

శి—"మనసున కెక్కునట్లు" అని మీరే చెప్పుచున్నారు, విష యము ప్రజాసౌఖ్యమున కాయువుపట్టయిన దేశపాలనమయ్యెను, అక్కఱ లేదనువాఁ డెవఁడుండును ? కాని, వేదవేత్త యాశీర్వచనపు పనస చెప్పు చుండఁగా సంభావనకువచ్చిన నిరక్షరకుక్షిగాఁడు చేతియక్షతలు నలుపు కొనుచు మిన్నక యాయనమొగమువైపు చూచుచుండునట్లు, నేఁటి ప్ర సంగములో నేను మూలికిఁ దాళముమై చుకొని యూరక వినుచుండవలసిన వాఁడనే కాఁబోలు!

గు—అట్లేలజరుగును? సుతిలేని పాటయుండునా? నాశ్రమకొంత

తగ్గించుటకును విషయములను మఱింత విస్పష్టముగా నాచేఁ జెప్పించుట కును నడుమనడుమ నీనాలుకయును గొంత యాడుచుండవలయును.

శి—చిత్తము.

గు—ఒక మహారాజ్యము జీర్ణమై శిథిలమై నశింపఁబోవుచున్న ప్పుడు చుట్టుపట్ల వేచికొనియుండు విత్తకాములును రాజ్యకాములును సాధ్యమైనంతయధికారబలమును సంపాదించుకొనుట కల్లాడుచుందురు—అనుసత్యము దేశచరిత్రలు మనకు బోధించుచున్నవి. తదనుసారముగా కేవల మర్థకాములై యుండిన బ్రిటిషీస్టిండియాకంపెనీవారు సమయము కనిపట్టి ఢిల్లీచక్రవర్తిసింహాసనము తాము లాగుకొనిరి. అప్పటిపరిస్థితులను బట్టి ప్రజలపై వేసిన పన్ను లతిభారవంతములుగా నుండియుండవచ్చును.

శి—ఆపరిస్థితు లేమైయుండును?

గు—దేశమంతయు నశాంతముగా నుండెను, మోగలాయి[?]సౌధ ము కూలుటకు సిద్ధముగానుండి జవ్వాడుచుండెను, మోగల్చక్రవర్తుల లోఁ జివరవాఁడు ప్రజాపీడకమైన పరిపాలనముచేసెను, అతనికాలములో సంభవించినయుద్ధముల కధికముగా ధనము కావలసియుండెను; అందుచేఁ బ్రభువులకుఁ బ్రజలు బరువైనపన్ను లప్పుడు చెల్లించుచుండవచ్చును.

శి—అది ప్రమాణముగాఁగొని యాంగ్లప్రభువు లట్లే పన్నులు వేసి జనుల బాధించుచున్నారని వెనుకఁ జెప్పినారు.

గు—ఔను ఆబాధ యిప్పు డధికమైనది, ఏలన:—పన్నులు వ సూలుచేయుటలో అసమర్థులగు మోగలులకు పట్టువిడుపులుండెడివి. ఇఁక శుల్కగ్రహణవిద్యావిశారదులగు మన యాంగ్లేయప్రభువు లొకపైసయై నను చెదరిపోకుండ యథావిధిగాఁ బన్నులు వసూలుచేయుచుండుటచే ఆయపుమొత్తముతోపాటు ప్రజాకష్టమును హెచ్చుచున్నది!

శి—ప్రజలతృప్తియే మాకుఁ గావలయును, అందే మామానంద మంతయునున్నది—అనుమాటలు చెప్పుచు మనకోసమే వారు హిందూ

దేశపరిపాలనభారము వహించుచున్నట్లు చెప్పుదురే! శిశువులయాస్తి పుచ్చుకొని దానిని జాగ్రత్తతోఁ జక్కఁగాఁ గాపాడి యభివృద్ధిచేసి వారికి యుక్తవయస్సురాఁగానే వారియాస్తి వారి కినుమడిగా నప్పగించు పరోపకారపరాయణులవలె వ్రాఁతలు వ్రాయుదురే!

గు—అవన్నియుఁ దరువాత బయలుదేఱిన శ్రీరంగనీతులు, తమ రాజ్యము దృఢముచేసికొనుటకాడిన పౌరుషవచనములు, బ్రహ్మాండమంత భారతరాజ్యమును దమచేతిలో నుంచుకొని చప్పరించుచున్నతప్పుఁ బాపుకొనుటకుఁ గల్పించినకారణములు.

శి—అట్లైన బ్రిటిష్‌సామ్రాజ్యనిర్మాతలని పేరుపడిన క్లైవు మున్నగు మహాపురుషులు మనదేశమునకుపకారకులేయని చెప్పవలయునుగాఁబోలు.

గు—సందేహమేమి? మన కపకారకులుగాని, తమదేశము వారికి మహోపకారకులే.

క్లైవుగారును వారన్హేస్టింగ్సుగారును తదితరులును జేతికందిన దేశ ధనమంతయుఁ జేఁది పట్టుకొనిపోయినారు. ఆ యమితధనరాసులు తమవారు భూమయంత్రాదులు గల్పించుకొని సుఖపడుటకు సాధనభూతములైనవి. అవియే యింగ్లండుయొక్కయు యూరప్ఖండముయొక్కయు వ్యాపారవ్యాప్తికిని వర్తకాభివృద్ధికిని బ్రధానకారణములైనవి. వారివర్తకవ్యాపారాభివృద్ధితో ఆర్యావర్తవ్యాపారాభ్యుదయమునకు క్షీణదశప్రారంభించినది.

అం దాశ్చర్యమేమియులేదు. ఈస్టిండియాకంపెనీవారు వాణిజ్యముచే డబ్బు గడించుకొనుటకు మొదట మనదేశములోఁ గాలుపెట్టినారుగాని మనకుఁ బ్రభువులై మనల నుద్ధరించుటకు రాలేదు. అదృష్టవశమునఁ బాలకులై నపిమ్మటఁగూడ బ్రిటిష్‌వ్యవహారమునందును తాత్కాలికస్వలాభమునే వారు చూచుకొనుచుండిరిగాని హిందూదేశభావిసౌఖ్యమును దృష్టినిడుకొని ప్రవర్తింపలేదు. ప్రభుత్వబాహ్యలక్షణము లగపడుచుట కప్పుడప్పుడు మనదేశముబాగుచుక పరిగణించినను అది యింగ్లండుయొ

క్కుదినదినాభివృద్ధికిని దాని సర్వసర్వాంసహాపరిపాలనాభిలాషకును అబా
ధకముగా నుండునట్లు చూచుకొని మఱి వ్యవహరించెడువారు.

శి—బ్రిటిష్‌వారి యైశ్వర్యోత్కర్షసాధమునకు మనభారతభూమి
నిచ్చెనమెట్టైనదన్నమాట. మొగలాయిరాజ్యాంతమునఁ బ్రారంభించిన దేశా
ధఃపతన మక్లేయున్నదన్నమాట.

గు—అక్లేయున్నఁ గొంతమేలే. అంతకంత కాచ్యుతి యెక్కు
వగుచున్నది.

శి—కారణములు ?

గు—అనేకములున్నవి. ఇంగ్లండులో యంత్రికర్మాగారము లె
క్కువగుచున్నకొలఁదిని మనదేశమునుండి వానికై ముడిసరకులయెగుమ
తులు హెచ్చుకావలసివచ్చినది. ఆఫాక్టొరీల పరిపోషణమునకై దిగుమతి
సరకులపై వేయు టారిఫుసుంకములు అన్యాయముగావిధింపవలసివచ్చినది.
బొంది యొకచోటను డెంద మొకచోటను నుండుపరిపాలనము ప్రజాతృప్తి
కరముగా నుండఁజాలదు. మనకుఁ బదార్థనష్టియు వారికర్థపుష్టియుఁ బ్ర
స్తుతపరిపాలనఫలములుగాఁ గాన్పించుచున్నవి.

శి—మాకు హిందూదేశమును పాడుచేయవలయునను దురుద్దే
శము లేదు, ప్రజాక్షేమముఁ గోరియే పన్నులువేసి యితరదేశములతో
వాణిజ్యవ్యవహారములు నడపుచున్నాము, హిందూదేశమునకుఁ గొంచె
ము నష్టమును లంకాషైరువారి కించుక లాభమును సంభవించుచున్న
యెడల నవి యానుషంగికముగా వచ్చుచున్నవిగాని మేము బుద్ధిపూర్వక
ముగాఁ దెచ్చుచుండుటచే వచ్చుటలేదు—అని యాంగ్లపరిభవు లో
వారిపక్షమువారో చెప్పిన నపుడు మీరేమిచెప్పెదరు ?

గు—వారు వీరు చెప్పనక్కఱలేదు—ఈమాటలు మంత్రి మెగ్డా
నల్డుగారే చెప్పినారు. కాని యవి విశ్వాసపాత్రములుమాత్రము గావు.

చేనిలోఁజొచ్చి యొకఁడు గోఁగాకులు గోయుచుండఁగాఁ జూచి

భూస్వామి వచ్చి యతనిని బట్టుకొని కొట్టఁబోయినాఁడఁట. అంతట నా దారిఁ బోవుచున్న యొకఁ డడ్డపడి—పోనిమ్ము వెఱ్ఱివానివలె నున్నాఁడు వదలిపెట్టుము—అని పలికినాఁడఁట. "మతిలేనివాఁడైనఁ జేతులు కందియాకులమీఁదికిని ఉలవాకులమీఁదికిని బోక తిన్నగా గోఁగుకూరపైకే యేల పోవలెను?" అని పంటకాఁపు ప్రశ్నించినాఁడఁట. కనుక లాభము తమదేశమువారికే వచ్చుటయును, దానివలని నష్టము తాము ప్రవేశించి పాలించుచున్న దేశమువారికే కలుగుటయును కాకతాళీయములు గాఁజాలవు.

శి—కాకతాళీయములుగావు, కావలయునని చేయుచున్న వానివలెనే కాన్పించుచున్నవి.

గు—ఔను, సుప్రసిద్ధాంగ్లేయవిశ్వవిద్యాలయములలోఁ జదివి మేధావంతులని పేరుపడి కఠినములైనపరీక్షలలో నుత్తీర్ణులై వచ్చి మనదేశములో కల్లెక్టరులుగాను గవర్నరులుగాను పనిచేసినవారు వివేకహీనులయి పొరపాటుపడుచున్నారని చెప్పుటకు వీలుపడదు.

శి—పొరపా టొకయేఁడు రావచ్చును రెండేండ్లు రావచ్చునుగాని యెల్లకాల మేకరీతిగా సంభవించుచున్నది ప్రమాదజన్య మెట్లగును?

గు—ఒకసారి ప్రమాదములోఁ బడినవా రితరులు చెప్పినమాటలు విని తరువాతఁ జక్కఁబడుదురు.

అయ్యలారా! దేశానర్థకారులగు నినుపదారు లమితముగా వేసి ప్రజలకుఁ గూడు లేకుండఁజేయుచున్నారు, పాక్షికపు రెయిలుబాడిగలు వేయుచు స్వదేశవ్యాపారములఁ జంపుచున్నారు, మీదేశపు వణిజులకు మేలుచేయుతలంపుతో దిగుమతిపన్ను లతిలఘువుగావేసి స్వచ్ఛందవాణిజ్యము సాఁగించి దేశీయుల కన్యాయముచేయుచున్నారు—అని దేశనాయకు లేకగ్రీవముగాఁ జెవినిల్లుకట్టుకొని చిరకాలమునుండి మొఱలు పెట్టుకొనుచున్నప్పటికిని "ఇవన్నియు నత్యల్పసంఖ్యాకులగు నసంతుష్టవిద్వత్ప్రి

జలయొక్కయు ననాలోచితముగా వారిపక్ష మవలంబించి వాదించు ఇంగ్లండులోని కొంద ఱవివేకులయొక్కయుఁ బ్రలాపము" లని ప్రభువులు నిరసించుచున్నారు గాని యామాటలఁ బాటించుచుండుట లేదు.

శి—మేలుకొని నిద్రించుచున్నవారి నెవరు లేపఁగలరు?

గు—కనుక ఈపెట్టుబాధలన్నియుఁ బ్రమాదజన్యములని చెప్పి వారిబుద్ధి కపకర్షముఁ దెచ్చుటకంటె "ఎంతబుద్ధిశాలులైనను తమవారిని బాగుచేయుటకై యన్యాయమున కొడిగట్టుకొనకమానరు, అది నైసర్గికము" అనిచెప్పి యాదౌర్బల్యమంతయు వారి నీతి కారోపించి చెప్పుట యుచితము.

శి—అర్థలోలుపులగు వర్తకులబృందమునుండి హిందూదేశపాలనము ఐశ్వర్యతృష్ణగల బ్రిటిష్రాజులచేతిలోనికి వచ్చినతరువాత సరసవాక్యసంయుతములైన శాసనములుదక్క నన్యలాభ మేమియు లేదన్నమాట.

గు—అంతే! రాజు దేవాంశసంభూతుఁ డనువిశ్వాసము గల అమాయికప్రజచే ఆశాసనము లవిలంఘనీయములైన దైవశాసనములుగాఁ దలఁపఁబడుచున్నవి. "గొప్పవర్తకలాభము గ్రేట్బ్రిటనునకుఁగూర్చి యిండియా ధన్యమైనది, అధికమూల్యముతో నామె యమోఘమైన సంరక్షణలాభము సంపాదించుకొని ధన్యతరమైనది" అని యొకరుచెప్పినారు.

శి—చారిత్రవిషయాత్మకమైన యీపునాది చాలును. ముందు ప్రసంగమునకుఁ బోదము.

గు—"బ్రిటిషాధిజ్యప్రయోజనములకై మనము వెచ్చించుచున్న ధన మత్యమితముగా నున్నది, హిందూదేశాభివృద్ధికై చేయు అర్థవ్యయ మత్యల్పముగా నున్నది" అని మెగ్డానల్డుమంత్రిగారు వ్రాసినారు.

రైయిల్లుమున్నగువానికి పెద్దపెద్దమొత్తములు వ్యయించుచున్నారు, దేశపుష్టికరములగుపనులు గావించుటకువలయుధనము లేకున్నది, పరిపాలకజాతివారుచేయు నుద్యోగములలో నిరాధారులై బాధపడుచుండు పరిపాలితదరిద్రప్రజల నిట్టూర్పులు వినఁబడకున్నవి.

మనదేశమునుండి వసూలుచేసిన శుల్కపుటాదాయములో విశేష భాగము దేశముదాఁటిపోయి విదేశములలో వినియుక్తమై యచ్చటివారికి ఫలకారియగుచున్నది.

ఈమాట మంత్రిగారేయొప్పుకొని చెప్పుచున్నారు. ఇంకొక యనర్థము గన్పట్టుచున్నది.

శి—అదియేది?

గు—పన్నుభారము దరిద్రులపై నత్యధికముగాఁ బడుచున్నది, తదితరులపై—ముఖ్యముగా ధనవంతులపై—మిక్కిలి తేలికగాఁ బడుచున్నది, కడుపుగట్టుకొని కటికిదరిద్రుఁడు చెల్లించుసూపాయ ధనవంతుల విషయోపభోగముల కాధారభూతమగుచున్నది. "ఇది మన హిందూరాజ్యపరిపాలనములోని మహాకలంకము, అతిశీఘ్రముగాఁ దుడిచివై చుకొనవలయు మచ్చ......" అని సర్ ఏ. కాలిన్‌గారు వ్రాసినారు.

శి—బుద్ధిమంతులగు మనప్రభుత్వమువారు ఈవిషయమున భాగ్యవంతులను తేలికగాఁ బోనిచ్చి బక్కవారగు దరిద్రుల నేల బాధపెట్టుచున్నారో?

గు—దానికి రెండుకారణము లగపడుచున్నవి. ఇండియాలోనుండు బ్రిటిషువారందఱును ధనవత్కోటిలోఁ జేరినవారు; కనుక ధనవంతులను పన్నులచే బాధించినయెడల వారికిఁగూడ ఆబాధ తగులకమానదు.

శి—సరియే, రెండవహేతువు?

గు—అదియే ప్రధానహేతువు. బ్రిటిష్పరిపాలనము పరపరిపాలనము, విదేశపుమొక్క, అది యింకను వేళ్లుపాటి లోఁతుగా నాటుకొనలేదు. దాని కెవరోకొందఱపోషణము కావలయును. ధనాధికులును విద్యాధికులును అగు జనులనెడునేలపై పొరలనుండియే దానికాతోడ్పాటు రావలయును. వారికి సమ్మతమైనట్లే శుల్కనిర్ణయసూత్రములు చేయవలెను. సాధారణముగా వీరి కనుకూలములగుపద్ధతులే దేశములోనుండు నాంగ్లేయులకును అనుకూలములుగా నుండును, వీరికి బాధకములైనవే వారికిని

బాధకములుగా నుండును. కనుక నీయుభయుల మాటలును పరిపాలకుల చెవికెక్కి వారి కాదరణపాత్రము లగుచున్నవి.

మఱియుఁ బరపరిపాలనమువలన సేనావ్యయ మత్యధికముగా నుండును.

శి—ఎందుచేత ?

గు—విదేశీయప్రభువులు స్వసంరక్షణార్థము భృతకసైనికుల ననేకుల నేర్పఱుచుకొని వారిని యుద్ధావసరములందును శాంతిసమయములందునుగూడ భరించుచుండక తప్పదు. స్వదేశీయులే ప్రభువులగునెడలఁ గొలఁదిమందినే వేతనములిచ్చి స్థిరసైనికులఁగాఁ బెట్టుకొని, యాపత్సమయములందుఁ గావలసినంతమందిని ఆప్తులగు నాత్మీయప్రజలనుండి తాత్కాలికయోధులఁగా నెన్నుకొని, వారివలన రాష్ట్రరక్షాప్రయోజనములు నెఱవేర్చుకొందురు.

శి—రెయిల్వేలుగూడఁ బ్రజోపకారకమగు తటాకాదినిర్మాణమున కడ్డువచ్చుచున్నవని వెనుకఁ జెప్పినారు, కాని పాపము! అవి కఱవుబాధలు కొంతవఱకు తగ్గించుచున్నట్లున్నవి.

గు—దానికిఁ బ్రత్యుత్తరము వెనుకఁజెప్పితిని, మఱచినావుకాఁబోలు.

శి—ఏమని ?

గు—రోగముఁదెచ్చుకొని కుదుర్చుకొనుటకంటె రోగమురాకుండఁ జేసికొనఁబ్రయత్నించుట మంచిదని.

అదియుఁగాక యెప్పుడో కఱవుకాలములందుపయోగించునని చెప్పి నిత్యపీడాకరములగు నయోమార్గముల నెవఁడు నెత్తిమీఁదఁ బెట్టుకొనఁ జూచును? అది గాలివానలువచ్చినప్పుడు ప్రాణసంరక్షణార్థ ముపయోగపడునని యతివ్యయాత్మకమైన నౌకాదళము నిర్మించిపెట్టుకొనిన ట్లుండును.

వహనసాధనములుగానైన సర్ ఏ. కాటన్ గారు ఇండియాలోని

రెయిల్వేలను మెచ్చుకొనక—"హిందూదేశమునకు నేడు గావలయునవి నీటిబాటలు. వాని ప్రయోజనములు బహుమూల్యసాధ్యములగు రెయిల్వేలు నెఱవేర్పకున్నవి. కాలువలు దవ్వివానిపైఁ జిన్న పొగపడవలు నడపునెడల నవి చౌకగా నెంతసరకైన నతివేగముతో నొకచోటనుండి యొకచోటికిఁ గొనిపోఁగలవు. అట్టికాలువలు త్రవ్వుటకగుఖర్చు రెయిల్వేలు నిర్మించుటకగు వ్యయములో నెనిమిదవవంతైనఁ గాదు" అని వ్రాసినారు.

"ధనోత్పాదనానుకూలముగా నేర్పాటులు గావింపఁబడుచుండుట లేదు. అదియే హిందూదేశదారిద్ర్యమునకు హేతువగుచున్నది" అని రష్‌బ్రూక్కువిల్యమ్సుగారు సత్యము గనిపట్టి చెప్పినారు.

శి—అట్టియేర్పాటు లేల చేయకున్నారు?

గు—హాబ్సన్‌గారు సెలవిచ్చినట్లు—నాగరకులగు పాశ్చాత్యప్రపంచమువారు తమకంటె నిమ్నస్థితిలోనుండు సర్వేతరప్రపంచమువారిని అడఁగఁద్రొక్కి యధికారముచలాయించి తాము బాగుపడుటకే పుట్టినారనియును, తాము ప్రపంచాధిపత్యవైభవముతో నుండఁదగు అగ్రవర్ణమువారనియును, తమసుఖముకై తక్కువారందఱు దాసజనమువలెఁ బాటుపడి భోగపదార్థములు సమకూర్పవలయుననియును, భావించుకొని వారి రాజ్యాంగతంత్రములు వారివాణిజ్యపద్ధతి వారినీతి సమస్తము తదనుగుణముగా నమర్చిపెట్టుకొని ప్రవర్తించుచున్నారు—ఇదియే మనదేశమునకు శుభకరములగు నేర్పాటులు వారు చేయకుండుటకు హేతువుగాఁ జూపట్టుచున్నది.

శి—చాతుర్వర్ణ్యసంక్షోభమునకుఁ దోడుగా శ్వేతవర్ణపీడ యొకటి వచ్చినదన్నమాట. ఇట్లు చెప్పిన దాంగ్లేయులలో ఆయన యొకఁడేనా ఆయనవాక్యములను బలకరముగా మఱియెవరైనఁ జెప్పినారా?

గు—డాక్టర్ రూథర్ఫర్డుగా రిట్లు వ్రాసినారు:—"హిందూదేశమునందుఁ గన్పట్టు బ్రిటిష్పరిపాలనపద్ధతి యొకజాతి మఱియొకజాతిని బీడించి తా బాగుపడు నధమాధమనీతిబాహ్యపద్ధతి."

శి—ఆయనదృష్టిని హిందూదేశదారిద్ర్యహేతువు లేవి?

గు—ఇవి:—"పామరజనులకు విద్య గఱపకుండుట, గ్రామముల శుచిత్వారోగ్యములను గాపాడుచు వానిని నసిగా నుంపకుండుట, దరిద్రజనులను దగుకుటీరములలోఁ బెట్టకుండుట, కుసీదకులబాధనుండి కృషీవలుల రక్షింపకుండుట, సేద్యకాండ్ర కనుకూలముగా అప్పులిచ్చుకొట్లను స్థాపింపకుండుట, వ్యవసాయమునకుఁ దగుప్రోత్సాహము గావించి దాని నభివృద్ధిపఱుపకుండుట, దేశీయవృత్తివ్యాపారమును బోషింప నుపేక్షించుట, ట్రామ్వేలు విద్యుద్దీపవ్యాపారములు మున్నగు దేశమందలి పెద్దపనులను లాభాపేక్షతో వచ్చి బ్రిటిషువా రాక్రమించుకొనుట నాపకుండుట, లండనువారికి లాభకరముగా నాణకవినిమయప్రచారపుటేర్పాటులు గావించుట మానకుండుట."

శి—పెద్దజాబితా యిచ్చినారే! స్వదేశవస్తుపోషణమునకై విదేశవస్తువులమీఁద బరువైన దిగుమతిటారిఫులు వేయుట మంచిదందురుగదా, అట్లు చేసినమాత్రమున నిండ్లలోఁ బూర్వము మనవారు చేసికొనుచుండెడు చేతిపనులు—చచ్చిపడిపోయినవి—మరల బ్రతికి తలయెత్తునా?

గు—ఎత్తకేమి? పోనీ, యెత్త వేయనుకొందము. ఎత్తకున్నను, స్వదేశయంత్రకర్మాగారము లభివృద్ధినొందవా? అందుఁ బనిచేయుటకుఁ బల్లెలనుండి కొందఱుజనులు రారా? అట్లు వచ్చుటవలనఁ బొలములపై జనసమ్మర్దము తగ్గదా? మిగిలినజనులకుఁ బండినపంటవలనఁ బూర్వముకంటె నెక్కువ తిండి దొరకదా?

శి—ఔను, పంటవలనఁ గొందఱకును, కూలివలనఁ గొందఱకును, కూడు దొరకఁగలదు.

గు—పరిపాలనదోషములవలనఁ బదార్థోత్పాదనశక్తి ప్రజలకు నానాఁటికి తగ్గుచున్నప్పటికిని, మనజాతిమడియ కింకను జీవింపఁగలుగుచో, నది యత్యాశ్చర్యకరము—కేవలము పరమేశ్వరానుగ్రహసూచకము.

శి—అయ్యో! అట్లనుచున్నారేమి?

గు—నేనుగాదు, రమేశచంద్రదత్తుగారే చెప్పుచున్నారు, వినుః- "చేతిపనులు చెడఁగొట్టఁబడినవి, కర్షకులపైఁ బన్ను లమితముగాఁ బడినవి, ఆదాయపుమొత్తములో నూఁడవవంతు దేశమునుండి పరదేశమునకుఁ బంపఁబడుచున్నది—ఇట్టిస్థితిలోఁ బ్రపంచములోని యేజాతివారికైనను శాశ్వతదరిద్రదశయును మరలమరలవచ్చు కఱవులబాధలును సంప్రాప్తింపకమానవు. ఆయవ్యయనైసర్గికధర్మములు ఏషియాకును యూరప్పునకును సమానముగానే యుండునుగాని భిన్నముగా నుండఁజాలవు. ఇండియా నేఁడు దరిద్రదేశమగుటకు అప్రతిహతములైన యాయర్థశాస్త్రనియమములే కారణములు. ఇట్టిపరిస్థితులలో ఇండియా యైశ్వర్యవంతమై వర్ధమానమగుచుండు నెడల నది యతిమానుషమైన యద్భుతదైవసంఘటన మగును." మఱియు........

శి—ఇంక నెవరైన నట్లు చెప్పిరాయేమి?

గు—సరిగా నట్లుగాదు, ఆభావమిచ్చుమాటలే మంత్రి మెగ్డానల్డుగా రిట్లుపలికినారు:—"ఏదియెట్లున్నను మొత్తముమీఁద మనపై రెండు నేరములు రుజువుపఱిచి మోపవచ్చును—1 మనపరిపాలన మమితవ్యయాత్మకము. 2 హిందూదేశమునెడల మనము నీచముగాఁబ్రవర్తించినాము."

శి—మంత్రిగారినోటినుండి కడుగాటుమాటలు వచ్చినవే! కాని దారిద్ర్యము! దారిద్ర్యము! అందురుగదా, మనదేశములో మనుష్యుని సగటాదాయ మెట్లున్నది?

గు—ప్రభుత్వమువారి యాజ్ఞపైఁ దయారుచేయఁబడిన లెక్కల నుబట్టి యిచ్చిన యీక్రిందియంకెలను గనుము:—

| సంవత్సరము. | సాలునకు మనుష్యునికి వచ్చు సగటురాబడి. | వస్తువులధరలు. | సిసలైన సంఃరపు సగటురాబడి. |
|---|---|---|---|
| 1881 | 27 రూ. | 100 | 27 రూ. |

| | | | |
|---|---|---|---|
| 1901 | 30 రూ. | 120 | 25 రూ. |
| 1921 | 74 రూ. | 378 | 19.7 రూ. |

శి—ప్రథమదృష్టిని వచ్చుబడి హెచ్చుచున్నట్లగపడునుగాని దానిని పదార్థమూల్యముల హెచ్చుతో సంప్రతించి చూడఁగా నంతకంతకుఁ బడిపోవుచున్నదని చెప్పకతీఱదు.

గు—ప్రజాపరిపాలనముక్రిందనున్న దేశములో నధికపాలనవ్యయ మభివృద్ధిసూచకమని చెప్పవచ్చునుగాని సరకులవెలలు హెచ్చినవనుహేతువు చెప్పి యున్నతోద్యోగుల వేతనాదుల నెక్కువచేసి వ్యయాధిక్యమగపఱచుమనదేశములో నట్లనుకొనుటకు వీలులేదు. సర్విల్యమ్‌హంటరుగారి యీక్రిందిమాటలు వినుము—"పైరాజులు దండెత్తివచ్చి దేశముపైఁ బడుదురనుభయమును బాపినాము, అరాజకత్వవిలుంఠనవిప్లవములుండుచోట్ల నియమనిబంధనములుచేసి ప్రజలు నిర్భయముగా శాంతముగా బ్రతుకునట్టియేర్పాటులు చేసినాము, యావద్దేశమును పాఠశాలలతోను న్యాయస్థానములతోను రోడ్లతోను రెయిల్రోడ్లతోను కాలువలతోను నింపి ప్రజావర్గమునకును వాణిజ్యమునకును ప్రోత్సాహము గలిగించినాము—అని చెప్పినఁ బ్రయోజనములేదు. ప్రజలకుఁ దినుటకుఁ జాలినతిండి లేనప్పుడును మన పరిపాలనవ్యయభారము దేశము భరింపఁజాలనప్పుడును అవి యన్నియు వ్యర్థప్రలాపములు."

మఱియొక యన్యాయ మున్నది.

శి—అదియేది ?

గు—ప్రజలు చెల్లించుపన్నులనుండి పెద్దపెద్దవేతనములు పుచ్చుకొని, బుద్ధిమంతులు మంచి లోకజ్ఞతను వ్యవహారానుభవమును సంపాదించుకొని, యుద్యోగములు చాలించుకొనినపిమ్మట దేశములోనేయుండి, తమ బుద్ధిబలానుభవబలముల నుపయోగించి తమ తరువాతివారికి చక్కనియాలోచనలు చెప్పి, దేశపురోభివృద్ధికిఁ దోడ్పడుట సర్వలోకసామాన్యసంప్రదాయము.

ఇఁక మన దేశపుఁ బెద్దయుద్యోగస్థులైనదొరలు హిందూదేశము సొమ్ము తిని, దానితోఁ బరిపాలనానుభవము సంపాదించుకొని, యుద్యోగానంతరము తుట్టతుదకుఁ దమదేశమునకుఁబోయి పెన్షను లనుభవించుచు నటఁ గూరుచుండి, తమబుద్ధిని వ్యవహారజ్ఞానమును మనదేశక్షేమముకై యుపయోగింపక అన్యదేశాభివృద్ధికై యుపయోగించుచున్నారు. ఇది యన్యాయముగాదా ?

శి—ఔను, దురన్యాయమే. మనకీదారిద్ర్యవిముక్తియు ధనప్రాప్తియు నెట్లు సిద్ధించునని పెద్దలగు నర్థశాస్త్రజ్ఞులు చెప్పినారో సెలవిండు.

గు—బ్లంటుగా రిట్లు చెప్పినారు :—"రైతులను ప్రస్తుతము పీడించుచున్న యనశనబాధను బోఁగొట్టి వారిస్థితిని బాగుపఱచుట శాసనములచేతఁగాదు. కలకత్తాలోను లండనులోను గూడ నిప్పుడు బలవత్తములై హిందూదేశమునకుఁ బ్రతికూలములై పనిచేయుచున్న స్వహితపరతాదురభిమానములు తొలఁగిపోయినఁగాని యాప్రయోజనము నెఱవేఱఁజాలదు. అంతయనర్థమునకును మూలకారణ మాయవ్యయనిర్ధారణమునందలిలోపముగాని శాసననిర్మాణసభాదోషముగాదు. ఆవశ్యకమైన యాయవ్యయసంస్కరణము లేనియితరమార్గములన్నియు నిష్ఫలములు."

శి—మెగ్డానల్డుమంత్రిగా రీవిషయమున నేమైనఁ జెప్పినారా ?

గు—ఇట్లు చెప్పినారు:—"బ్రిటిష్ ప్రాజ్య మిప్పు డిండియామీఁద వేసి దానికే యంటఁగట్టుచున్న వ్యయభారము న్యాయ్యముగాఁ బంచి సరదునెడల, హిందూదేశపాలకులు గొప్పసంస్కారములు ప్రారంభించి దేశభాగ్య మభివృద్ధినొందింపఁగలరు; అది చాలును, అంతకంటె నెక్కువ మేమియుఁ జేయనక్కఱలేదు."

శి—కుమారస్వామిపండితుఁడుగారి యభిప్రాయమేమి ?

గు—హిందూదేశక్షేమమే హృదయములందిడుకొని యధికారులు తదనుగుణములైన సంకల్పములు చేసికొని పరిపాలనకృత్యములు

సాఁగించుకొనుచున్న దక్క హిందూదేశపుటాదాయము తత్ప్రజోపయోగకరముగా వినియోగింపఁబడనేరదు. పన్నురూపముగావచ్చు ప్రతిరూపాయయును ప్రజలయొక్క వస్తూత్పాదనశక్తిని వారియుత్సాహక్రియాశక్తులను హెచ్చుచేయుచుండవలెను.

శైశవావస్థలోనున్న దేశీయవ్యాపారములు శుల్కములవలనఁ బరిపోషింపఁబడునప్పుడు, శుల్కగ్రహణముచేత ఆయమూలముల కెట్టి హానియుఁ దటస్థింపనప్పుడు, తిండిలేక పస్తుండు ప్రజపై నతివ్యయాత్మకమును భోగపరాయణమును అగు దేశపరిపాలనమును భరించుభారము పడనప్పుడు, హిందూదేశమాత యొసఁగిన యాతిథ్యమువలనఁ గుబేరులైనవారు దేశపరిపాలనభారవహనముఁ బాల్గొన నిర్బంధింపఁబడునప్పుడు, పూర్ణప్రతిఫలము ప్రజలకు వచ్చునట్లు హిందూదేశపుటాదాయము వ్యయింపఁబడునప్పుడు, ప్రభుత్వమువారు దరిద్రుల యక్కఱలను గనిపట్టి ప్రజాసేవాబుద్ధితో—అది తమ విహితధర్మమని—ఆయక్కఱలనుదీర్చునప్పుడు, పాలనప్రవాహపథములు దేశక్షేమమునకుఁ బ్రతికూలముగాఁ బ్రసరింపనప్పుడు, ఇటుపోవుదమా అటుపోవుదమా అను సందేహము పొడముపట్లనెల్లఁ బరిపాలకులు హిందూదేశక్షేమకరమైన మార్గమునే యెన్నుకొని యవలంబించిపోవునప్పుడు—అప్పుడే, యార్యావర్తమున కర్థాభివృద్ధి కలుగఁగలదు. ఆయవ్యయనిర్ణయాధికారమంతయుఁ బ్రజలచేతులలోనికి వచ్చినఁగాని యట్టిపనులు జరుగఁజాలవు.

ఈమాటలతోఁ గుమారప్పగా రీవిషయమును ముగించినారు. మనముగూడ నేటిప్రసంగ మింతటితో విరమింపఁజేయుదము.

శి—చిత్తము ! నమస్కారము !

గు—సుఖీభవ !

———

# ౧౦. గురుశిష్యసంవాదములు.



## III

శి—నమస్కారము! తమరు రమ్మని నాకు వర్తమానమంపినా రఁట, యేల?

గు—దీర్ఘాయురస్తు! కూరుచుండుము. 'భారతీ' సేవకువలెనే నాకు నీవు 'లక్ష్మీ' సేవకుఁగూడఁ దోడ్పడుదువేమోయని.

శి—ఎట్లు? ఏవిషయమున?

గు—'గృహలక్ష్మి' పత్త్రికవా రొకవ్యాసమువ్రాసి పంపుఁడని నాకొకజాబు వ్రాసినారు. యథావకాశముగా నొక "గురుశిష్యసంవాదము" ముందువ్రాసి పంపెదనని నేను వారికి మరల వ్రాసినాను. కాని యఱువదియైదవయేఁడు రాఁబోవుచున్న నావంటివానికి అన్నమాట వెంటనే చెల్లించుకొనుట మంచిదని తరువాతఁ దోఁచినది.

శి—వ్యాసమునకు నాసాహాయ్యమేల? మీరొకరే వ్రాసి పంపవచ్చును!

గు—వ్యాసమున కొకఁడుచాలునుగాని వాదమునకుఁ గనీస మిద్దఱైనఁ గావలయుఁగదా! వ్రాసిపంపెదనని నే మాటయిచ్చినది సంవాదము గాని వ్యాసముగాదు.

శి—సరే! అట్లేకానిండు. ఇంతవఱకు జరిగినసంవాదములు శిష్యప్రేరణమువలన జరిగినవి. ఈసంవాదము గురుప్రేరణమున జరుగనున్నది. ఎత్తుకొనవలయు విషయమేది?

గు—'గృహలక్ష్మి' స్త్రీజనాభ్యుదయాభివృద్ధికై ప్రకటింపఁబడుచున్న చక్కనిపత్త్రిక, అందుచేత మనవిషయముకూడ స్త్రీజనోపయోగకరమైనదిగానే యుండుట మంచిది.

శి—ఏదేశములో స్త్రీలు గౌరవింపఁబడి సంతోషముతో మెలఁగుచుందురో ఆదేశము శారదేందిరలకు సంచారస్థానమై సర్వసంపత్సమృద్ధమై కలకలలాడుచుండునని గ్రంథములు చెప్పుచున్నవి.

గు—ఔను ఆమాట సత్యమే. కాంతలకు విద్యాగౌరవములు కొఱతగానుండుట మనదేశదుర్దశకుఁగల కారణములలో నొకటి.

శి—దేశము దుర్దశలోనుండుట నిజమేకాని స్త్రీలు విద్యాగౌరవవిహీనలై యున్నారను మాటమాత్రము వివాదాస్పదము. ఇప్పుడు భారతదేశస్త్రీలలోఁ గవితావిశారదలున్నారు, పాండిత్యబిరుదాంచితలున్నారు, వివిధపరిపాలనాశాఖలలోఁ బ్రవేశించి వన్నెయు వాసియుఁ గాంచుచున్నవారున్నారు. దేశభక్తిలో స్వార్థపరిత్యాగములో కష్టసహనములో శౌర్యసంపత్తిలో మేము పురుషులకుఁ దీసిపోము—అని క్రియారూపమునఁజూపి ప్రజాప్రశంసాపాత్రములగుచున్న మహనీయులున్నారు.

గు—ఎప్పటినుండియున్నారు ? ఎంతమందియున్నారు ? ఈ మనయజ్ఞానభూయిష్ఠప్రజాక్షారాంబుధి పదిగుప్పిళ్లపంచదారతో తియ్యపడఁగలదా ? ఇప్పుడున్న విదుషీమణులసంఖ్య యెంతగనో పెరిఁగినఁగాని కుదికిలఁబడియున్న మనభారతమాత మరలలేచి తలయెత్తఁజాలదు. మొన్నమొన్నటివఱకు మనస్త్రీలకు విద్యాగంధమేలేదు. స్త్రీలకు విద్యగఱపుట తప్పు, అనర్థకారి—అన్నరోజులమాట లింకను చెవులలో మ్రోఁగుచునేయున్నవి, విస్మృతిలోఁ బడలేదు.

శి—కాని—మనలోమనమాట—స్త్రీవిద్య యెంతమాత్ర మఖ్యేమకరముగాదనియే మీయభిప్రాయమా ? బడిచదువువలనఁ జెడిపోయిన పడఁతులులేరా ?

గు—పురుషుల-లోనున్నట్లే కొందఱుండవచ్చును. విద్యావంతులైన మగవారిలో లంచములుదినునుద్యోగులు, అసత్యవాదులగు నధికారులు, కచ్ఛశుద్ధిలేని కళావిదులు, నీతిలేనిపండితులు, ఎందఱున్నారో

యెఱుఁగవా? ఆదోషము నీవు విద్యకారోపింతువా అది దుష్ప్రకృతి మూలకమందువా ? జ్ఞానము దుర్వినియోగముచేసినచో ననర్థకారియగును, సద్వినియోగముచేసినచో సర్వసౌఖ్యప్రదాయియగును.—ఈమాట స్త్రీపురుషు లుభయులపట్లనను సమానముగానే వర్తించును. మగవారికుపయోగించువిద్యలు విశిష్టముగా మగువల కేహానియునుజేయవు. దురుపయోగముచే ధనాదులుమాత్రము కీడుచేయవా ? ఆకారణముననర్థోపార్జనము మానుకొన్నవా రెందఱున్నారు ? అజీర్ణభయముచే నన్నత్యాగముచేసినవా రెందఱున్నారు ? ఎప్పుడో చేయి తెగవచ్చునని కత్తిపీఁట వాడుకొనక వదలిపెట్టినకాంత లెందఱున్నారు ?

శి—కావునఁ బురుషుఁడునేర్చుకొను విద్యలన్నియు స్త్రీ నేర్చుకొనవచ్చుననియే మీయభిప్రాయమైనట్లు చూపట్టుచున్నది.

గు—ఏవిద్యాభ్యసనాస్వాతాసక్తతలైనను దేహారోగ్యపాటవములఁబట్టి, బుద్ధిసూక్ష్మతనుబట్టి, సంస్కారబలమునుబట్టి, అభిరుచులస్వభావతీవ్రతలఁబట్టి, నిర్ణయింపవలయునుగాని స్త్రీపురుషభేదమునుఁబట్టిగాదు.

శి—అట్లైన నశ్వారోహణమల్లవిద్యాధనుర్విద్యాదులు తరుణులు యథేష్టముగా నభ్యసింపవచ్చునా ?

గు—చిక్కుప్రశ్నలువేసి నన్ను "చిత్తా" చేయఁ జూచుచున్నావుకాఁబోలు ! తురగారోహణప్రవీణలగు సరోజాక్షులును, బరువుబండి గుండెపై నుండి పోనిచ్చుకొని యద్భుతశరీరసత్త్వముచూపు నలరుఁబోండ్లును, సజ్యచాపహస్తలై సమరములో శత్రుల డీకొనఁగల సత్యభామలును, గొందఱున్నప్పటికిని—సహజశరీరనిర్మాణపాటవములలో స్త్రీపురుషులకు భేదమేలేదని చెప్పి నేఁ బ్రౌఢవాదము చేయువాఁడనుగాను.

శి—ఆభేదము గణనీయమైనభేదముగాదా !

గు—వాయువేగమనోవేగములతోఁబోవు రెయిలుమోటరుబండ్లును ఆకాశయానములును గలకాలములో, చంటిపిల్లవానిచేఁగూడఁ జటి

కలో శతృశతములను శలభములవలెఁ జంపింపఁగల యంత్రపుపిరంగులు గల యీరోజులలో, మోటుబల మంతగణనీయముగాదని నేననుకొనుచు న్నాను. పౌరుషము మనోనిష్ఠమైన ధర్మముగాని శరీరనిష్ఠముగాదు. నేఁటి పరిస్థితులు పరికించినచో శౌర్యధైర్యసాహససంపత్తిలోఁ బురుషులనుమిం చు స్త్రీలున్నారని నీవు సులభముగాఁ గ్రహించుకొనఁగలవు. అవసరము వచ్చునెడల నంగనలు దేనికిని వెనుదీయరు. కనుక శరీరములోఁగానిపించు స్త్రీపుంసభేదము మనోనిర్మితిలోలేదని నీవు రూఢిగా నమ్మవచ్చును.

శి—మీరు చెప్పినమాటలు నిజమేకాని ఆరోగ్యజవసత్త్వములలో మనస్త్రీ లన్యస్త్రీలకంటె నెందుచేతనో లొచ్చుగాఁ గాన్పించుచున్నారు.

గు—పురుషులయవస్థయు నట్లేయున్నది! దాని కతిబాల్యవివా హములు ప్రధానకారణములు. ఇతరదేశీయబాలికలట్లు చదువులలోఁ బడి యాడుచుపాడుచు నింగిపై నెగురుపతంగములవలెఁ జిత్తోల్లాసముతో నుండవలయుచిఱుప్రాయమునఁ బిల్లలకుఁబెండ్లిసంకెలలు, పదుమూఁడవ యేఁటఁ బ్రసవకష్టమును మాతృత్వప్రాప్తియును, కానుపుపైఁ గాన్పువల నఁ బసితనములో వార్ధకచిహ్నములు, గర్భసంబంధవ్యాధులు, అకాల మృత్యువు—ఈయనర్థములు మనదేశములో మిక్కుటముగాఁ గన్పట్టు చున్నవి.

శి—ఔను, వీనివలన విద్యానష్టమేకాక యారోగ్యనష్టప్రాణనష్ట ములుకూడ సంభవించుచున్నవి.

గు—అంతేకాదు, నానాఁటికి హిందూజాతి యల్పాయుష్కజా తియు నిస్సత్త్వనిర్వీర్యజాతియు నగుచుండుట కీబాల్యవివాహములే ప్రబల హేతువులు. అపరిపాకవయస్కలగు పదుమూఁడేండ్లబాలికకును పదునే నేండ్లబాలకునకును గలుగుశిశువు అంగుష్ఠప్రమాణార్భకుఁడుగాక ఆజాను బాహువుగాఁ బెరుఁగుశిశు వెట్లుకాఁగలఁడు? అట్టి విద్యావిహీనపుఁదల్లి పోషణమున నుండవలయుబిడ్డఁడు మందబుద్ధియు భీరువునుగాక మేధావి యు శూరుఁడును నెట్లుకాఁగలఁడు?

శి-బాల్యవివాహములఁ బ్రతిషేధించుచు మొన్న గావింపఁబడిన పెండ్లిచట్టము మంచిదిగాదని కొందఱుపెద్ద లేలఘోషచేసినారో నా కె ఱుకపడకున్నది !

గు—శారీరారోగ్యశాస్త్రమర్యాదావిధు లెట్లున్నను చట్టము ధర్మశాస్త్రమునకు విరుద్ధమనియుఁ బితృదేవతలయుత్తరగతులకుఁ బ్రతిబంధకమనియు మనహిందువులలోఁ గొందఱు వాదించినారు; మంచికిఁగానిం డు చెడ్డకుఁగానిండు ప్రభుత్వమువారు మతవిషయములలో వ్రేలుపెట్టఁ గూడదని కొందఱు చెప్పినారు. బాలవితంతుబాధ పోఁగొట్టుట శాసనము యొక్క ముఖ్యోద్దేశము, మాఖురానులో వితంతూద్వాహమున కభ్యనుజ్ఞ గలదుకాన బాల్యవివాహములు మాకు సెబ్బరచేయఁజాలవు—అని కొందఱు మహమ్మదీయులు చెప్పినారు.

శి—వారట్లుచెప్పినారు, వీరిట్లుచెప్పినారు—అని గోడమీఁదిపిల్లి వాటముగాఁ దప్పించుకొనఁజూడకుండ ఈవిషయమున మీయభిప్రాయ మేమో సువిస్పష్టముగా సెలవిండు.

గు—నాయనా ! వస్తువునకు నీడవలె నెట్టిసదర్థమునకైనను ఆనుషంగికముగావచ్చు ననర్థ మంతోయింతో యుండకమానదు. దుర్వినియుక్తమైనవిద్యవలన విపరీతఫలము సిద్ధించునని యిప్పుడేకాదా యనుకొన్నాము. ప్రౌఢావివాహములవలనఁ దటస్థించుచిక్కులు కొన్ని యుండవచ్చును, కాని యవి యతిబాల్యవివాహములచే వచ్చుచున్న మహావిపత్తులతోఁ బోల్చిచూచినచో అద్రులయెదుట నణువులవలె నెంతమాత్రము పరిగణింపవలయుకష్టములుగాఁ గానిపింపవు.

శి—కనుకఁ గన్యలను యుక్తవయస్సువచ్చువఱకు నట్టేపెట్టి పిమ్మట పరిణయముగావించుటయే కర్తవ్యమని తేలినది.

గు—ఆ! మమ్మాటికిసట్లే! పరిణయవాంఛ హృదయములలో నంకురింపకముందు, పరిణేతులబాధ్యతలు చక్కఁగామనసులకెక్కకముందు,

పెద్దలముద్దుకై ముక్కుపచ్చలారని చిన్నపిల్లలకుఁ జేయుపెండ్లి క్రీడాప్రాయమైన బొమ్మలపెండ్లిగాని శ్రేయోదాయకమైన పెండ్లిగాదు.

శి—ఆరోగ్యశాస్త్రమర్యాదానుసారులై సానురాగసంసారకార్యనిర్వహణమునకు సర్వవిధముల ననుకూలములగు యుక్తవయోవివాహములు కూడవని కొందఱైన నేలచెప్పవలెను ?

గు—చిరకాలమునుండి ప్రచారములోనుండుటచే నలవాటుపడిన యాచారవ్యవహారములుమాని తద్వ్యతిరిక్తములగు క్రొత్తవాని నవలంబించుట మనసున కెంతోకష్టముగా నుండును. అది సామాన్యమానవప్రకృతి.

శి—రజస్వలావివాహములు బ్రాహ్మణులకుఁ గూడనివిగాని కాఁపులకుఁ గానివికావుగదా! అట్టిచో శూద్రులు పరంపరగావచ్చు తమ యాచారములు మానుకొని బ్రాహ్మణుల ననుకరించి బాల్యవివాహములు చేయుచున్నా రదెందుచేత ?

గు—కులముచేఁగాని విద్యావిత్తాధికారాదులచేఁగాని తమకంటె నధికులగు వారినడవడి నవలంబించి నడవఁజూచుటయును బ్రజాసామాన్యప్రకృతియేకనుక. గొప్పవారెప్పుడును దమప్రవర్తనములో బహు జాగరూకులై యుండి యన్నివిషయములలోను లోకులకు సచ్చర్యాప్రదర్శనమే కావించుచుండవలయును, అట్లుచేయనిచోఁ బెక్కనర్థములు సంభవించును—అని పెద్దలు చెప్పుదురు. చూచుసదాచారములు సులభముగాఁ బట్టువడవుగాని దురాచారము లిట్టెయనుకరింప వీలుగానుండును. గురువుగారిబుద్ధియు శీలమును శిష్యులు సంపాదించుకొనుట కష్టముగాని ఆయన వంకరనడకయు ముక్కుమాటలును సస్యాభ్యాసమును సంగ్రహించు టతిసుకరము. ఆంగ్లేయుల వ్యవహారనైపుణి, పట్టుదల, దూరదృష్టి, సకాల సక్రమకార్యనిర్వాహదక్షత—ఇవి మనకంటుటలేదుగాని వారికాఫీ తేనీళ్ల త్రాగుడులు, వారి షరాయికోటులనీటులు, వారి మెడపట్టీలబెడఁగులు, వారి బూట్లమిసమిసలు, వారి వసారాటోపీలు, ఎడమచేతిగోళ్లు కొఱుకు

కొనుటలు, నాలికతోనాకి యుత్తరపుసంచులు జిగురుబిళ్లలును అంటించు కొనుటలు—ఇట్టివెన్నియో మన కలవడినవి. ఆరీతిగానే బ్రాహ్మణుల నిత్య స్నానము ఆహారశుద్ధి మున్నగు సల్లక్షణములు శూద్రులకలవడుట కష్ట ముగానున్నదిగాని కన్నులు దెఱవని కూనలకుఁ బెండ్లిచేయుదురాచారము మాత్ర మిట్టే పట్టుపడినది.

శి—మన దేశమువంటి యుష్ణప్రదేశములలో వివాహ వాంఛ లేఁ తవయసుననే జనించునుగానఁ బెంశింఁడ్లు పిన్న వయసులోనే కావింపవలెను అని కొందఱనుచున్నారు. దానికి మీరేమందురు ?

గు—కామోదయమగువయసు కొంతవఱకు శీతోష్ణస్థితినిబట్టి యుండుననుమాట కేవలమసత్యముగాదు, కాని యది అతిబాల్యవివాహా వశ్యకతను స్థాపింపఁజాలునంత బలముగల సత్యముమాత్రముగాదు. యుక్త కాలమునకుఁబూర్వమే కామోద్రేకముగలుగుటకు యథార్థమైన ప్రబల హేతువులు కొన్ని యున్నవి.

శి—అవియేవి ?

గు—అవేవో చెప్పకముందు కొన్ని సంగతు లుపోద్ఘాతముగాఁ జెప్పెదను విను—ఆహారనిద్రాకామములు పశువులకువలె మనుజులకును సహజముగానున్నవి. జ్ఞానవంతుఁడుగనుక మానవుఁడు వానిని నియతము గా సాఁగించుకొని నిపుణముగా జీవనము గడపుకొనవలెను. కాని సామా న్యముగా మనుష్యులు పామరులై భగవద్దత్తమైన తమబుద్ధిని దుర్విని యోగముచేసికొని కృత్రిమసాధనములచే విషయోపభోగముల నమితము గాఁ బెంచుకొని యిహపరములరెంటికిని జెడి పశువులకంటెను అధములని యనిపించుకొనుచున్నారు.

శి—అదెట్లు ?

గు—సహజానుబోధప్రేరితములై యుక్తకాలమున యథోచితము గా క్షుత్పిపాసాకామశాంతులు గావించుకొని యంతటితోఁ దనివినొంది

తమమనుగడ పశువులు సాఁగించుకొనుచుండఁగా, మనము బుద్ధిచే ననేక దురుపాయకల్పనములు గావించుకొనుచుఁ, దృప్తియనుమాటలేక, భోగములను—వానితోపాటు రోగములను—వృద్ధిచేసికొనుచు, ననేకబాధలనుభవించుచున్నాము. అందుచేత శరీరారోగ్యానుకూలములగు విషయసుఖములనుమాత్రమే యనుభవించు పశ్వాదులు అతిభోగులగు మనుష్యులకంటె నీతిమంతములు, సుఖజీవులు—అని చెప్పవలసివచ్చుచున్నది. ఆత్మసంయమము వలనఁ గలుగు పరమార్థసుఖమునుమాటయే మఱచి మనమంతకంతకుఁ బాడగుచున్నాము—అని ప్రాజ్ఞులు చెప్పుచున్నారు.

శి—తత్త్వోపదేశప్రవాహములోఁబడి కొట్టుకొనిపోకుండ ఈపాటికి గట్టెక్కి మనము మరల మనప్రస్తుతవిషయమునకు వచ్చుట మంచిదని మనవిచేసికొనుచున్నాను.

గు—నాయనా! తత్త్వోపదేశమన్న నీ కంతతలనొప్పిగానున్నదా? పోనీ! నీయిష్టముప్రకారమే చేసెదను.

శి—అకాలకామప్రేరకములైన యథార్థకారణములు సెలవిచ్చెదనని చెప్పినారు!

గు—ఆమాత్రపుమతి భగవత్కృపవలన నింకను నిలిచియున్నది, జ్ఞాపకావశ్యకతలేదు. భూపతనమాదిగాఁ బెండ్లిమాటలఁగూర్చి వినుటయొకమనహిందువులలోనే కాన్పించుచున్నదని మహాత్ముఁడు చెప్పినాఁడు.

శి—నాకేమియు బోధపడుటలేదు.

గు—ఎంతదగ్గఱగానున్నను మనముఖము మనకుఁ గాన్పింపనట్లు లెవరిదోషములు వారికి సులభముగా గోచరింపవు. బిడ్డ పుట్టుటతోనే "మీకల్లుఁడు గలిగినాఁడమ్మా! ఇదిగో మీకోడలు, చూడవే!" యను వేళాకోళపుఁ బెండ్లిమాటలకు మనవా రుపక్రమించుట మనకు నిత్యానుభవములో నున్నది. తరువాత శైశవక్రీడలలో బొమ్మలపెండిండ్లును, కొమ్మలు వియ్యాలందుటలును! ఈబాల్యసంస్కారము లూరకపోవు.

శి__నిజమే.

గు — మఱియు నీక్రింది యితర హేతువులు కొన్నియున్నవి :— నిత్యము గృహములో పిల్లలకు అనియంత్రితవిషయోపభోగప్రదర్శనము గావించు పెద్దలచర్యలును, కామవికారద్యోతకములగు పరిహాసవాక్యములును లఘుప్రసంగములును, విద్యాభ్యాసంగముచేయు వయస్సులో శశాంకవిజయము హంసవింశతి శుకసప్తతి ఇత్యాద్యసద్గ్రంథముల పరిచితియును.

శి—అయ్యో ! ఆద్యంతములందుఁ జేర్కొనఁబడిన పుస్తకములు మహారసవంతములుగానుండునే !

గు—ఔను! కాని ఆకవితాలాలిత్యమే తియ్యని వాజీకరణలేహ్యమువలె యువజనుల కకాలానర్థకరకామోద్దీపనకారియగును. ఈగ్రంథములవంటివే చిత్తవిక్షేపకారకములగు నాటకప్రదర్శనములును సినిమా లను చలప్రతిమాప్రదర్శనములును. ఈమాట మహాత్ముఁడుగారే యొకచోటఁ జెప్పినారు.

శి—మీావన్నియు విచిత్రపుమాటలు ! ప్రపంచములోఁ బ్రజోత్పత్తి గావలయునా ! దానికిఁ బ్రేరకముగాఁ గామసుఖముండవలెనా ! పెండ్లిమాట చెవిని బడఁగూడని బూతుమాటయై, కడుపునిండఁదినినఁ గామవికారములు గలుగుదో నీక్రప్రపంచములో బ్రతుకుటయెట్లు? సుఖపడుటయెట్లు? అన్నియునుడిగి కాటికిఁగాళ్లు సాఁచుకొనియున్నవా రెన్ని శ్రీరంగనీతులైనఁ జెప్పవచ్చును.

గు—శాంతింపుము ! మొగ మెఱ్ఱచేసికొనకు ! ఔను, కామసుఖము ప్రజోత్పాదనప్రేరకమే. యౌవనావిర్భావసమయమందు సహజముగా స్త్రీపురుషుల కన్యోన్యసంభోగవాంఛ యంకురింపకమానదు. దానికిఁ బ్రత్యేకప్రయత్నములును, జారత్వకృత్యములు కన్నులఁగట్టినట్లు చిత్తాకర్షకముగా నభివర్ణించి చూపుగ్రంథములును, అక్కఱలేదు. అకాలకామోద్రేకమును అనుచితచిత్తప్రవృత్తులను అరికట్టుటకే సదుపదేశములును

సద్గ్రంథములును సన్నియమములును గావలయును. అన్నముఁ దినుమని యు నిద్రపొమ్మనియు నేగురువును గఱపనక్కఱలేదు. అవి నైసర్గికశరీరధర్మములు. అకాలభుక్తి అహితపదార్థభుక్తి అమితభుక్తి కూడవు, హానికరములు—అని చెప్పుటకే సదుపదేశకులు గావలెను. హితవాక్యములు సాధారణముగాఁ బ్రియవాక్యములుగావు గనుక నాపై నీకింత కోపము వచ్చినది.

శి—సరి సరి! కోపములేదు గీపములేదు. పదుచుతనపుతొందర క్షమించి సంభాషణము సాఁగింపుఁడు.

గు—ఆహారములోఁగూడ నలిజాగరూకత యావశ్యకము. మనము తఱచుగానుపయోగించు మిరెపకాయలు మున్నగు తీక్ష్ణపదార్థములు మనస్సునోఁ దీవ్రప్రవృత్తులు గలిగించుననియు, సాత్త్వికాహారము శ్రేయస్కరమనియు మనశ్శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇంకొకమాట! బ్రహ్మచర్యాభావమువలననే భారతభూమి కనేకాపాయములు సంభవించినవి, సంభవించుచున్నవి—అని పెద్దలయభిప్రాయము.

శి—అయినైన స్త్రీలుగూడ వివాహములు చేసికొనకుండ నుండవచ్చునుగాఁబోలు!

గు—ఏలయుండఁగూడదు? పెండ్లియాడి సంతానముగనుటయే స్త్రీపురుషులకుఁ బరమార్థముగాదు. అంతకంటె నధికతరములై ప్రశంసనీయములైన ప్రయోజనము లనేకములున్నవి. దీర్ఘరోగములతోను దుష్టరోగములతోను దీసికొనుచుండువారు, అంగవైకల్యముచేఁ గురూపులైనవారు, కటికిదరిద్రులు, ముదురువయస్సులో భార్యాభర్తలఁ గోల్పోయిన పురుషులును స్త్రీలును—అవివాహితులుగానుండి యుదారతరచిత్తప్రవృత్తులతో దేశోపకారాదిపూతకృత్యములకుఁ దమదేహబలబుద్ధిబలనీతిబలములన్నియు ధారవోయుచు జీవన్ముక్తసలిపి యంతమునఁ బరమేశ్వరసాన్నిధ్యమును బ్రాపించుట పరమోత్కృష్టమైనపని.

శి—వారి కిహసుఖములేవి పాపము!

గు—ఓయి వెఱ్ఱివాఁడా! వారివే నిజమైనసుఖములు! అహం మమకారములఁ ద్యజించి "పరోపకారార్థమిదంశరీరం" అను నార్యోక్తి ననుసరించి పోవుచున్నామను నెఱుకవలనఁగలుగుతుష్టికిఁ దుల్యమైన యానంద మింకొకటిలేదని యనుభవజ్ఞులు చెప్పుచున్నారు. అట్టి మహాత్ములకును మహాత్మురాండ్రకును పామరజనదృష్టిని గష్టములైనవే సుఖములుగాఁ బరిణమించును; అట్లుకానిచో నెన్నికష్టములు వచ్చి పైఁబడుచున్నను సన్మార్గవర్తు లెప్పుడును దమమార్గమునే యంటిపట్టుకొని పీడకుందుటకుఁ దగిన హేతు వగపడదు. జీర్ణమనశ్శరీరములను నిత్యము పునఃపుష్టములఁ జేయుట కుపయోగపడవలయు అన్నసారము నన్యథా తుచ్ఛశరీరసుఖాభాసములకై వ్యయించి, దుర్బలసంతానముఁగని దేశమును నరకీటకసహస్రములతో నింపి, తెచ్చిపెట్టుకొన్న శరీరదౌర్బల్యమనోదౌర్బల్యములతోఁ దాము కృశించి కృశించి, చచ్చు స్త్రీపురుషులకంటె నట్టి త్యాగశీలురే ధన్యతరులును సుఖవత్తరులును అని నీవు రూఢిగా నమ్మవచ్చును. ఇప్పటికిని తదితరులతోఁ బోల్చిచూచినయెడల యుక్తప్రవర్తనముగల వితంతువులకును విధురులకును ఆయురారోగ్యసుఖము లెంతయెక్కువగానున్నవో పరిశీలించి చూడుము. అధఃపతనమొందియున్న మనదేశముయొక్క పునరుద్ధారణమహాకృత్యమునకు అకలంకబ్రహ్మచారులును విశుద్ధబ్రహ్మచారిణులును అనేకులు గావలయును—అని శ్రీవివేకానందస్వామివారు సెలవిచ్చినారు. మనదేశమున కిప్పుడు ధననీతిసంపత్తులు తక్కువగా నున్నవి గాని అపత్యసంపత్తి కేమాత్రపులోటును లేదు.

శి—మంచిదేకాని, మనసుచలింపకుండ మనుష్యులు—అందులో స్త్రీలు—యావజ్జీవబ్రహ్మచర్యవ్రత మవలంబించి యుండఁగలరా?

గు—ఉండలేకేమి? దిక్కులేని దీనబంధుజనమున కుపచారములు చేసి వారి ముప్పుగడపుటకో, దేశమాతసేవ చేయుటకో, మతబోధన

వ్యాపనకృత్యములు సలుపుచు భగవత్సేవచేయుటకో, రుగ్ణులకు రోగోప శాంతి గావించి వారిని సుఖపెట్టుచు వారి యాశీర్వాదములఁగొనుచుఁ గాలముగడపుటకో, రత్నములవంటి పాశ్చాత్యరమణు లెందఱో బుద్ధి పూర్వకముగా వివాహసౌఖ్యములు పరిత్యజించి, యేకాకినులై, తమ మనుగడ చక్కఁగా సర్వజనస్తవనీయముగా సాఁగించుకొనుచున్నారు. యోగ్యతలో మనస్త్రీలు పాశ్చాత్యస్త్రీలకంటెఁ దక్కువవారందువా? వారికి సుసాధమైన పరోపకారజీవనము నీరి కేలసాధ్యముగాదు? ఇఁక నీ మనశ్చాంచల్యపరీక్షమునకు సమత్తరమీయవలసియున్నది. తీవ్రమైనయ భినివేశముతో, తదేకదీక్షతో, ఏసద్వ్యాపారములోనో పడి సదా మునుఁ గుచుఁ దేలుచు నుండువారికిఁ గామచింతలనుఁ దెలిపియుండదు, వివాహ వాంఛలు జనించుట కంతకంటె నవకాశముండదు. "మీరు పెండ్లి చేసి కొనరాదా?" అని జగద్విఖ్యాతిఁగాంచిన చిత్రికళాభిజ్ఞుఁడగు మైకెమెల్ ఏంజెలోగారి నొకరడుగఁగా "నేను చేపట్టిన చిత్రకళాప్రేయసి యీర్ష్యా గ్రస్తురాలు! తనకు సవతిగా నెవతిని రానీయదు!" అని ప్రత్యుత్తర మిచ్చినాఁడఁట! సంవాద మతిదీర్ఘమైనాచున్నట్లున్నది. ఇఁకఁ జాలింతము.

శి—చిత్తము! నమస్కారము!

గు—శుభమస్తు! లోకాస్సమస్తా స్సుఖినోభవంతు!

---

# ౧౦ గురుశిష్యసంవాదములు.



# IV-1

శి—నమస్కారము! ఏదో గ్రంథము చదువుచున్నారే!

గు—చిరాయురస్తు! నీవంటిప్రియశిష్యుఁడే యొకఁడు దీనిని బంపుచు మఱి మూఁడు గురుశిష్యసంవాదములు వ్రాసి యేదేనియొకపత్రికకుఁ బంపుఁడని మఱిమఱి కోరినాఁడు. అతనిమాట త్రోసివేయఁజాలక యీ పుస్తకములో నతఁడు గుఱుతిడిన మూఁడు సంవాదములును జదువుచున్నాను.

శి—ఆగ్రంథమేది?

గు—భారతమాత పుత్రిరత్నమును, శ్రీరామకృష్ణపరమహంస స్వామివారి శిష్యకోటిలో నగ్రగణ్యుఁడును, పరమపవిత్రచారిత్రుఁడును, దేశభక్తావతంసమును, అగు శ్రీవివేకానందస్వామి యుపన్యాసాదులన్నియు మాయావతిలోనుండు అద్వైతాశ్రమమువారు లోకోపకారార్థము 7 సంపుటములలో ప్రకటించినారు. ఇది కడపటి యేడవసంపుటము. అందు శ్రీస్వామివారి "సంభాషణములు, సంవాదములు" అను శీర్షకముతో ముద్రించినప్రకరణములోని 19, 23, 24 భాగములు, గుఱుతుపెట్టి నన్నుఁ జదువుమన్న భాగములు.

శి—జగత్ప్రసిద్ధిఁగాంచిన శ్రీస్వామివారికిని వారిశిష్యులకును జరిగిన సంవాదములు ఆంధ్రజనులకు మనోహరములైన మహోపదేశములుగా నుండకమానవు. మీమాటలతో వినిపించెదరా? స్వామివారిమాటలతోఁ జెప్పెదరా?

గు—కాచావరణములోనుండి వెలువడుకాంతికిని కాగితములో నుండి వచ్చుకాంతికిని ఎంతభేదముండునో స్వామివాక్యనకును నావాక్య

నకును అంతవారయుండును. కనుక శిష్యునితోఁ జెప్పిన ఆయసమాటలే అనువాదరూపముగా ఆంధ్రమున వినిపింపఁదలఁచుకొన్నాను.

శి—ధన్యోస్మి! అట్లేకానిండు.

(19:—స్థలము, బేలూరిలో అద్దెకుపుచ్చుకొనియున్న మఠాగారము—సంవత్సరము 1898.) ఆనాఁటి ప్రాతఃకాలమున శిష్యుఁడు మఠమునకు వచ్చినాఁడు. వచ్చి స్వామివారిపాదములంటి లేచి నిలఁబడినాఁడు. నిలఁబడినవెంటనే "ఇంకను నీ వాకరికొలువులోనుండుటవలనఁ బ్రయోజనమేమి? ఏదోయొక మంచివ్యాపారములో నేలప్రవేశింపరాదు?" అని స్వామి యడిగినాఁడు. అప్పుడెదోయొకకుటుంబములోనిపిల్లలకు చదువు చెప్పుచు నుపాధ్యాయవృత్తిలోనుండిన శిష్యుఁడు "ఉపాధ్యాయవృత్తిని గూర్చి తమయభిప్రాయమేమి?" అని యడిగినాఁడు. అంతట వారిరువురకును ఈక్రిందిసంభాషణము జరిగినది:—

స్వా—చిరకాలము పిల్లలకు చదువుచెప్పుచున్నవానిబుద్ధి మొద్దుపాఱును. అతని తెలివి బహిర్వ్యక్తముగాదు. అహోరాత్రములు పిల్లలనడుమనుండువానిబుద్ధి క్రమక్రమముగా మందగించిపోవును. కనుక నీవు బాలురకుఁ జదువుచెప్పువ్యాపారము మానివేయుము.

శి—మఱేమిచేయుమనెదరు నన్ను?

స్వా—విను! ప్రాపంచికప్రవృత్తిగల సంసారివై జీవించుచు ధనమార్జించు సంకల్పము నీకున్నయెడల అమెరికా వెళ్లుము. వ్యాపారమార్గములు నేను నీకుఁ జెప్పెదను. అట్లుచేయుదో, నీ వైదుసంవత్సరములలో నధికధనము సంపాదించుకొనఁగలవు.

శి—ఏవ్యాపారములోదిగను? నాకు ధన మెచటనుండివచ్చును?

స్వా—ఏమి తెలివితక్కువమాట లాడుచున్నావోయి! దుర్దమమైన అపారమైనశక్తి నీలోనేయున్నది. "నేను వ్యర్థుఁడను! రిక్తుఁడను!" అని భావించుకొనుచుండుటవలన నీవశక్తుఁడవైనావు. నీవననేల? మనజాతి

యంతయు నష్టమైపోయినది. ఒకసారి తిరిగి ప్రపంచమంతయుఁ జూడుము. ఇతరజాతుల జీవనప్రవాహ మెంత ప్రబలముగా నెంత వీర్యవంతముగాఁ బాఱుచున్నదో నీకుఁ బ్రత్యక్షముగాఁ గాన్పించును. ఇఁక నీవేమిచేయుచు న్నావో చూచుకొనుము. అంతవిద్య సంపాదించుకొనికూడ "నాకేదైన నుద్యోగమిం"డని పోయి యితరుల గుమ్మములకడఁబడి యేడ్చుచున్నా వు. పరుల పాదాఘాతములు తిని వారికి దాస్యముచేయుచు గడ్డిపరకంత విలువయైనఁ జేయని మీకో నీకుఁ బౌరుషమేమున్నది?

మనదేశము మహాసారవంతమైనదేశము, అందు జలాధారములు పుష్కలముగా నున్నవి; సహజముగా నప్రయత్నముగాఁ బండు పంటలు ను లభించు వస్తురాసులును ఇతరదేశములలోకంటె సహస్రగుణము లధిక ముగా నున్నవి. ఇట్టిపరిస్థితులలోఁగూడ మీకుఁ దినుటకుఁ దిండియును ఒడలుగప్పుకొనుటకు బట్టయును లేకున్నవి! ఇచట నుత్పన్నములగు పదా ర్థములు పరదేశములలో నాగరకతావ్యాప్తికిఁ బ్రధానకారణములగుచు న్నవి, అంత వస్తుసమృద్ధిగల యీదేశములోని మీ కిట్టిదుర్దశకు వచ్చినా రు! మీస్థితి కుక్కలస్థితికంటెను నికృష్టముగానున్నది! ఇట్టి మీరు మీ వేదవేదాంతములగొప్ప చెప్పుకొనుచు మురియుచున్నారు! కూడుగుడ్డలు సంపాదించుకొనుటకైనను శక్తిలేక జీవనమునకు సదా యితరుల నాధార ముచేసికొనియుండు జాతికి గర్వహేతు వేమియుండును? కనుకఁ బ్రస్తుత ము మీమతాచారములన్నియు నబ్ధిలోఁ బడవైచి మొట్టమొదటఁ బ్రాణ ధారణార్థము గావించుకొనవలయుబవరములోదిగుటకు సన్నద్ధులుగండు!

మీదేశములో పండుముడిసరకులు గొనిపోయి విదేశీయులు వాని నమూల్యములగు పదార్థములుగాఁ మార్చుకొని యమితలాభము నందు చున్నారు, మీరో ఆవస్త్రాదులనన్నిటిని, బరువులుమోయు గాడిదలవలెఁ, బైనివేసికొని తిరుగుచున్నారు! పరదేశీయులు హిందూదేశపు ముడిసర కులు దిగుమతిచేసికొని, తమబుద్ధి యుపయోగించి వానిని వివిధములైన

చక్కని పణ్యపదార్థములుగా మార్చుకొని గొప్పవారగుచున్నారు, ఇఁక మీరేమిచేయుచున్నారు! మీ తెలివియంతయు బీగమువేసి బిగించుకొని, పరంపరాగతమైన పైతృకధనమంతయుఁ బాఱవైచుకొని, దీనాలాపములతో "అన్న యోరామచంద్రా!" యనియేడ్చుచుఁ దిరుగులాడుచున్నారు!

శి—అయ్యా! మఱి మాకు జీవనాధారము లెట్లుదొరకఁగలవు?

స్వా—అట్లనెదవేమి? సమస్తసాధనములును మీహస్తములలోనే యున్నవి. కన్నులకు గంతలుకట్టుకొని "అయ్యో, నేనంధుఁడనైనాను, నాకేమియుఁ గనఁబడుటలేదు!" అని యఱచుచున్నారు. ఆకంటికట్లు వీఁకి పాఱవేసి చూచుచో, యావత్ప్రపంచము మధ్యందినమార్తాండమయూఖదీప్తమైయున్నట్లు కాన్పింపఁగలదు. ఇక్కడ మీకు డబ్బుదొరకని యెడల, కేవు చెల్లింపనక్కఱలేకుండ కలాసులుగాఁ బనిజేసికొనుచు, ఓడ యెక్కి విదేశములకుఁబొండు. హిందూదేశపు బట్టలో, తుండుగుడ్డలో, వెదురుసామానులో, ఈదేశపుసరకు లితరములైనవేవో, పట్టుకొనిపోయి అమెరికా యూరప్పుపట్టనవీథులవెంబడిఁ జని విక్రయించుకొనుఁడు; ఇప్పటికిని విదేశవిపణీస్థలులలో హిందూదేశవస్తువులపై నెంతమోజున్నదో అప్పుడు మీకు బోధపడును. ఈవిధముగా హిందూదేశపుసరకులు అమెరికాలో నమ్ముకొని ధనవంతులైనట్టి హుగ్లీజిల్లా మహమ్మదీయుల గొందఱనే నెఱుఁగుదును. మనదేశమున కాశిలోఁ బ్రశస్తముగానేయఁబడు చీరలు చూడుఁడు, అట్టిబట్ట లీప్రపంచమున నన్యస్థలములలో నెక్కడను దొరకవు. ఈబట్టలు పట్టుకొని నీవు అమెరికాకువెళ్లి వానితో గౌనులు కుట్టించి అమ్ముకొనుము, అప్పుడు నీధనార్జనశక్తి యెంతయో నీకుఁ దెలియును.

శి—ఆదేశములలోని స్త్రీలకు చిత్రచిత్రవర్ణములుగల దుస్తులు రుచింపవని విన్నాను, బనారసుచీరలతోఁ జేసిన గౌనులు వారెట్లు ధరింతురయ్యా?

స్వా—వారు ధరింతురో ధరింపరో ఆమాట నీకేల? ఆసంగతి

నేను జూచెదను. ప్రయత్నించి ప్రయాణమై యటకుఁబోవుపనియే నీది, అదిచేయుము. ఆదేశములో నాకు స్నేహితులు పెక్కురుగలరు, సిఫారసు చేసి నేను నీకు వారిపరిచయము గలిగించెదను. మొట్టమొదట ఆబట్టలు వారినే కొనుఁడని కోరెదను. పిమ్మట ననేకులు వారిననుకరించుట నీవే చూతువు, తుదకు ఆబట్టలపై నచటిప్రజ కపరిమితాభిలాష కలుగును, అప్పుడు చాలినంతవస్త్రసామగ్రి నీవు వారికిఁ దెచ్చి యీయనేలేవు!

శి—కాని స్వామీ! ఆవ్యాపారమునకుఁ గావలయు మూలద్రవ్యము నేనెటనుండి తేఁగలను?

స్వా—ఏలాగుననో యొకలాగున వ్యాపారారంభమున నేను నీకుఁ గొంచెముసాయము చేసెదను, తరువాత నీస్వశక్తినే నీవాధారము చేసికొనవలయును.

"ఓడిచచ్చిన, స్వర్గసౌఖ్యముదొరకును; గెలిచిన, నీవైహికభోగము లనుభవింతువు." (గీత 2 అ. 37 శ్లో.)

అట్టిప్రియత్నముచేయుచు నీవు చచ్చిపోయినను మంచిదే! ఎందుచేత? నీయనంతర మనేకు లావ్యాపారము నవలంబింతురుగనుక; నీకు విజయమే సిద్ధించునేని, విత్తవిభవములతోఁగూడిన సుఖజీవనముచేయుదువు.

శి—ఔనయ్యా! అదినిజమే! కాని దానికిజాలినధైర్యము నాకులేదు.

స్వా—బిడ్డా! అదియే నేఁజెప్పునది. నీకు శ్రద్ధయే—ఆత్మవిశ్వాసమే—లేదు. నీకేమిలభించును? ఐహికాభ్యుదయములేదు, ఆముష్మికాభివృద్ధి అంతకంటెనులేదు. నేఁజెప్పినట్లోప్రవర్తించి యావచ్ఛక్తియు నుపయోగించి చరితార్థమైన సంసారయాత్రచేయుము, లేదా సర్వసంగపరిత్యాగముచేసి మేమెన్నుకొనినమార్గ మవలంబింపుము. పారమార్థికోపదేశములుచేయుచు సర్వదేశప్రజలకు సేవచేయుము—అప్పుడే మాకువలెనీకును నీవ.తు పట్టెఁడన్నము దొరకును. పరస్పరోపకారవినిమయములేనప్పు డీప్రపంచములో నొకరినొకరు లక్ష్యముచేయుదురనుకొనుచున్నావా?

మాస్థితి చూడుము, గృహస్థుల కేదోకొంత యాధ్యాత్మికబోధము చే యుచుందుముగనుకఁ బ్రతిఫలముగా వారు మాకుఁ గొన్నికబళములయ న్నము పెట్టుచున్నారు. ఏమియు నీవు చేయనప్పుడు వారు నీకేల తిండి పెట్టెదరు? కేవలదాస్యవృత్తినవలంబించి యితరులకు సేవచేయుచుండుట నీకెంతయో కష్టముగాఁ గానిపించుచున్నను నీవింకను మేలుకొనకున్నావు, అందుచే నీదుఃఖ మెన్నఁటికిని అంతరింపకున్నది—ఇది నిజముగా మా యాదేవియొక్క మహామోహకశక్తి ! పాశ్చాత్యదేశములందు ప్రజాప్రతి నిధిసభలలో ఇతరులసేవకులుగానుండువారు కూర్చుండుట కుద్దేశింపఁబ డినపీఠములు వెనుకవరుసలలోఁ జేర్చుటయు, ముందుకుర్చీలు స్వతం త్రోద్యమములందుఁగాని విద్యయందుఁగాని బుద్ధియందుఁగాని విఖ్యాతిఁ గాంచినవారు కూర్చుండుటకుఁ బ్రత్యేకముగాఁ బెట్టుటయు, నేను జూచి నాను, పాశ్చాత్యదేశములలో వర్ణబాధలేదు. ప్రయత్నించి పాటుపడి భాగ్యవంతులైనవారే ప్రజానాయకులుగాఁ బరిగణింపఁబడుదురు, వారే దేశభావిదశానిర్ణయాధికారులు. ఇఁక మీదేశములో మీరు జాత్యాధిక్య జన్మాధిక్యములఁగూర్చి బడాయిమాటలు చెప్పకొనుచు చిట్టచివరకు పొ ట్టకు పట్టెఁడన్నము సంపాదించుకొనలేని దురవస్థకు వచ్చినారు! సూది యైనను స్వతంత్రముగాఁ జేసికొనలేని శుంఠలగు మీరు ఆంగ్లేయుల నధి క్షేపింప సాహసించుచున్నారు! శిల్పవిద్యలు, కళలు, కర్మాగారవ్యాపా రములు, ప్రపంచములో జీవనముకై కావించు పోరాటమునకుఁగావలయు వ్యవహారదక్షత, ప్రయోగశీలత—ఇవన్నియు వారిపాదములకడఁ గూరు చుండి నేర్చుకొనుఁడు. మీరు సమర్థులైనప్పుడే పోయిన గౌరవము మరల మీకువచ్చును, అప్పుడే వారు మీమాటలు చెవినిబెట్టుదురు. వలయు సన్నాహములేకుండ దేశీయమహాసభలోఁ బెట్టు వట్టికేకలవలన నేమి లాభము ?

శి—కాని, అయ్యా! విద్యావంతులందఱును ఆసభలోఁజేరినారు.

స్వా—ఏవో కొన్ని పరీక్షలలో విజయమొంది మంచియుపన్యాసము లీయఁగలిగినంతమాత్రిమునసే మనుష్యుఁడు విద్యావంతుఁడనుకొనుచు న్నావు. జీవికాసంపాదనమునకై చేయు సంసారసంగ్రామములో సామాన్యజ నులకు సాధనసంపత్తినొసఁగి సాయపడనివిద్య, శీలబలము చేకూర్పనివిద్య, లోకోపకారపరాయణత్వమును బుట్టింపనివిద్య, హృదయములో హార్యతు ధైర్య ముదయింపఁజేయనివిద్య—విద్య యనిపించుకొననేరదు. స్వతంత్ర జీవనసామర్థ్య మొసఁగువిద్యయే విద్య. క్రిందిపాఠశాలలలోను పైకళా శాలలలోను మీరిప్పుడు కఱచువిద్య మిమ్మజీర్ణరోగులఁ జేయుటకుమా త్రమే యుపయోగపడుచున్నది. కేవలజడయంత్రములవలెఁ బనిచేయుచు మీరు అనుకఁచేఁపబ్రితుకు బ్రితుకుచున్నారు!

పొలము సేద్యముచేయురైతు, చెప్పులుకుట్టుమాదిగవాఁడు, వీ థులుతుడుచుపాకీవాఁడు—వీరికిఁ బాటుపడి స్వతంత్రజీవనము చేసికొను సామర్థ్యము మీకంటె నెక్కువగానున్నది. మాటాడకుండ సణుగుకొన కుండ శాంతముగాఁ జిరకాలమునుండి వీరు పాటుపడి పనిచేయుచు, వస్తూ త్పాదనకర్తలై, యావద్దేశభాగ్యమునకును మూలములైనారు. అతిశీఘ్ర కాలములో వారు మిమ్ముదాఁటి మీకంటె నున్నతస్థితిని బ్రాపింపనున్నా రు. క్రమముగా ధనమంతయు వారిచేతులలోనికి వచ్చుచున్నది, లేమిబాధ మీయంత వారికి లేదు. నవీనవిద్యావిధానము మీప్రాచీనసంప్రిదాయము లను మార్చివైచినది, ఉపజ్ఞాశక్తి లేకపోవుటచేత క్రొత్తవిత్తోపార్జనమా ర్గములు కనిపట్టఁజాలకున్నారు. ఎంతోకాలము పరమశాంతులైన యీ పామరప్రజలను మీరు బాధపెట్టినారు; ప్రితీకారసమయ మిప్పుడువచ్చి నది. ఉద్యోగమునే మీజీవితము యొక్క ప్రియోజనముగాఁజేసికొని, దా నికై వ్యర్థాన్వేషణము చేయుచు, మీరు వినాశమునొందుచురు.

శి—అయ్యా! అపూర్వకల్పనాశక్తి యితరదేశీయులకంటె మాకు తక్కువగా నున్నప్పటికిని, క్రిందిజాతు లింకను మాబుద్ధిచేతనే నడపఁబడు

చున్నవి. కనుక జీవనపుపోరాటములో జయించి పైజాతుల నీలాఁటుటకుఁ జాలినసామర్థ్యమును జ్ఞానోత్కర్షమును నిమ్నజాతుల కెచ్చటనుండివచ్చును ?

స్వామీ—నీవలె వారేవో కొన్నిపుస్తకములు చదువకపోయినఁ బోనిమ్ము! దక్షివలనవచ్చిన దర్జాయును నాగరకతయును నీకువలె వారికి లేకపోయినఁ బోనిమ్ము! వానివలన లాభమేమున్నది? సర్వదేశములలోను ప్రజాసంఘములకు వారు వెన్నెముకలవంటివారు. ఈనిమ్నజాతులు వారుచేయుచుండుపనులు చేయకున్నచో, నీకు అన్నవస్త్రము లెక్కడనుండివచ్చును? కలకత్తాలోని పాకీవాండ్రొకరోజు పనిచేయుటమానిన, నందఱును భయవిప్లుతులగుదురు, మూడురోజులు వారు సమ్మెకట్టుకట్టిన అంటురోగములుపుట్టి పట్టనమంతయు నిర్మానుషమగును. పనివాండ్రు వారిపని యాఁపివేసిన, నీకు కూడుగుడ్డలువచ్చుటకూడ నాఁగిపోవును. స్థితిగతులిట్లుండఁగా, నీవు వారు తక్కువజాతివారని యెంచి నీవిద్యనుగూర్చియు జ్ఞానాతిశయమునుగూర్చియు నేమేమో గర్వోక్తులాడుచుందువు.

తిండికై దేవులాడుచు కొట్టుకొనుచుండుటచేత వారికి ప్రబోధావకాశములు లేకపోయినవి. సహజమైన మనుష్యబుద్ధిచే నడపఁబడుచు నెంతోకాలను వారు యంత్రములవలె నొక్కరీతిగాఁ బాటుపడి పనిచేసినారు; ఇఁక సంఘములో విద్యాధికులైన గడుసువారు వారిపరిశ్రమఫలములలో విశేషభాగము చూఱగొనినారు. ప్రతిదేశములోను నిట్లేజరిగినది. కాని యిప్పుడు కాలములు మాఱినవి. నిమ్నజాతుల కీసంగతి క్రమముగా గోచరించుచున్నది. న్యాయ్యముగా తమకురావలయులాభములను తాము లాగుకొనుటకుఁ గృతనిశ్చయులై వారైకమత్యముతోఁ బ్రతిఘటించి పనిచేయుచున్నారు. మొదట నుద్బుద్ధులైనవారు అమెరికాయూరప్పలలోని సామాన్యజనులు, వారప్పుడే పోరాడుట కారంభించినారు. ఈయుద్బోధసూచనలు హిందూదేశములోఁగూడఁ గాన్పించుచున్నవి.

ప్రస్తుతము నిమ్నజాతులుకట్టు పెక్కుసమ్మెకట్లే దాని కమోఘదృష్టాంత ములు. ఎంతప్రయత్నించినను, అగ్రజాతులవా రింక నధమజాతులవారిని త్రొక్కి యణఁచిపెట్టఁజాలరు. యథాన్యాయమైనహక్కులు సంపాదిం చుకొనుటలోఁ గ్రిందిజాతులవారికిఁ దోడ్పడుటయే పైజాతులవారికి క్షే మము. కనుక సామాన్య ప్రజాసంఘములో విద్యావ్యాపనము గావించు పని మీరు పైనిడైచుకొనుఁడు. "మీరు మాసోదరులు—మాశరీరము న కవయవములవంటివారు—మేము మిమ్ముఁ బ్రేమింతుముగాని యెన్నఁ డు ద్వేషింపము." అనిచెప్పి యామాటలు వారిమనసున కెక్కింపుఁడు. ఈ సమసుఖదుఃఖభావము, ఈయవ్యాజానురాగము, మీరు వారికిఁ జూ పుచో, వారిక్రియోత్సాహశక్తి నూఱుమడుఁగులు హెచ్చును. ఆధునిక శాస్త్రసాహాయ్యమున వారిలో జ్ఞానజ్యోతి వెలిఁగింపుఁడు. దేశచరిత్ర, భూగోళశాస్త్రము, ప్రకృతిశాస్త్రములు, సాహిత్యవిద్య, వానితోపాటు మతములో నిగూఢముగానుండు పరమసత్యములు—ఇవన్నియు వారికి బోధింపుఁడు. ఈసదుపదేశములకుఁ బ్రతిఫలముగా ఉపదేశకులదారిద్ర్య ముకూడ మాయమైపోవును. పరస్పరవినిమయమువలన నుభయపక్షముల వారును అన్యోన్యమైత్రి గలిగియుందురు.

శి—సరియేకాని! స్వామీ! విద్యావ్యాప్తివలన వారిబుద్ధికూడ వికసించి సారవంతమగుటతోడనే మావలె వారును సోమరులై వారి క్రిందిజాతివారిశ్రమయొక్కఫల మనుభవించుచు నిర్వ్యాపారనిరర్థకజీవన ము సాగించుకొందురు.

స్వా—అట్లేలజరుగును? జ్ఞానోదయమైనప్పటికిని కుమ్మరి కుమ్మరి గానేయుండును, జాలరి జాలరిగానేయుండును, సేద్యకాఁడు సేద్యకాఁడు గానేయుండును. వారు కులక్రమాగతములైన తమవృత్తు లేల వదలుకొన వలయును? "సహజంకర్మ కౌంతేయ! సదోషమపి నత్యజేత్—లోపము లతోఁ గూడియున్నను అర్జునా! పరంపరాప్రాప్తమైన వ్యాపారమును వ

దలిపెట్టకుము." ఈప్రకారము వారికి బోధించు నెడల, వారి వారివృత్తులను వారేల త్యజింతురు? త్యజించుటకుమాఱుగా, జన్మముచే లబ్ధమైన జీవన వ్యాపారమును వారిజ్ఞానబలముచే మఱింతచక్కఁగా సాఁగించుకొందురు. కాలక్రమమునఁ బ్రతిజాతిలోను అనేకధీసంపన్నులు బయలుదేఱుదురు. అంతట అగ్రజాతివారగు మీరు వారిని మీలోఁ జేర్చుకొందురు. వీరనృపతియగు విశ్వామిత్రుని బ్రాహ్మణునిగా స్వీకరించుటవలన క్షత్రియజాతి వారందఱు బ్రాహ్మణుల కెంతకృతజ్ఞులై యుండిరో చూడుము. అట్టి సదనుకంపాసహకారిత్వములవలన పక్షులును పశువులును ఆత్మీయములగు నప్పుడు మనుష్యులమాట వేఱుగాఁ జెప్పవలయునా?

శి—అయ్యా! మీరు సెలవిచ్చినది సత్యమే, కాని పైవర్ణముల కును క్రిందివర్ణములకును నడుమ నింకను సముద్రమంత యంతరమున్నది. హిందూదేశములో అగ్రజాతులకు అవరజాతులపై సానుభూతి పుట్టించి వారికిఁ గలుపుఁగోలుతనము గలిగించుట కష్టసాధ్యమైనపనిగాఁ గన్పట్టు చున్నది.

స్వా—అదిలేకుండుట అగ్రజాతివారగు మీకే క్షేమకరముగాదు. ఎంతకాలమునుండియో మీమూలమునఁ గలుగుచున్న అంతఃకలహములు మిమ్మే నాశముచేయును. పామరప్రజలలో ప్రబోధముకలిగినప్పుడు మీరు వారికిఁగావించిన పీడ వారికిఁ దెలియును, అంతట వారి ఒక్క ముఖమారుతపుదెబ్బతో మీరెల్లరు దూరముగాఁ గొట్టుకొనిపోదురు. ఇదివఱకు మీకు నాగరకతయును ఔన్నత్యమును వారివలననే కలిగినవి, అప్పుడు మీయధఃపతనముకూడ వారివలననే సంభవించును. బలవత్తమమైన రోమన్‌శిష్టతా శ్రేష్ఠతలన్నియు పామరులగు 'గాల్' జాతివారిఢాకకు నిలువలేక యెట్లు బుగ్గియైనవో ఆలోచించుకొనుఁడు! కనుక, విద్యాబుద్ధులు గఱపి పామరజనులను వారిప్రస్తుతత మోనిద్రనుండి లేపుఁడని నేను మీకు మఱిమఱి చెప్పుచున్నాను. వారు లేచినప్పుడు—ఎప్పుడో

యొకప్పుడు లేవకపోనరు—వారు మీయుపకారమును మఱవక నీకు కృతజ్ఞులై యుందురు.

(ఈసంభాషణమంతయు జరిగినపిమ్మట శిష్యునిజూచి స్వామి యిట్లుపలికెను.)

ఈవిషయములన్నియుఁ గట్టిపెట్టి, నీవేమి నిశ్చయించుకొంటివో నాకుఁ జెప్పుము. ఏదైననుసరే, రెంటిలో నొకటిచేయుము. ఏదోయొక వ్యాపారములోనైనఁ బ్రవేశింపుము, లేదా "ఆత్మనో మోక్షార్థే జగద్ధితాయచ—నీవిముక్తికొఱకును లోకహితముకొఱకును మావలె నిజమైన సన్న్యాసపథమునకై నరమ్ము. నిజముగా రెండవమార్గము సర్వోత్కృష్టమైన మార్గము. గృహస్థుఁడవై యసారమైనసంసారములోఁ జొచ్చుటవలన నేమి మేలుకలుగును? ఈప్రపంచములో సమస్తము క్షణభంగురమని నీకుఁ దెలిసియేయున్నది. "నలినీదళగతజల మతితరళమ్, తద్వ జ్జీవిత మతిశయచపలమ్— తామరాకుమీఁది జలమునవలె జీవన మస్థిరము." కనుక నీవాత్మజ్ఞానోపార్జనతృష్ణగలతీవ్రముముక్షుఁడవై యున్నయెడల, నిఁక నాలస్యముచేయక వెంటనే రా! ముందఱికి రా! "యదహరేవవిరజేత్ తదహరేవప్రవ్రజేత్—ఏరోజునఁ బ్రపంచముపై నీకు వైరాగ్యముకలుగునో ఆరోజుననే సర్వము త్యజించి సన్న్యాసివిగమ్ము" అని జాబాలోపనిషత్తు చెప్పుచున్నది. ఇతరులమేలుకొఱకు నీబ్రతుకు బలిగానిడి * "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ నిబోధత—ముముక్షులారా! లెండు, మేలుకొనుఁడు! శ్రేష్ఠులైన గురువులఁబడసి జ్ఞానవంతులు గండు. (గమ్యస్థానము ప్రాపించువఱకు ఆఁగకుఁడు)" అను అభయవార్తను గొని యింటింటికిఁ బోయి తెల్పుము.

* కఠోపనిషత్తు.

# IV-2

(23 :—ప్రదేశము, కట్టఁబడుచుండిన బేలూరిమఠాలయము. సంవత్సరము, 1899).

శి—మనదేశమును మనప్రజాసంఘమును ఇంతయధోగతికి వచ్చినవేమి స్వామీ ?

గురువు—(శ్రీవివేకానందస్వామివారు)—దాని కర్తృత్వాదులు మీరే ! మీరే దానిని దెచ్చినవారు !

శి—అదేమిస్వామీ వింతమాట లాడుచున్నారు !

గు—అతిదీర్ఘకాలమునుండి మనదేశములోని క్రిందిజాతులవారిని మీరు నీచులఁగా, గర్హ్యులఁగాఁ, జూచుచున్నారు; తత్ఫలముగా నిపుడు మీరు ప్రపంచదృష్టిని పరమనీచులును పరిభవపాత్రులును అయినారు.

శి—మేము క్రిందిజాతుల నవమానించుట మీరెప్పుడు చూచినారయ్యా ?

గు—అట్లడుగుచున్నావేమి? పురోహితజాతిలోఁ జేరిన మీరు బ్రాహ్మణేతరులను వేదములు వేదాంతములు ఇతరపవిత్రశాస్త్రములు— ఇవేవియు నెన్నఁడును జదువనిచ్చినారుగారు, చదువుట యటుండ వానిని తాఁకనైనను తాఁకనిచ్చినారుగారు. మీరే వారిని లేవకుండ నణఁగఁద్రొక్కి యుంచినవారు. కేవలస్వార్థపరులై వారి కట్లుచేసినది మీరే. మతగ్రంథముల యేకస్వామ్యము తాము గైకొని అనుమోదప్రతిషేధాధికారములు తమ చేతులలోఁ బెట్టుకొనినది బ్రాహ్మణులే. హిందూదేశములోని యితరజాతులను మాటిమాటికి అల్పులని అపకృష్టులని చెప్పుచుఁ దాము నిజముగా అట్టివారే యనువిశ్వాసము వారిమనసులలో మీరు గలిగించినారు. "నీవు నీచుఁడవు ! నీవు నికృష్టుఁడవు !" అని యైనప్పుడు కానప్పుడు నీ వొకనిని నిందించుచున్నయెడలఁ, దాను నిజముగా అట్టివాఁడే యనునమ్మకము కాలక్రమమున నతనికిఁ గలుగకమానదు. దీనినే

మోహనతంత్రిమందురు. బ్రాహ్మణేతరజాతివా రిప్పుడు మెల్లమెల్లగా మేలుకొనుచున్నారు. బ్రాహ్మణుల వేదములందును మంత్రములందును వారికుండు పూర్వవిశ్వాసము సడలిపోవుచున్నది. ప్రతీచ్యవిద్యావ్యాప్తి వలన విపులమాయలన్నియు, వర్షాకాలములో పద్మానదీతటములవలె విరిసిపోవుచున్నవి—ఈసంగతి నీకు గోచరించుటలేదా?

శి—ఔనయ్యా! పూర్వధర్మపరాయణులగు ఛాందసులఆక్షేపణములును భర్త్సనములును ఇప్పుడు క్రమక్రమముగా తగ్గిపోవుచున్నవి.

గు—జరుగవలసినట్లే జరుగుచున్నది నిశ్చయముగా బ్రాహ్మణులు కొంతకాలమునుండి క్రమశః కూ్రరమైన యధర్మపథమును దొక్కినారు. స్వహితపరులై కేవలము తమప్రతిష్ఠ నిలఁబెట్టుకొనుటకు వారు అపూర్వములును అవైదికములును నీతిబాహ్యములును అన్యాయములును అగు ఆచారములు చొరఁబెట్టినారు, కనుక వెంటనే దానిదుష్ఫలములనుభవించుచున్నారు.

శి—అదుష్ఫలము లేవయ్యా?

గు—నీ కగపడుటలేదా? గతించిన వేయివత్సరములనుండియు మీరు వట్టి బానిసబ్రతుకు బ్రతుకుచుండుటకును పరదేశీయులు మిమ్ముఁ జూచి యసహ్యించుకొనుటకును మీదేశమువారే మి మ్మపేక్షాభావముతోఁ జూచుచుండుటకును మీరు హిందూదేశపుటవరజాతులవారిని చులుకనగాఁ జూచి నిరసించుటయే కారణము.

శి—కాని అయ్యా! ఇప్పటికిని శుభాశుభకర్మములన్నియు బ్రాహ్మణులచేతనే యథాపూర్వముగా నడపఁబడుచున్నవి, వారియభిప్రాయములననుసరించియే ప్రజలు వానిని జరుపుకొనుచున్నారు. మీరిట్లు పలికెదరేమి?

గు—నాకట్లు కనఁబడదు. శాస్త్రవిహితములైన దశవిధసంస్కారములు నివ్వు డెచట నాచరణములో నున్నవి? నేను హిందూదేశమంత

యుఁ దిరిగిచూచినాను, శ్రుతిస్మృతినిషిద్ధములైన తత్తత్ప్రదేశములందలి యాచారములే సర్వత్ర జను లవలంబించి యనుష్ఠించుట నాకుఁ గనఁబడి నది. ప్రజాసంప్రదాయములు, దేశాచారములు, స్త్రీలలో మాత్రమే వి పులప్రచారముగల వ్రతాదికర్మములు—ఎల్లయెడల నివియే శ్రుతులను ద్రోసిరాజని వానిస్థాన మాక్రమించుకొనియున్నవి. అనువర్తించువారెవ రు? వేని ననువర్తించుచున్నారు? చాలినంతడబ్బు నీవు వెచ్చింపఁగలుగు నెడల నీకుఁ గావలయు అంగీకారపత్త్రములును నిషేధపత్త్రములును వ్రాసి యిచ్చుటకు ఆచార్యవర్గమువారు సిద్ధముగా నున్నారు! వైదిక కల్పసూత్రములును గృహ్యసూత్రములును శ్రౌతసూత్రములును జదివిన వారు వారిలో నెందఱున్నారు? మఱియొకమాటవినుము—వంగదేశము లో రఘునందనస్మృతి ప్రమాణమైయున్నది; అవలఁ గొంతదూరముఁ బ్రచారములోనున్నది మితాక్షర; మఱియొకచోట మనుస్మృతి ప్రబల ముగా నున్నది. ఎల్లచోట్లను ఏకధర్మశాస్త్రనియమములే అంగీకరింపఁబడి అమలులో నున్నవని నీ వనుకొనుచున్నట్లున్నావు! ప్రజలమనస్సులలో వేదములయెడల నిప్పటికంటె నెక్కువ గౌరవప్రపత్తులు గలిగించి, వేదపఠ నమును ప్రవేశపెట్టి, ప్రతిప్రదేశమందును వేదశాసనములే ప్రచారములో నికిఁ దేవలయునని నాయభీష్టము.

శి—అట్టిప్రచారము ప్రస్తుతకాలములో సాధ్యమగునా? వేదశా సనములన్నియు నిప్పుడు అమలులోనికిఁ దీసికొనిరాఁగలమా?

గు—ప్రాచీనవేదనియమములన్నియుఁ బ్రస్తుతప్రజ లంగీకరింపరను మాట వాస్తవమే; కాని యవసరమునుబట్టి కొన్నిచేర్చి కొన్నిమార్చి వాని నొకక్రొత్తస్మృతిగాఁగూర్చి ప్రజలయెదుటఁ బెట్టినచో వారు దాని ననుమోదించి యేల గ్రహింపరు?

శి—హిందూదేశమందంతటను ఇప్పటికిని అధమము మనుధర్మ శాస్త్రమైనను ఆచరణములోనున్నదనియే నే నభిప్రాయపడుచుంటిని.

గు——అటువంటిదేమియుఁ జరుగుచుండుటలేదు. మీరాష్ట్రము లోనే దుర్నీతియుక్తమైన తాంత్రికవామాచారములు మీలోఁబ్రవేశించి యస్థిగతములై యెట్లున్నవో చూచుకొనుము. మృతబౌద్ధమతావశేషమై దానియెముకలగూఁడువలె నిలిచియున్న యర్వాచీనవైష్ణవమతముగూడ వామాచారభూయిష్ఠమైపోయినదే! ఈవామాచారము కేవలవేదమత విరుద్ధము, అవైదికము; ఈఘోరవామాచారప్రవాహము నరికట్టి యంత రింపఁజేయవలెను.

శి—ఈమహాకశ్మలపుమతమంతయు, కడిగి మరల పరిశుద్ధముచేయు ట యీకాలములో మనకు సాధ్యమా మహాత్మా?

గు——ఓయిపిఱికివాఁడా! ఏమి తెలివితక్కువమాటలాడుచున్నావు! "అశక్యము! అసాధ్యము!" అని మొఱపెట్టుచు మీరు బంగారము వంటిదేశమును పాడుచేసి దానిని దాదాపుగా వినాశస్థితికిఁ దెచ్చినారు. మనుష్యప్రియత్నమువలన సాధ్యముగానిదేమున్నది?

శి——స్వామీ! అట్టిసంస్కరణము మనుయాజ్ఞవల్క్యులవంటిమహర్షులు మరల మనదేశములోఁ బుట్టినఁగాని అసాధ్యమని నాకుఁ దోఁచుచున్నది.

గు——హరిహరీ! వారిని మనుయాజ్ఞవల్క్యులఁగాఁ జేసినవి వారి శీలనైర్మల్యమును స్వార్థపరతారహితమైన పరిశ్రమమునునా? మనమొకటి యాఁ ప్రియత్నించినయెడల మనము వారికంటెను ఎక్కువవారము గా వచ్చును. అట్టిచో మనయభిప్రాయములేల ప్రిబలి ప్రజాప్రియములై యుండఁజాలవు?

శి——అయ్యా క్షమింపుఁడు! దేశములోఁ బ్రాచీనాచారములను పూర్వసంప్రదాయములను పునరుజ్జీవింపఁజేయవలయునని తమరెప్పుడే సెల విచ్చితిరిగదా! ఇఁక మన్వాదిమహర్షులను మనమిట్లు లఘుభావముతో నెట్లు చూడఁగలము?

గు—ఎట్టి విపరీతమైనయనుమితి లాగినావోయి నామాటలనుండి! నాయాశయము నీవు గ్రహింపఁజాలనైతివి. ప్రస్తుతసంఘప్రయోజనముల ననుసరించియుఁ బ్రస్తుతకాలములననుసరించియుఁ బ్రాచీనవేదసంప్రదాయములను సంస్కరించి సవరించి నవీనరూపమున వానిని మనదేశములోఁ బ్రచారములోనికిఁ దేవలయుననికాదా నేఁజెప్పితిని!

శి—ఔ నట్లేచెప్పినారు.

గు—మఱి నీవాడుమాట లిట్లున్న వేమి? నీవు శాస్త్రములు చదివినవాఁడవు, నీయట్టివారిమీఁదనే కొండంత యాశపెట్టుకొని వారినే నమ్ముకొని నేనున్నాను. నామాటలు సరిగాగ్రహించి తదనుసారమైన తీవ్రోద్యమములో నీవు దిగుము.

శి—అయ్యా! మామాట లెవరువిందురు? మాయుపదేశములు మనదేశీయు లెట్లుగ్రహింతురు?

గు—ప్రజలసంశయములు పోఁగొట్టి మీరు వారికి సత్యము నచ్చఁజెప్పఁగలుగునెడలను, చెప్పినట్లు మీరుచేసి చూపఁగలుగునెడలను, వారు మీయుపదేశములు తప్పకుండ విని వాని నాచరణములోఁ బెట్టుదురు. అటుగాక, భీరువులై, చిలుకలవలె శ్లోకములుమాత్రము చదువుచుఁ, బ్రమాణములు కుప్పనఁగూరలుగాఁ గురియుచుచుఁ, గేవలవాక్శూరులై, చెప్పెడునీతులను స్వాచరణములోఁ జూపకుండునెడల, ఆదరముతో మీమాట లెవ్వరును ఆలింపరు.

శి—దయచేసి సంక్షేపముగా సంఘసంస్కరణమునుగూర్చి నాకేదో యొకసలహా యిండు.

గు—ఎన్నెన్ని సలహాలో యీవఱకే నేను నీకిచ్చినాను. ఆయన్నిటిలో నొక్కటియైన నిప్పుడాచరణములోనికిఁ దెచ్చిచూపుము. నీవు చేసిన వేదాధ్యయనమును నాకడ విన్నహితోపదేశములును సార్థకములైనవని ప్రపంచమునకు గోచరింపఁజేయుము. మనుస్మృతియును మఱి యనేకేతరగ్రంథములును నీవు చదివినావు—వానికన్నిటికిని ఆధారభూతమై

అయన్నిటియందంతర్లీనమై యున్న మూలప్రయోజనమేది? ఆమూలమున కుమాత్రము భంగముకలుగకుండఁ జూచుకొని, మనపూర్వర్షులుచేసినట్లు వానిలోని పరమసత్యములను ప్రధానధర్మములను సంగ్రహించి, ప్రస్తుత కాలోచితములగు భావములు వాని కదనముగాఁజేర్పుము ; ఈవిధినిషేధ సూత్రములప్రకారము నడచుకొనుటవలన హిందూదేశమందుండుజాతుల న్నియు శాఖలన్నియు అంతశ్శాఖలన్నియు—అందఱును బాగుపడి సమస్త సుఖములతో వర్ధమానులై యుండునట్లుమాత్రము నీవు జాగ్రత్తపడవలె ను. అట్టిస్మృతియొకటి రచించి నాకుఁ దెమ్ము. అది నే సంశోధించి సవ రించెదను.

శి—అయ్యా ! అది సుకరమైనపనిగాదు ; అట్టిస్మృతి కష్టపడి వ్రాయుదుననుకొందు ; అది ప్రజలు స్వీకరింతురా ?

గు_ఏలస్వీకరింపరు? వ్రాసిచూడుము! "కాలోహ్యయం నిరవధి ర్విపులాచపృథ్వీ—కాలమనంతము, ప్రపంచము విశాలము" నీవు యథో చితముగా సమంజసముగా వ్రాయునెడల నది ప్రజలు సగౌరవముగా గ్రహించుకాలము రాకతప్పదు. మీరే వెనుక వేదర్షులై యుండి యిప్పు డు భిన్నాకారములతో మరలవచ్చినారు, అంతే! మీయందఱిలో ననంత మైనశక్తి యున్నది. అది నేను సూర్యకాంతివలె సువిస్పష్టముగాఁ జూచు చున్నాను. దానినిలేపుఁడు ! లేపుఁడు ! లెండు ! లెండు ! నడుముకట్టు కొని త్రికరణశుద్ధితో సోల్లాసముగా సోత్సాహముగా పనిలోఁ బ్రవేశిం పుఁడు ! చిటికలో మాయమైపోవు విత్తవిభవవిఖ్యాతులవలన మీకేమి లాభముగలుగును? నామనస్సు మీరు కనిపట్టినారా?—నేను ముక్తిని గిక్తిని లక్ష్యముసేయను, అట్టివి నాకక్కఱలేదు. ఈభావములు మీయం దఱిలో నుద్భవింపఁజేయుటకే నేను నియుక్తుఁడనై వచ్చినాను ; ఒక్క మనుష్యుని మంచిస్థితిలోఁబెట్టి సదభ్యాససంపన్నునిజేయుటకు నేను లక్ష జన్మములనైన నెత్తుటకు సంసిద్ధుఁడనై యున్నాను !

శి—కాని, స్వామీ! అట్టిపనులు పూనుకొనుటవలన నేమిప్ర యోజనము? మృత్యుదేవత మహాదర్పములో మనల వెన్నాడి వచ్చుచుండుట లేదా?

గు—ఛీ! ఛీ! యేమిమాటలాడుచున్నావు! చచ్చుచో నొక్కసారియే చత్తువు; అంతేకాని పిఱికివై సదా చావుతలపోఁతలఁ గోసేపడి నీ జీవితములో నిమిషమున కొక్కొక్కచావుచొప్పున నిత్యమరణబాధ లేల పడెదవు?

శి—సరియే పోనిండు! మరణచింతనచేయను. కాని యీక్షణికమైన జగత్తులో నేపనిచేసినను ఏమిలాభము?

గు—బిడ్డా! చావకతప్పనప్పుడు మొరళ్లవలెను పాషాణములవలెనుగాక శూరులవలెఁ జచ్చుట మంచిదిగాదా! బుద్బుదప్రాయమగు నీలోకములో నొకరోజో రెండురోజులో ఎక్కువగా జీవించుటవలన నేమి ప్రయోజనము? అణుమాత్రపుపరోపకారమైనఁగావించుకొంటను, త్రుప్పుపట్టి హరించుటకంటెఁ బనిరాపిడిచే హరించిపోవుట మంచిది!

శి—పరమసత్యమైనమాట పలికినారయ్యా! తమ్మింత శ్రమపెట్టినందులకు నన్ను క్షమింప వేఁడుకొనుచున్నాను.

గు—తీవ్రజిజ్ఞాసువై వచ్చినపృచ్ఛకునితో నిండుగా రెండురాత్రులు నేను సంభాషించుచుండినను నా కలసటజనింపదు, నిద్రాహారములు వర్జించి నేనట్లే మాటలాడుచుండఁగలను. అట్లు బుద్ధిపుట్టినయెడల ఏ హిమాలయగిరిగహ్వరములోనో నే సమాధినిష్ఠుఁడనై కూరుచుండనుగలను. జగజ్జననియనుగ్రహమువలన నే నిప్పుడు భుక్తినిగూర్చి యాలోచించుకొననక్కఱలేదని నీకుఁ దెలియునుగదా! ఆహార మేదోయొకమార్గమున వచ్చుచుండును. అట్టిస్థితిలో నేను హిమవన్నగములకుఁ బోవకయిట నేలయున్నానో యెఱుఁగుదువా? ప్రత్యక్షముగాఁ గానిపించు మన దేశదుఃస్థయును దాని భావిచింతనయును నన్నట్లు పోనిచ్చుటలేదు, అని

శాంతముగా నన్నుండనిచ్చుటలేదు—బ్రహ్మలోకసుఖములుకూడ చప్పగాఁ గన్పట్టుచున్నవి! మీయోగక్షేమములఁగూర్చి యాలోచించుటయే నాముఖ్యమనస్సంకల్పము—నాజీవితవ్రతము. ఆవ్రతము సఫలమైననాఁడే, ఆసంకల్పము సిద్ధించినరోజుననే, నే నీదేహమును విడిచి తిన్నగాఁ బైకిఁ బోయెదను.

(స్వామివచనములువిని శిష్యుఁడు విస్మితహృదయుఁడై నోటమాటలేక కొంతసేపు తెప్పవాల్పక ఆయనవైపు చూచుచుండి అంతటఁ దేఱుకొని సెలవుపుచ్చుకొనుటకై లేచి స్వామికి గాఢభక్తితో మ్రొక్కి వెళ్లుట కనుజ్ఞ వేఁడుకొనెను.)

గు—నీవేల వెళ్లఁగోరెదవు? మఠములోనే యేలయుండఁగూడదు? తిరుగ నీవు విషయాసక్తచిత్తులకడకుఁ బోవునెడల, మరల నీమనస్సు మలినమై చెడిపోవును. ఇచటిగాలి యెంతనిర్మలముగా ఎంతసుఖముగా నున్నదో చూడుము! అదిగో! అక్కడ గంగాభవాని ప్రవహించుచున్నది! సాధువులు ధ్యానము చేయుచు యోగము లభ్యసించుచు మహోదారములైన విషయములపై మాటలాడుకొనుచునున్నారు! ఇఁక నీవు మరల కలకత్తాకుఁబోయినయెడలనే అపవిత్రతుచ్ఛవిషయములఁగూర్చి యాలోచించుకొనుచుందువు.

శి—(సంతోషములో) మంచిదిస్వామీ! ఈరోజు మఠములోనే యుండెదను.

గు—"ఈరోజు" అనెదవేల? ఎప్పటికి నిచటనే యుండిపోలేవా? మరలఁ బోయి ప్రపంచములోఁ బడుటవలన లాభమేమి?

(స్వామివాక్యములువిని శిష్యుఁడు శిరసువంచుకొనెను. దొమ్మిగా నానావిధములైనతలఁపులును అతనితలలోఁ బ్రవేశించి నోరు కట్టివైచినందున నతఁడేమియు ననలేక యూరకుండెను.)

---

# IV-3

(24 :— ప్రదేశము, నిర్మాణములోనున్న బేలూర్ మఠమందిరము. సంవత్సరము 1899 ప్రారంభము.)

ఈనాఁడు శ్రీవివేకానందస్వామి శిష్యునితోఁగూడ మధ్యాహ్నానంతరమున క్రొత్త మఠముచుట్టును ఆవరణములోపలఁ దిరుగుచుఁబోయి, యొక బిల్వవృక్షమున కనతిదూరమున నిలిచి, వంగదేశీయులు దుర్గాపూజలకు ముందు తమగృహములందు పాడుకొనుపాటలలో నొకటియగు నీ క్రింది వంగభాషాగీతమును మెల్లగాఁ బాడుకొనఁజొచ్చెను :—

"ఓహిమాలయమా! గణాధిపతి నాకు శుభకరుఁడై యున్నాఁడు ...దండులగు సన్న్యాసులును జటాధరులగు యోగులునుగూడ ననేకులిచటికి వత్తురు" (ఇది దాని కడపటిచరణము).

ఈచివరపాదము శిష్యునకు మఱియొకసారి పాడి వినిపించి "తెలిసినదా? కాలక్రమమున పెక్కురుసాధువులును సన్న్యాసులును ఇటకు వత్తురు" అని స్వామిచెప్పెను; చెప్పి మారేడుచెట్టుక్రిందఁ గూరుచుండి "ఈబిల్వవృక్షముక్రిందిప్రదేశము మహాపవిత్రమైనప్రదేశము. ఇచట ధ్యానించుటవలన ఆధ్యాత్మికప్రబోధ మతిశీఘ్రముగా సిద్ధించునని శ్రీరామకృష్ణపరమహంసస్వామివారు సెలవిచ్చెడువారు" అని వచించెను.

శి—అయ్యా! ఆత్మానాత్మవివేకతత్పరులగువారికిఁగూడ శుభముహూర్త శుభస్థలాది విచారణ మావశ్యకమా?

గు—(శ్రీవివేకానందస్వామివారు)—దృఢమైన ఆత్మజ్ఞానముగలవారికి—స్థితప్రజ్ఞులకు—అట్టివిచారణ యక్కఱలేదు, కాని యాస్థితి అప్రయత్నముగా దాని కదియే ప్రాప్తింపనేరదు, చిరకాలాభ్యాసము వలననే సిద్ధింపఁగలదు. కనుకఁ బ్రారంభావస్థలో మనుష్యుఁడు బాహ్యసాధనసాహాయ్యములు గైకొనుచుఁ గ్రమముగా నిరపేక్షతాస్వతంత్రతలు నేర్చుకొనవలెను. పిమ్మట—స్థితప్రజ్ఞుఁడైనతర్వాత—అతని కిఁక బాహ్యసాహాయ్యాపేక్ష యేమియు నుండదు.

శాస్త్రములుచెప్పు వివిధములైన ఆధ్యాత్మికాభ్యాసములన్నియుఁ గూడ ఆత్మజ్ఞానసిద్ధికై యుద్దేశింపఁబడినవి. ముముక్షువుల యధికారతారతమ్యములఁబట్టి ఆయభ్యాసములు భిన్నభిన్నములుగానుండును. కాని యాశిక్షలుకూడ నొకవిధమైన కర్మకాండములోఁ జేరినవే; కర్మాశంక మున్నంతకాలము ఆత్మసాక్షాత్కారము కానేరదు. వేదవిహితములైన యభ్యాసనియమాదులు ఆత్మసాక్షాత్కారమునకుండు అవరోధములు గొట్టివేయునన్నమాట వాస్తవమేకాని, స్వయముగా ఆత్మను ప్రత్యక్షము చేయుశక్తి కర్మమునకు లేదు. జ్ఞానమును గనఁబడకుండఁ గప్పుకొనియుండు కొన్ని యావరకములను దొలఁగించుటకు మాత్రమే యది సమర్థము. అవి తొలఁగుటతోడనే స్వప్రకాశమువలన ఆత్మ ప్రత్యక్షమగును. తెలిసినదా? కనుకనే భాష్యకారులగు శ్రీశంకరాచార్యులవారు "బ్రహ్మజ్ఞానములో కర్మస్పర్శ మణుమాత్రమైనను లేదు" అని చెప్పినారు.

శి—ఔనుగాని అయ్యా! ఏదోయొకవిధమైనకర్మాచరణమువలనఁగాని ఆత్మావిష్కరణమునకుఁగల ప్రతిరోధములు పోవనప్పుడు, కర్మము జ్ఞానమునకు పరోక్షసాధనమనియైనఁ జెప్పక తప్పదు.

గు—కారణపరంపరనుబట్టిచూచినఁ బ్రథమదృష్టిని అది యట్లే కన్పట్టును. ఈపక్షముఁ గైకొనియే పూర్వమీమాంస "ఏదోయొకప్రయోజనముతోఁజేయుకర్మము ఆఫలము తప్పకుండనిచ్చును" అని చెప్పుచున్నది. కాని కేవలమును పర్యాప్తమును అగు ఆత్మయొక్క దర్శనము కర్మముచే నిబద్ధమును సంకుచితమును చేయఁబడఁగూడదు. ఆత్మాన్వేషకునిగూర్చి శాస్త్రమేమిచెప్పుచున్నదో విను! అతఁ డాధ్యాత్మికాభ్యాసక్రియలు చేయవలయునుగాని, వానిఫలముల నపేక్షింపఁగూడదు—అని. దానివలన నేమితేలుచున్నది? ఈయభ్యాసానుష్ఠానములన్నియును మోక్షకామియొక్క చిత్తశుద్ధికిమాత్రమే కారణములని! ఎందుచేత? కేవలము అట్టి యభ్యాసములవలననే యాత్మదర్శనమగునెడలఁ, గర్మఫలత్యాగము

చేయుమని శాస్త్రములు శాసింపవుకనుక ! ఫలాపేక్షతోఁగూడిన కర్మాచరణమును బోధించు పూర్వమీమాంసామతమును మాన్పించి ఖండించుటకే, భగవద్గీతలో నిష్కామకర్మసిద్ధాంతము ప్రతిపాదింపఁబడినది, తెలిసినదా ?

శి—ఔనుగాని, అయ్యా! క్రియాఫలములను త్యజింపవలయునో, అనవరతక్లేశకరములగు కర్మములను జేయుఁడని ప్రజలను మనమేల ప్రేరింపవలెను ?

గు—ఈ మనమానవజీవితములో నెవఁడును సదా యేదోయొక విధమైనపని చేయకుండ నుండలేఁడు. ఏదోయొకకర్మముచేయుట తప్పనప్పుడు ఆత్మపరిత్యక్తీకరణద్వారమున విముక్తి నిబడయునట్టి విధముగనే ఆకర్మమును మనుష్యుఁడు చేయవలయునని కర్మయోగము విధించుచున్నది. ఇఁక ఫలాపేక్షలేనిక్రియ చేయుమని బోధించిన, నెవఁడును ఆమాట విని యట్లుచేయఁడనికదా నీవొకయాక్షేపణము దెచ్చినావు, దానికిదిగో ప్రత్యుత్తరము—మనుష్యుఁ డేకర్మముచేయుచున్నను దానివెనుక నేదోయొక ప్రయోజనముండుననుమాట వాస్తవమే, కాని చిరకాలమట్లు కర్మములు చేయుచుఁ బోఁగాఁబోఁగా "ఒకకర్మ మింకొకకర్మములో దింపుచు అనేక జన్మపునర్జన్మములకు హేతువగుచున్నది" యనుసంగతి గోచరించును. అంతట మనుష్యుఁడు వివేకవికాసముగలవాఁడై "అంతములేని యీ జన్మపరంపరకు తెగుదల యెక్కడ ?" అని తనలోఁ దాను ప్రశ్నించుకొనుట కారంభించును. అప్పుడే "కర్మగతి గహనము" అని శ్రీకృష్ణభగవానుఁడు గీతలోఁ జెప్పినవాక్యముయొక్క సంపూర్ణార్థము నతఁడుగ్రహించి యనుమోదింపఁగలఁడు. కనుక సోద్దేశమైనకర్మము సుఖావహముగాదు—అని మోక్షాభిలాషి కనుఁగొనినప్పుడే, యతఁడు కర్మత్యాగముచేయును. కాని యెవఁడును కర్మములు చేయకుండ నుండలేఁడు, మనుష్యనిర్మాణ మట్లున్నది ; కావున కర్మత్యాగి యెట్టికర్మమును జేయఁబూనుకొనును ?

కించిత్ఫలాపేక్షయులేని స్వహితపరతారహితమైనకర్మమును. ఎందుచేత? కర్మఫలములలో అసంఖ్యాకములైన భావిజననమరణబీజములున్నవని యతని కిప్పటికిఁ దెలిసినదిగనుక! అందుచేత బ్రహ్మవేత్త సర్వకర్మత్యాగియై యుండును—అనఁగా పైచూపుల కతఁడేదోయొకపని చేయుచున్నట్లగపడినను, ఆకర్మమునందు సక్తుఁడై దానిచే బద్ధుఁడుగాఁడు. అట్టి మహానుభావులనే మన పావనమతగ్రంథములు కర్మయోగులని చెప్పుచున్నవి.

శి—అట్లయిన స్వహితైషిగానిబ్రహ్మజ్ఞాని చేయునిష్కామకర్మములు వట్టి పిచ్చివానిచేష్టలవంటివేనా?

గు—అట్టి వేలకావలయును? కర్మఫలత్యాగమనఁగా స్వశరీరసుఖమునకుఁగాని స్వమనస్సుఖమునకుఁగాని ఆపనిచేయకుండుట. బ్రహ్మవిదుఁడు స్వసుఖమున కెన్నఁడును బ్రయత్నింపఁడు. కాని యితరులసుఖముకై యతఁడు పనిచేయుట కేమియడ్డమున్నది? ఫలాసక్తుఁడుగాకుండ నతఁడేపని చేసినను లోకమునకది శ్రేయోదాయకమగును. "అనేకుల మేలుకై, యనేకుల సుఖముకై, అందుకైయే, యతఁడాపనిచేయును. అట్టివారికి క్రియావైయర్థ్యము గావించు ప్రమాద మెన్నఁడును గలుగదు" అని శ్రీరామకృష్ణపరమహంసస్వామివారు చెప్పుచుండెడివారు. "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి—ఇఁక ఆదిఋషులయొక్క వాక్కులనో, అర్థమే యనుసరించుచున్నది—వారివాక్కులు సార్థకములు, అమోఘములు" అని నీ వుత్తరరామచరిత్రలోఁ జదువలేదా? సర్వవికారశూన్యమగుచు మనస్సు ఆత్మలో లీనమైనప్పుడు, ఐహికాముష్మికఫలభోగవిరక్తి యుదయించును—జీవించియుండి యీలోకమునఁగాని చచ్చి స్వర్గాదులందుఁగాని కర్మఫలభోగసుఖము లనుభవించుకోరిక మనస్సులో నెంతమాత్రము నిలిచియుండదు, వాంఛాప్రవృత్తుల పరస్పరసంఘర్షమున నప్పుడంత మణుమాత్రము క్షోభపడదు. కాని మనస్సు ఆ తురీయావస్థనుండి

యహంకారమమకారాత్మకమైన యీలోకమునకు దిగినప్పుడు, పూర్వ కర్మ సంస్కారబలమున శరీరవ్యాపారములు యథాపూర్వముగా జరుగు చుండును. అప్పుడు మనస్సు సర్వలౌకికభావాతీతమగు నుదారస్థితిలో సాధారణముగా నుండును, భోజనాది శరీర వ్యాపారములు కేవలము వాని వాని యావశ్యకతనుబట్టి అబుద్ధిపూర్వకముగా నెఱవేర్పఁబడుచుండును, శరీరస్మృతి మిక్కిలి సన్నగిల్లి సడలిపోవును. భావాతీతమైన యాయున్నత స్థితి ప్రాప్తించినపిదపఁ గావింపఁబడు ఏకార్యమైనను, సరిగానే జరుపఁబ డును; అది సర్వజనసుఖావహమును సమస్తలోకకళ్యాణప్రదమును అగు ను. ఎందుచేత ? ఆయవస్థలో కర్తయొక్క చిత్తము స్వార్థపరత్వముచేతఁ గాని స్వలాభనష్టచింతనముచేతఁగాని కలుషితమై యుండదుగనుక ! సదా సర్వాతీతమగు నట్టిసమాధిస్థితిలోనుండియే సర్వేశ్వరుఁ డీయద్భుతప్రపం చమును సృజించినాఁడు ; అందుచేతనే యీసృష్టిలో లోపమేదియుఁ గా న్పింపదు. అందుచేతనే ఫలాసక్తి లేకుండ ఆత్మజ్ఞానిచేయు కర్మములు సలో పములును అసమగ్రములును గావనియు, సర్వమానవలోకమునకును సర్వభూతములకును సమస్తప్రపంచమునకును యథార్థమైన సుఖమును శుభమును కలిగించునవిగా నుండుననియు, నేను జెప్పుచుందును.

శి—కర్మజ్ఞానములు పరస్పరవిరుద్ధములనియు, పరమోత్కృష్ట మైన జ్ఞానములో కర్మమున కేమాత్రపుటవకాశమును లేదనియు — అ నఁగా కర్మసాధనమున బ్రహ్మసాక్షాత్కారము కాఁజాలదనియు — ఇప్పు డేకదా మీరు సెలవిచ్చినారు. అట్టిచో ప్రబలమైన రజోగుణమును రేఁపు మాట లప్పుడప్పుడు మీ రేల యాడుదురు ? "కర్మాచరణము, కర్మా చరణము, కర్మాచరణము—దీనికంటె గత్యంతరములేదు" అని మొన్న మొన్ననే మీరు నాతోఁ జెప్పినారు.

గు—సర్వప్రపంచము తిరిగిచూడఁగా, ఇతరదేశప్రజలతోఁబోల్చి చూచినప్పుడు, మన యీదేశములోనుండువారు మహాతమోబ్ధిమగ్నులై

యున్నట్లు నాకుఁ గానిపించినారు; పైకి సాత్త్వికసంపత్తిగల మహానుభావులుగాఁ దోఁతురు; లోపలమాత్రము దారుణాలసమహాజడతామాంద్యములే యుండును. అట్టి యలసులును సోమరులును విషయసుఖాసక్తులును అగుప్రజ లీప్రపంచములో నెంత కాలము జీవించియుండఁగలరు? మొట్టమొదట వెళ్లి పాశ్చాత్యదేశములు పరీక్షించి వచ్చి, శక్యమైనదో, అప్పుడు నామాటలు ఖండింపుము. ప్రతీచ్యప్రజావర్గములజీవితములలో ఎంత క్రియోత్సాహము, ఎంత సాహసము, ఎంత శ్రద్ధ, ఎంత పట్టుదల, ఎంత రజోగుణప్రకటనము, కనఁబడును! ఇఁక నీదేశములోనివా రెట్లున్నారు? రక్తము పేరుకొని రక్తనాళములలోఁ బ్రసరింపలేకున్నదేమో, శరీరము పక్షవాతగ్రస్తమై జడీభూతమైనదేమో, అనుకొనునంతదుస్థితిలో నున్నారు! కనుక మొదట మనదేశీయులలోని రజస్సునుకదల్చి పుష్టము చేసి, మాంద్యముపోఁగొట్టి చురుకుతనముగలిగించి, జీవికాసంపాదనముకై చేయవలయుసంగరమునకు వారిని తగినవారినిగాఁ జేయవలయునని నాసంకల్పము. శరీరములో సత్త్వలేక హృదయములో ఉత్సాహములేక మస్తిష్కములో అపూర్వకల్పనాసామర్థ్యములేక పడియున్న యీమన మృతపదార్థపిండము లేమిచేయును? పొడిచి లేపి అట్టివారిలో మరలఁ బ్రాణముపోయ నేను గోరుచున్నాను—ఆపనికే నాజీవితము ధారపోసినాను. అమోఘశక్తియుక్తములైన వేదమంత్రములను సాధనములుగాఁ జేసికొని, నేను వారిని లేఁపెదను. "ఉత్తిష్ఠత! జాగ్రత—లెండు! మేలుకొనుఁడు!" అనునభయసందేశము వారికిఁ జాటిచెప్పుటకే నేను బుట్టినాను. ఆపనిలో మీరు నాకు సహాయులుగండు. ఒకగ్రామమునుండి యొకగ్రామమునకు ఒకదేశభాగమునుండి యొకదేశభాగమునకు వెళ్లి, బ్రాహ్మణాది చండాలపర్యంత మందఱకు ఈయభయవార్తఁగొని బోధింపుఁడు. "అనంతమైనశక్తి మీలోనున్నది, మీరు అక్షయానందమునొక్క అంశభాక్కులు" అని వారందఱకుఁ జెప్పుఁడు. ఆరీతిగా ప్రేరేచి

వారిని రజోగుణపూరితులఁ జేయుఁడు—కూటికై కావించుకొనవలయు కొట్లాటకు మొదట వారిని శక్తిమంతులఁజేసి, యటుపిమ్మట వారితో మోక్షమునుగూర్చి ప్రసంగింపుఁడు. నిలువలేక పడిపోయియున్న మన దేశప్రజల యంతశ్శక్తుల రేపి మొదట వారిని నిలువఁబెట్టుఁడు; మంచి యాహారము, మంచిబట్టలు, పుష్కలమైనభోగములు, ఎట్లు సంపాదించు కొనవలెనో యది మొట్టమొదట నేర్పి—తరువాత ఆభోగబంధముల నుండి యెట్లు తప్పించుకొని విముక్తినొందవలెనో వారికిఁ దెల్పుఁడు. అల సత, నీచత, దంభకాపట్యాదులు—వీనితో దేశమంతయు నిండియు న్నది. మతిమంతుఁడైనవాఁ డిదంతయుఁజూచి యూరకుండఁగలఁడా? అతనికంట నీరుగాఱదా? చెన్నపట్నము, బొంబాయి, వంగరాష్ట్రము, పాంచాలము—ఏదైపుచూచినను నాకు దేశములో జీవచిహ్నములేమి యు నగపడవు! మీరు మహావిద్యావంతులని యనుకొనుచు మనస్సులో పొంగిపోవుచున్నారు! ఎంతపనికిమాలినపెంటచదువు మీరు నేర్చుకొన్నా రో యెఱుఁగుదురా? అన్యులభావములు అన్యభాషలో కంఠస్థముచేసి కొని, మీబుఱ్ఱలను వానిలో నింపుకొని, కళాశాలాదత్తములైన గౌరవ చిహ్నములు కొన్ని ధరించి, మే మెంతి విద్యావంతులమైనామని యుబ్బు చున్నారు. ఛీ! ఛీ! విద్యయనఁగా నిదియా? మీవిద్యయొక్క యవధి, పరమప్రయోజన, మేది? గుమాస్తాయగుటయో! కాపటికుఁడగు న్యాయ వాదియగుటయో! అత్యున్నతమైనయుద్యోగము దొరకునెడల, ధర్మా ధ్యక్షుఁడగుటయో—అనఁగా మఱియొకపేరితో పెద్ద గుమాస్తాయగుట యో! ఇంతేకాదా? ఇట్టివిద్య నీకుఁగాని నీదేశమునకుఁగాని యేమి మే లుచేయఁగలదు? కన్నులు దెఱచి చూడుము. పరమైశ్వర్యసంపన్నమని జగత్ప్రసిద్ధినడసిన భారతభూమినుండి యన్నముదొరకక కటికిదరిద్రులు శ్రోతలగుండెలు నీరగునట్లు చేయు క్షుధార్తధ్వనులువచ్చి వినఁబడుచుం డుటలేదా? నీ నేర్చినవిద్య యీక్షుద్బాధ పోఁగొట్టఁగలదా? పాశ్చాత్య

ప్రకృతిశాస్త్రజ్ఞానసాహాయ్యమున భూమిదున్ని, ఆహారపదార్థములు పం డింపుము—ఇతరులకు నీచదాస్యముచేసిగాదు! పాశ్చాత్యవిజ్ఞానము తో డ్పాటునకు నీస్వప్రయత్నములు గలిపి నూత్నవస్తూత్పత్తి మార్గములు కని పట్టుటవలన! కనుకనే స్వతంత్రముగా పరాపేక్షలేకుండ అన్నవస్త్రములు కల్పించుకొనుసమర్థత సమకూర్చుకొనుటకై క్రియోత్సాహపూరితులై యుండుఁడని యీదేశప్రజలకు నేను బోధించుచుందును. కూడుగుడ్డలకు కఱవై, తత్సంబంధమైన చింతలలో మునిఁగి, దేశము వినాశస్థితికి వచ్చి నది—దానిని వారించుటకు నీ వేమిచేయుచున్నావో చెప్పుము. నీ వేదాది మతగ్రంథములన్నియు గంగలోఁ బాఱవైచి, అన్నవస్త్రములు సంపా దించుకొనుసాధనములు మొదటఁ బ్రజలకుఁ గఱపుము, తరువాత నీవు వేదములు వారికిఁ జదివి వినిపించుతఱి వచ్చును. తీవ్రమైన కర్మప్రవృత్తి వారిలోఁ గలిగించి, ఐహికములైనవారిదారిద్ర్యాదికష్టములు తొలుత దొలఁగించివేయనిచో, నీ వేదాంతవచనములు వారెవరును వినరు. కావున నేఁజెప్పునది యేమన—మొదట నైసర్గికముగా నీలో నిగూఢమైయున్న ఆత్మశక్తిని లేపుకొనుము, తరువాత నీచేతనైనంతవఱకు సామాన్యజనుల లో నట్టిశక్తి యందుండు విశ్వాసమును రేఁపుము; ఆహారపరికల్పనము చే సికొండని మొదట వారి కుపదేశించి పిదప మతబోధనము గావింపుము. సోమరులై గోళ్లుగిల్లుకొనుచుఁ గూరుచుండుట కవకాశములేదు—వెనుక నుండివచ్చి మృత్యుదేవత మనల నెప్పుడుపట్టుకొనునో యెవరెఱుఁగుదురు?

(ఈవాక్యము లుపన్యసించుచున్నప్పుడు, ఓజోవిషాదదయాను తాపమిశ్రితమైన దీప్తియొకటి స్వామివారిముఖముపైఁ గానిపించెను. మ హాతేజోమయమైయున్న ఆముఖవర్చస్సుచూచి, శిష్యుఁడు భయభక్తి వివశమైన మనస్సుతో మాటాడలేకుండెను. కొంతసేపటికి స్వామి మరల నిట్లు పలికెను).

క్రియాపాటవమును, తమ్ముఁ దా మాధారముచేసికొనియుండఁగల

శక్తియు, నీదేశప్రజలకుఁ గాలక్రమమున రాకమానవు—అని నాకు స్పష్టముగా గోచరించుచున్నది. అట్లు జరుగకతీఱదు. బుద్ధిమంతుఁడు పురోభాగమందు తరువాతి మూఁడుయుగములస్వరూపమును స్పష్టముగాఁ జూడఁగలఁడు. శ్రీరామకృష్ణులవా రవతరించినది మొదలుకొని ప్రాగ్దిశాప్రాంతము ప్రభాతభానుకిరణములచేఁ బ్రకాశించుచున్నది; కాలక్రమమున దేశమంతయు మధ్యందినమార్తాండమహాదీప్తితోఁ దేజరిల్లనున్నది!

---

## IV-4

### ( అభివాదాశీర్వాదములతరువాత )

శి—ఏదో పెద్దయుత్తరము వచ్చినట్లున్నది!

గు—ఉత్తరముమాత్రమేకాదు. "ఇంకను మూఁడు గురుశిష్యసంవాదములను వ్రాయుఁడు"అని వెనుకఁగోరినయతఁడే శ్రీ వివేకానందస్వామివారి సంభాషణాదులుగల యేడవసంపుటములోని ప్రకరణమునుండి మఱియొకభాగ మెత్తి వ్రాసి దానిఁగూడ నాంధ్రమున ననువదించి పత్రికకుఁ బంపుఁడని కోరినాఁడు. అదియే చూచి యాంధ్రీకరించుచున్నాను.

శి—ఆంధ్రీకరణమైనదా?

గు—ఇప్పుడేయైనది.

శి—విషయము తక్కినవానివలె సాంఘికవిషయమేనా?

గు—ఔను! మనదేశదారిద్ర్యమును జూచినపుడెల్ల వివేకానందస్వామి హృదయ మెంతపరితపించెడిదో యీసంభాషణమునుబట్టి నీవు గ్రహించుకొనఁగలవు.

శి—సరియేకాని, అయ్యా! అన్నియు వదలుకొనవలయుసన్న్యాసికి ఈ ప్రవృత్తిబాధలేల? ఎక్కడనో యొకచోట ముక్కుమూసికొని కూరుచుండఁగూడదా?

గు—చిక్కుప్రశ్నయే వేసితివి? జ్ఞానులును భక్తులును రెండురక ములవారుగా నుందురు. కేవలస్వతరణార్థము కృషిచేయువా రొకతరగ తివారు. అట్టివా రేయడవిలోనో యేకొండగుహలోనో తపస్సుచేసికొను చుందురు. వారికిని లోకమునకును సంబంధముండదు. పరతారణార్థము పాటుపడి పనిచేయువారు రెండవతరగతివారు. వారు తమయావచ్ఛరీర శక్తియు యావద్బుద్ధిసామర్థ్యమును యావదాధ్యాత్మికబలమును లోకో పకారార్థము వినియోగపఱుతురు; అంతస్సన్న్యాసులై స్వార్థపరతాద్య హంకారప్రవృత్తులఁ జంపుకొని యుద్దండకర్మయోగులై లోకోద్ధరణార్థ మనేకసత్కార్యములు నిష్కామబుద్ధితోఁ జేయుచుఁ దద్ద్వారమున లో కమునకుఁ గల్యాణమును గలిగించుచుఁ దామును దరింతురు. ప్రజాసేవ యే వారికిఁ బరమేశ్వరసేవ. శిలాద్వైతులై పడియుండక వారు సదా యనురాగపూర్ణహృదయులై యుందురు. శ్రీబుద్ధదేవుఁడు, శ్రీశంకర రామానుజమధ్వస్వాములు, శ్రీగౌరాంగస్వామి,శ్రీరామకృష్ణపరమహం సస్వామి, మున్నగువారీగణములోఁ జేరినవారే. రామకృష్ణపరమహంసు ని జ్ఞానపుత్రరత్నమే వివేకానందస్వామి.

శి—అట్లైన, ఆయన యుపదేశములు స్మృత్యాదేశములుగా గ్ర హించి యాచరింపవచ్చునా?

గు—నిస్సందేహముగా! మేధావులును, నీతిమంతులును, తప స్సంపన్నులును, నిర్మములును, నిరహంకారులును, కేవల లోకహితతత్ప రులును, అగు మహానుభావులు తత్తత్కాలోచితములైన స్మృతులు ర చించి ప్రజల కొసఁగినారు. అవి సార్వకాలికములు కాఁజాలవు; కాలము లును ప్రపంచపరిస్థితులును మాఱినప్పుడు అవి మాఱకతప్పదు. మాఱని చో అప్రవాహోదకమువలె ననర్థకరములగును. ప్రజలు భగవద్దత్తమైన బుద్ధియు నుచితానుచితజ్ఞతయును గలవారుగాని జడములైన అయోయం త్రములవలె నేర్పఱిచినపనిమాత్రమే చేయుట కుద్దేశింపఁబడినవారుగారు.

బహుస్మృతు లుండుటయే దానికిఁ బ్రబలనిదర్శనము.

శి—సర్వశాస్త్రజ్ఞులును త్రికాలవేదులును అగువారే స్మృతులు సవరించుట కర్హులని చెప్పుదురే కొందఱు ?

గు—అది యతిశయోక్తి ! అట్టివాఁడు భగవంతుఁ డొక్కఁడే యున్నాఁడు. స్మృతికర్త లెంతగొప్పవారైనను మనుష్యులే, కించిజ్ఞులే, సప్రమాదులే; సర్వకాలములకును సరిపడుస్మృతి యొక్కసారియే రచించి పెట్టుసామర్థ్యము వారికిఁ గలదనుట సాహసము!

శి—అట్లైన వివేకానందస్వామి మున్నగువారు స్మృతికర్తలంత సమర్థులనియే మీయభిప్రాయమా ?

గు—అట్టి గొప్పవారి నొకరితో నొకరిని బోల్చి వారి తారతమ్యములు గనిపట్టి చెప్పుశక్తి నాకులేదు. కాని యూహించి ముందువారికి నియమములేర్పఱచువారికంటె స్థితిగతులు స్వయముగాఁ జూచి పరిశీలించి బోధించు నేటికాలపుబుద్ధిమంతులును సత్యవంతులును స్వార్థపరిత్యాగులును లోకహితైషులునునే యెక్కువ విశ్వాసపాత్రులనుకొనుచున్నాను. స్మృతికర్తలందఱును ముక్తులైపోయినఁదక్క, జన్మపరంపరాసిద్ధాంతము పొల్లక్కయైనఁదక్కఁ, బూర్వస్మృతికర్తలే తరువాత ననేకజన్మములెత్తి యుత్తరోత్తరాధికములైనబుద్ధిబలనీతిబలాధ్యాత్మికబలములు గడించుకొని నేటి మహానుభావులై పుట్టుదురనుట సత్యదూరము కాఁజాలదు.

శి—వివేకానందస్వామికూడ మనుష్యుఁడును బ్రమాదవశుఁడును అని చెప్పవలయుఁగదా! ఆయనయుపదేశములు వచ్చుకాలముల కనుకూలములు కానియెడల నేమిచేయవలెను ?

గు—ఆకాలపుబుద్ధిమంతులును శీలవంతులును ఆలోచించుకొని వానిని సవరించి గ్రహించుటయో సంపూర్ణముగాఁ ద్యజించుటయో చేయవలెను. ఆయననడిగిన నట్లేచెప్పును. పూర్వస్మృతికర్తలనడిగినను అట్లే చెప్పియుందురని యూహించెదను.

శి—ఈధర్మశాస్త్రచర్చాసాగరమునకు దరియనునదిలేదు, పోనిండు! తాము తెనిఁగించిన వివేకానందస్వామిసంభాషణ మీఁక దయచేసి వినిపింపుఁడు.

గు—మంచిది, విను!

(36—స్థలము, బేలూరుమఠము—సంవత్సరము, 1902)

తూర్పుబంగాళములో సంచారముచేసి తిరుగ మఠమునకువచ్చి వివేకానందస్వామి బాలకునివలె అమాయికముగాఁ బ్రవర్తించుచుండెను. ప్రతిసంవత్సరము కొండజాతివారగు "సంతాలు" లనువాండ్రు కొందఱు వచ్చి మఠనిర్మాణములో కూలిపని చేయుచుండిరి. స్వామి వాండ్రతోఁ జనవుగాఁ బ్రసంగించుచు వేళాకోళములాడుచు వారి కష్టసుఖములు వినుటకుఁ గుతూహలపడుచుండెను. ఒకరోజున కలకత్తాలోని పెద్దమనుష్యులు పెక్కురు స్వామినిదర్శించుటకు మఠమునకువచ్చిరి. అప్పుడే వివేకానందస్వామి యెంతోప్రియముగా హృదయపూర్వకముగా "సంతాలు" లతో సంభాషింపఁదొడఁగినందువలనఁ దనదర్శనమునకు గొప్పవారు వచ్చిరనువార్త తెచ్చినవానితో "ఇప్పుడు వీరిని విడిచి రాఁజాలను, వీరిసాంగత్యమే నాకుఁ బరమాహ్లాదకరముగా నున్నది" అనిచెప్పి, చెప్పినట్లే మఠగృహాగతులగుపెద్దమనుష్యులను జూచుటకు ఆబీద "సంతాలు" లను విడిచి ఆయన పోలేదు.

ఆ "సంతాలు" లలో "కేష్టు" అనువాఁ డొకఁడుండెను. అతఁడన్న, స్వామి కెంతయోప్రీతి. ఆపనివాండ్రతో స్వామి ప్రసంగించుటకు వచ్చినప్పుడు "స్వామీ! పనిచేయుచున్నప్పుడు తాము మాయొద్దకు రాకుఁడు; మీతో మాటలాడుచుండిన, మాపని యాఁగిపోవును. తరువాత, పనిపరీక్షించు ఆసన్యాసిబాబు వచ్చి మమ్ముఁ జీవాట్లుపెట్టును" అని కేష్టు స్వామితో మొఱపెట్టుకొనుచుండును. ఆమాటలు విని జాలిపడి "భయములేదులే, ఆయన మిమ్మేమియు ననఁడులే! మీప్రదేశమును

గూర్చి నాకుఁ గొంచెము చెప్పుము" అని స్వామి వానికి ధైర్యముచెప్పి వారి సంసారవిషయములు ప్రస్తావములోనికిఁ దెచ్చుచుండును.

"ఒకనాఁ డిట నీవు భోజనముచేయుదువా?" యని స్వామి యొకరోజున కేష్టు నడిగెను. "మీరు ముట్టుకొన్న యాహారము మేము తినము; ఉప్పువేసినయాహారము తినినయెడల మేము జాతిభ్రష్టులమగుదుము!" అని కేష్టు పలికెను.

స్వామి—ఉప్పేల నీవు పుచ్చుకొనవలెను? ఉప్పువేయకుండ కూర చేయించినచో నీవు పుచ్చుకొందువా?

కేష్టు అందుల కంగీకరించెను. స్వామియుత్తరువులమీఁద రొట్టె, కూరలు, తీపిపిండివంటలు, పెరుఁగు, మున్నగుపదార్థములు తయారుచేసి "సంతాలు" లకు వడ్డించినారు. తనయెదుటఁ గూరుచుండి భోజనము చేయుఁడని స్వామి వారిని గోరెను. వా రట్లుకూరుచుండి భుజించుచుండఁగా "ఈపదార్థమువంటి పదార్థము మే మెన్నఁడును రుచిచూడలేము; ఇది ఎక్కడనుండి తెచ్చినారయ్యా?" అని కేష్టు అడిగెను. అట్టి దివ్యమృష్టాన్నభోజనము వారికిడుచు స్వామి యిట్లు పలికెను:—"మీరందఱు నారాయణులు, ప్రత్యక్షపరమేశ్వరులు; నేఁడు నేను నారాయణునకు విందుచేసినాను."—తఱచు స్వామి నుడువుచుండెడు "దరిద్రనారాయణారాధనము" తానే యొకరోజున నీరీతిగా నాచరించెను.

భోజనానంతరము "సంతాలులు" విశ్రాంతిగొనుటకై వెళ్లినప్పుడు, స్వామి తనశిష్యునితో నిట్లుపల్కెను:—"వారిలో నాకు యథార్థ నారాయణస్వరూపము కనఁబడినది—అట్టి యనాడంబరజీవనము, అట్టి యవ్యాజప్రేమ, అట్టి యమాయికత్వము, నేను మఱియెచటను జూడలేదు!" తరువాతఁ దోడిమఠసన్న్యాసులవైపు దిరిగి యాయన యిట్లు పన్యసించెను:—

"వా రెట్టి యమాయికజీవనులో చూడుఁడు! వారి దైన్యకష్ట

ములు మీ రించుక తగ్గింపఁగలరా? అట్లుచేయనిచో, మీ కాషాయవ స్త్రధారణమువలన నేమిప్రయోజనము? పరులమేలుకై సమస్తము త్యజించుటయే, సర్వస్వము సమర్పించుటయే, నిజమైనసన్న్యాసము. జీవన సుఖమేదియు వారనుభవింపలేదు. ఈమఠమును ఇతరమైనసమస్తమును అమ్మివైచి దిక్కులేని యట్టిదరిద్రుల కాసొమ్ము పంచిపెట్టుబుద్ధి నా కప్పు డప్పుడు కలుగుచుండును. మనము చెల్లనైనను శరణములుగాఁ జేసికొని యున్నాము! అయ్యో! మనదేశీయులకుఁ దినుటకేదియు దొరకకున్న దే! అదిచూచుచు నిర్దయులమై మనము అన్నకబళమెత్తి నోట నెట్లువైచు కొనఁగలము? నేను పాశ్చాత్యదేశములకుఁ జని యటనుండినప్పుడు "ఇచటిజనులు పుష్పశయ్యలపైని నిదురించుచున్నారు, సర్వవిధములైన స్వాదుమృదులాహారపదార్థములను భుజించుచున్నారు, వా రనుభవింపని భోగ మెద్దియులేదు. ఇఁక నాదేశమువారన్ననో, తిండికిలేక మరణించు చున్నారు. అమ్మా! వారికి బ్రదుకుఁదెరువేమియుఁ జూపవా?" అని జగజ్జననిని ప్రార్థించుకొనెడువాఁడను. మతబోధకుఁడుగా నేను బశ్చిమ భూములకుఁ బోయినప్రయోజనములలో, ఈదేశపుఁబ్రజలక్షుద్బాధఁ బాపుమార్గ మన్వేషించుట యొకటి.

అన్నముదొరకక పస్తుండుమనదేశపుదరిద్రజనులను జూచినప్పుడు —వైదికభగవదారాధనక్రియలన్నియుఁ జదువులన్నియుఁ గట్టివైచి, యూరూరికిఁబోయి బిచ్చమెత్తి, శీలబలముచేతను యోగసాధనబలముచే తను ధనవంతులకు నచ్చునట్లుబోధించి, వారినుండి ధనముసంపాదించి తెచ్చిపెట్టుచు, నాయావజ్జీవము దరిద్రప్రజాసేవకైయే ధారపోయవలెను.— అను తీవ్రవాంఛ నాకుఁ గలుగుచుండును.

అయ్యయ్యో! దేశదరిద్రప్రజనుగూర్చి యెవ్వరును ఆలోచింపరు. పాటుపడి యందఱకు నాహారపదార్థములను కల్పించిపెట్టు వీరు దేశమున కు కశేరుకవంటివారు. కృషీవలులు, కూలివాండ్రు, పాకీవాండ్రు,

మున్నగు ఈపేదవారు ఒక్కరోజు వారువారుచేయుపనులు మానివేసిన యెడల, బట్టనవాసులందఱును గగ్గోలుపడుదురు. అయిననేమి? వారి కష్టదశలో జాలిపడి వారి నోదార్చువారెవ్వరును లేరు. హిందువులకు దయాదాక్షిణ్యములు లేకపోవుటచే చెన్నరాష్ట్రములో నెన్నివేలమంది మాలలు క్రైస్తవులయిపోవుచున్నారో చూడుడు! కేవలక్షుద్బాధచేత వారట్లగుచున్నారని మీరెంచుకొనకుడు. మనలనుండి అణుమాత్రపు టనుకంపాసానుభూతులును వారికి వచ్చుటలేదుగనుక వారు మనలవిడిచి పోవుచున్నారు. "మమ్మంటకుడు! మమ్మంటకుడు!" అనియే యహో రాత్రములు మనము కేకలుపెట్టుచున్నాము! దయాదాక్షిణ్యములు లేశ మైనను దేశములో నున్నవా? "నన్ను ముట్టుకోకు నామాలకాకి" జాతివారే యందఱును! అట్టియాచారముల నావలికిం దన్నివేయుఁడు. ఈయస్పృశ్యతావబోధములన్నియు విఱుగఁగొట్టిపోయి శ్రీరామకృష్ణపర మహంసస్వామి వారిపేరిమీఁద "పరపాదాక్రాంతులై బహుబాధలు పడు చుండు నోపరమదరిద్రులారా! దుఃఖమగ్నులై యుండు నోదీనజనులా రా! రండు! మీరందఱును రండు!" అని యఱచుచు నెల్లర నొకటి గాఁ జేయవలయునను చిత్తోద్రేకము నా కప్పుడప్పుడు కలుగుచుండును. పడిపోయిన యీపామరజనులు లేచినఁగాని మనదేశమాతకు మేలుకువ రాదు. వారి కన్నవస్త్రములుగలుగు నేర్పాటులైన మనము చేయలేకపో యితిమి! వారి కింక మనముచేసిన మేలేమున్నది? కటకటా! సంసారనిర్వ హణనిపుణత్వము—ప్రపంచజ్ఞానము—వారి కెంతమాత్రములేను కను కనే, రేయును బగలును బశువులవలెం బాటుపడుచుండినను, వారికి కూ డుగుడ్డలు దొరకకున్నవి. వారి కన్నెప్పమూతలు విప్పి చూపుదము. వారిలోను, నాలోను, అందఱిలోను, ఒక్కబ్రహ్మమే యున్నదని పట్ట పగటిభానుదీప్తివలె స్పష్టముగా నాకుం గానిపించుచున్నది. ఒక్కశక్తి యే యందఱిలోను నున్నది. ఉన్న యొక్కభేదమును దాని యావిష్కర

ణములోనే యున్నది. శరీరమంతటను రక్తము ప్రసరింపకున్న నాశరీరము బాగుగా నుండఁగలదా? బలభాగ్యాదు లంతటను వ్యాపింపకుండ నేదేశ మెన్నఁ డభివృద్ధిలోనికివచ్చినది? ఒక్క యవయవము పక్షవాతముచేఁ బడిపోయినప్పుడు, ఇతరావయవములు పసిగానున్నను, ఆశరీరముతో నం తగాఁ బనిచేయలేము—ఈమాట పరమసత్యమైనమాట యని తెలిసి కొనుఁడు.

శిష్యుఁడు—ఈదేశజనులమతములలోను భావములలోను నానా త్వవైషమ్యము లెంతోయధికముగానున్నవి; ఇట్టిస్థితిలో వారి కైకమ్యస్నే హభావములు కలిగించు టతికష్టమైనపని.

స్వామి—(కోపముతో) ఏపనియైనను కష్టమని నీవెంచు నెడల, నీ విటకు రాకు. పరమేశ్వరునియనుగ్రహమువలన సర్వమార్గములును సుఖ సాధ్యములగును. జాతిభేదవ్యాయాభేదములు పాటింపకుండ కష్టజీవులకు ను కటికిదరిద్రులకును సేవచేయుటయే నీపని, ఫలవిచారణావశ్యకత నీకు లేదు. నీపని చేసికొనుచుఁ బోవుటయే నీవిహితధర్మము, తరువాత దాని వెంట నన్నియుఁ దమంతటఁదామే వచ్చును. నే నవలంబించుకర్మపద్ధతి యొక్క ప్రయోజనము కట్టుటగాని పడఁగొట్టుటగాదు. ప్రపంచచరిత్ర చదివిచూచినయెడల, దేశములో నేదోయొకకాలమున నొకమహాత్ముఁ డుదయించి తత్కాలప్రజావర్గమునడుమఁ బ్రస్ఫుటతేజోమూర్తియై నిలఁ బడినట్టును, ఆయనయుదారభావములవలనఁ బురికొల్పఁబడి శతసంఖ్యాకు లగుజనులు నడుముకట్టుకొని బయలుదేఱి ప్రపంచమున కెంతయో మేలు గావించినట్టును, మీకు విదితముకాఁగలదు. మీరందఱును బుద్ధిశాలులై నతరుణవయస్కులు, చిరకాలమునుండి యిచటికి వచ్చుచున్నారు. నాయ నలారా మీ రేమిచేసితిరో చెప్పుఁడు! ప్రజాసేవకై యొక్కజన్మము సమర్పింపలేరా? వచ్చుజన్మములో మీరు వేదాంతాదిశాస్త్రములు చదువుకొనవచ్చును. ఈజన్మముమాత్రము పరోపకారముకై వినియో

గింపుఁడు, అప్పుడు మీరిటకు వచ్చుచుండుట వ్యర్థముగాక సఫలమైన దని తెలిసికొని నేను సంతోషించెదను.

ఈమాటలుచెప్పి వివేకానందస్వామి గాఢచింతానిమగ్నుఁడై మౌనముతోఁ గొంతసేపు కూర్చుండి తరువాత నిట్లు పలికెను. "ఎంతోకఠిన తపశ్చర్యచేసినపిమ్మట నేను పరమసత్యమని గ్రహించినప్రధానవిషయమిది —భగవంతుఁడు ప్రతిజీవాత్మలోను నున్నాఁడు, తదితరుఁడైన భగవంతుఁడులేఁడు. జీవాత్మసేవచేయువాఁడు తప్పకుండఁ బరమాత్మసేవచేయువాఁడే."

అంత సంభాషణమాఁపి కొంతసేపు స్వామి యూరకుండి, పిదప శిష్యునివంకకుఁదిరిగి "నేను నేఁడు నీకుఁ జెప్పినమాటలు నీహృదయఫలకమున గట్టిగా లిఖించిపెట్టుకొనుము! వాని నెన్నఁడును మఱవకుము! జాగ్రత్త!" అని చెప్పెను.

---

# IV-5

శి—నమస్కారములు! ఏదో వ్రాయుచున్నారు!

గు—వ్రాయుట యిప్పుడే అయినది. శ్రీవివేకానందస్వామివారు ఆయనస్నేహితుఁడగు బాబూప్రమదమిత్త్రుఁడుగారికి ౩౦-౫-౧౮౯౭ తేదీని వ్రాసిన కడపటియాంగ్లలేఖయొకటి నీవంటి ప్రియశిష్యుఁడే యొకఁడు మెత్తి వ్రాసి యెన్నాళ్లకిందటనో నాకుఁ బంపినాఁడు.

శి—శ్రీస్వామివారిప్రసంగములు మూఁడో నాలుగో వెనుక మీకంపినయాయనయేనా?

గు—ఔను!

శి—ఇదికూడ ఆంధ్రపదివర్తనార్థమే పంపినారా?

గు—"మీరు పరిశీలనదృష్టితోఁ జదువుటకుమాత్రమే" యని

వ్రాసినాఁడుగాని, నేనది తెలిఁగించి యేపత్త్రికలోనో ప్రకటింపవలయున ను నుద్దేశమే యతనికుండిన ట్లూహించినాను.

శి—ఆయన కీలేఖ యెచటదొరకినది ?

గు—'ప్రబుద్ధభారత' యను సుప్రసిద్ధాంగ్లపత్త్రికలోఁ జూచి నాఁడు.

శి—మహానుభావుఁడగు వివేకానందస్వామి వ్రాసినది లోకోప కారకముగా నుండకమానదని తలఁచెదను.

గు—నేనును అట్లే యెంచుచున్నాను—కాని......

శి—"కాని" యని నీళ్లు నములుచున్నారేమి ?

గు—బాబూప్రమదమిత్త్రుఁడుగారు శ్రీస్వామివారివలెనే యా నాఁటి మహామేధావులలో నొకరఁట. స్వామితోపాటు ఆధ్యాత్మికకృషి చేసిన ప్రాణమిత్త్రుఁడఁట. ఉత్తరముతీరుచూచిన నుభయులకును అభిప్రా యభేదము విశేషముగా నున్నట్లు తోఁచుచున్నది.

శి—స్వామి తిట్టుచు వ్రాసినాఁడాయేమి ?

గు—తిట్లులేవుగాని తిట్లకంటెను తీవ్రముగానుండు దెప్పుళ్లున్నవి. సన్న్యాసియైనను స్వామివ్రాఁతలో రజోగుణపరికోపమును అభిమానాతి శయమును స్ఫుటముగాఁ గానిపించుచున్నవి.

శి—వివేకానందస్వామి యెప్పుడును పిడుగునోటివాఁడే!

గు—పిడుగుతోఁబడు చల్లనివర్షము సస్యసమృద్ధినిచ్చునట్లు ఆ యన గాటుమాటలతో వెలువడు బోధామృతము చదువువారిని సత్త్వ సంపన్నులుగను దేశోపకర్తలుగను జేయును. భోజనవిషయమునను బూ ర్వాచార్యులవిషయమునను మాత్రము అభిప్రాయభేదము లుండకమా నవు.

శి—అలాగుననా? ఏదీ! దయచేసి యాలేఖ చదువుఁడు.

గు—ఇదిగో! వినుము!

ఆల్మోరా
30 మే ౧౮౯౭.

ప్రియమిత్త్రమా,

తప్పించుకొనశక్యముగాని గృహసంబంధమైన విపత్తేదో నీకుఁ దటస్థించినదని నే విన్నాను. జ్ఞానవంతుఁడవగుని న్నాకష్ట మేమిచేయఁగలదు? అయినప్పటికిని సాపేక్షకమగు ఐహికజీవనమునకు స్నేహసంసర్గసుఖము లానుషంగికములని తెలియుటచే, ఇందామాట నే నెత్తుకొనవలసి వచ్చినది. కాని యట్టి దుఃఖసమయములు తఱచుగా మంచియాధ్యాత్మికానుభవమును గలిగించుచుండును. తాత్కాలికముగా తమోమేఘములు తొలఁగిపోయి సత్యాదిత్యుని దివ్యతేజస్సు దృగ్గోచరమగును. కొందఱకు సంసారబంధము సగపాలు సడలిపోవును. అన్నిబంధములలోను దృఢతమమైనది ప్రతిష్ఠాబంధము. ఖ్యాతిభంగభీతి మరణభీతికంటెను బలవత్తరమైనది; అయినను అట్టి యవసరములం దీపాశముకూడఁ గొంచెము వదులయిన ట్లగపడును. మనుష్యాభిప్రాయములు వినుటకంటె మనలో వసియించియుండు పరమేశ్వరునిమాట వినుట కడుశ్రేయస్కరమని మనసున కాక్షణమందుఁ బొడకట్టును. కాని మ బ్బంతలో మరలఁగ్రమ్ముకొనును—మాయయనఁగా నిదియే!

చిరకాలమునుండి నేను నీకు సాక్షాత్తుగా ఉత్తరములువ్రాయుట లేకపోయినను, నిన్నుగుఱించిన వార్తలన్నియు నితరులనుండి నాకుఁ దెలియుచునేయున్నవి. కొంతకాలముక్రిందట భగవద్గీతానువాదపుప్రతియొకటి దయతో నీవు నా కింగ్లండునకుఁ బంపితివి. గ్రంథోపరితలమున నీవు వ్రాసిన దొకపంక్తియే కలదు. ఆపుస్తక మందినట్లు నేనును మూడుముక్కలతోఁ బ్రత్యుత్తరమువ్రాసి నీ కంపితిని; అందుచే నీపై నాకుండిన పూర్వానురాగ మిపుడున్నదో లేదోయను సందేహము నీకుఁ గలిగినట్లు నాకుఁ దెలిసినది.

ఆయనుమానమున కాధారములేదు. కాని నాసంక్షిప్తలేఖమునకు మాత్రము సరియైన కారణములున్నవి :—

నాలుగైదేండ్లకు ఆంగ్లపరివర్తనమందినగీతాగ్రంథముదెక్కపైని నీచేతితో వ్రాసిన ఆయొక్కపంక్తి మాత్రమే చూచుఅదృష్టము నాకుఁ బట్టినది. అంతకంటె నధికముగా వ్రాయుటకు నీ కవకాశములేనప్పుడు ఎక్కువగా వ్రాసినయుత్తరము చదువుకొనుటకుమాత్రము నీకుఁ దీఱికయుండునా యనుసంశయము నాకుఁ దోఁచినది. ఇది ప్రథమకారణము.

హిందూమతప్రచారకులగు తెల్లతోలువారితో నీకు మిక్కిలి స్నేహము కుదిరినదనియు, తుంటరులగు మనదేశపు నల్లవాండ్రన్న నీ కసహ్యమనియు, నాకుఁ దెలియవచ్చినది. ఏతద్విషయకమైనభయము రెండవ కారణము.

ఇఁక మూఁడవకారణమేమనఁగా, నేను మ్లేచ్ఛశూద్రాదులలోఁ జేరినవాఁడను, ఆహారనియమములేక యన్నియుఁ దినువాఁడను, వీరు వారనక అందఱితోఁ గలిసి యీదేశములలోను పైదేశములలోను బహిరంగముగా భుజించువాఁడను. అదియుఁగాక నాయభిప్రాయములు మాఱి మహావికృతములైనవి. నిర్గుణమును కేవలమును అగు బ్రహ్మపదార్థము నాకగపడి యెఱుకపడుచున్నది—అని చెప్పఁగలను ; కొందఱుపురుషులలో ఆమహాతత్త్వముయొక్క ఆవిష్కరణము అసాధారణముగా నాకుఁ జూపట్టుచున్నది ; అట్టి యవతారపురుషులు భగవంతులని చెప్పినచో నాకదియును గ్రాహ్యమగుచున్నది. అంతేకాని కేవలబుద్ధిచేఁ గల్పింపఁబడి స్వీకరింపఁబడుచున్న జగత్కర్త్రాదులపైకి నామనసు ప్రసరింపదు.

నాజీవితములో అట్టి భగవదవతారపురుషుని జూచినాను, ఆయనయాదేశములననుసరించి ప్రవర్తించుటకే నేను బ్రతికియున్నాను. స్మృతికర్తలును పురాణకర్తలును కించిజ్జ్ఞులు ; అవి భ్రమప్రమాదజన్యములును జాతిద్వేషప్రేరితములును అగు వాక్యములతో నిండియున్నవి. విశాల

హృదయమును ఔదార్యానురాగములను జూపు నందలి కొన్ని భాగములు మాత్రమే స్వీకరణార్హములై యున్నవి, తక్కినవి త్యాజ్యములు. ఉపనిషత్తులును గీతయునే యథార్థములైన ఆమ్నాయములు. రాముఁడు, కృష్ణుఁడు, బుద్ధుఁడు, చైతన్యుఁడు, నానక్కు, కబీరు, మున్నగువారు నిజమైన అవతారపురుషులు. ఎందుచేత? వారిహృదయములు ఆకాశమంత విశాలములై నవిగనుక; అందు ముఖ్యుఁడు రామకృష్ణుఁడు. శంకరరామానుజాదులు సంకుచితహృదయులైన కేవలపండితులుగాఁ గనఁబడినారు. ఆప్రేమయేది? ఇతరుల దుఃఖముచూచి పరితపించి వలవలయేడ్చు ఆమృదులహృదయమేది? వట్టిచదువు! శుష్కపాండిత్యము! తనమోక్షముకై యే తహతహ! మితిలేనితొందర! కాని అయ్యా! అది సాధ్యమగునా? ఎప్పుడైనఁ బూర్వ మట్టిముక్తి సిద్ధించినదా? ముందెన్నఁడైన సిద్ధింపఁగలదా? అణుమాత్రపు టహంభావశేషమైనను లోన నున్నంతకాలము అట్టిముక్తి లభించునా?

మఱియొక వైపరీత్యము! వర్ణరూపపృథగ్భావము సంఘమును జీల్చి పాడుచేయు మహానర్థకరమైన భావమును మాయామూలమును—అను విశ్వాసము నానాఁటికి పెరిఁగి నామనసులో దృఢముగా నాటుకొనుచున్నది, పుట్టుకనుబట్టికాని యోగ్యతనుబట్టికాని వచ్చు జాతిభేదమంతయు బంధకారణమే! "అదంతయు సత్యమే, ఆభావము లోపల నుంచుకొనవచ్చునుగాని పరస్పరసంబంధముగల బాహ్యప్రపంచమునమాత్రము జాతిభేదములవంటి భేదములు పాటింపకతప్పదు—అవి యత్యావశ్యకములు" అని కొందఱుమిత్త్రులు హితోపదేశము చేయుదురు. ప్రియత్నాభావరూపమైన పిఱికిపేడితనముతోఁ గూడిన యేకత్వభావము లోపల! పైని పరపీడారూపమైన నరకలోకపిశాచతాండవము! పరమదరిద్రులగు చండాలాదులకు మరణబాధ కలిగించుచు ధనవంతుఁడైన మాలవానిని మాత్రము "ఓహో! ఈయన మతపోషకుఁడు." అని పొగడుట!

మఱియొకమాట—గ్రంథములు చదివిచూడఁగా మతసంబంధమైన శిక్షణాభ్యాసములు శూద్రునకుఁ గానట్లు నాకుఁ జూపట్టుచున్నవి; ఆహారమునుగూర్చికాని విదేశయాత్రనుగూర్చికాని యతఁడు తనబుద్ధి నుపయోగించి వివేచించుకొను నెడల, నది యతనికి నిష్ప్రయోజనమగును, పరిశ్రమయంతయు వృథాశ్రమయగును. నేను శూద్రుఁడను, మ్లేచ్ఛుఁడను, ఆబాధ లన్నిటితోను నా కేపరిసక్తియులేదు. నాకు మాలకూడైననేమి? మ్లేచ్ఛభోజనమైననేమి? జాతిసంబంధమైన పిచ్చిమాటలన్నియుఁ బురోహితులు రచించిన పుస్తకములలో నున్నవిగాని పరమేశ్వరప్రకటితములైన పుస్తకములలో లేవు. తమపూర్వులు గావించిన మహాకార్యములఫలములను పురోహితులనే యనుభవింపనీ! నేనుమాత్రము ఎందునాశ్రేయస్సంతయునున్నదో యాభగవద్వాక్యము ననుసరించియే పోయెదను.

"పరోపకారమే పరమార్థము; తక్కిన నిత్యనైమిత్తిక బాహ్యకర్మాదులన్నియుఁ బిచ్చిచేష్టలు; కేవల స్వమోక్షసుఖాపేక్షకూడఁదప్పే!" అను నింకొకసత్యము నా కనుభవగోచరమైనది. సర్వమును ఇతరులకై త్యజించువానిదే మోక్షము. ఇఁక "నాకుముక్తి! నాకుముక్తి!" యని యహోరాత్రములు తలఁ బగులఁగొట్టుకొను తక్కినవారు తమ ప్రస్తుతక్షేమమునకును భావిశ్రేయస్సునకును గూడ భంగముగావించుకొని తిరుగులాడుచుందురు—ఇది స్వయముగా నేను పెక్కుపట్ల ననేకపర్యాయములు చూచినాను. ఈసంగతులన్నియు నాలోచించుకొనఁగా నీకు జాబు వ్రాయుటకు నాకు ధైర్యముచాలినదిగాదు. ఇన్నివిప్రతిపత్తు లున్నప్పటికిని నాయెడలఁగల నీమైత్రి చెడిపోకుండ నెప్పటియట్లే యున్నట్లు నీ కగపడుచో, నిజముగా అది నాకు మహానందకరమైన పర్యవసానమని నే భావించెదను.

భవదీయుఁడు

వివేకానందుఁడు.

# తప్పొప్పుల పట్టిక.

| పొరట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 23 | 10 | నవర్షా | నవర్షాం |
| 43 | 20 | యభిప్రాయము | యభిప్రాయము. |
| 46 | 18 | బావ్య | భావ్య |
| 50 | 21 | ‹బాగుగా‹ | బాగుగా |
| 62 | 8 | చుడిన | చుండిన |
| 64 | 1 | తిిప్పల | త్రిప్పల |
| 66 | 9 | ఛాయ | ఛాయ, |
| 78 | 17 | మాన్పిప | మాన్పింప |
| 82 | 21 | దేశమన | దేశమున |
| 88 | 20 | నుప్నవి | నున్నవి |
| 134 | 6 | జాస్ | జాన్ |
| 149 | 6 | నడపెడసు | నడపెదను |
| 178 | 25 | యాలొాచన | యాలోచన |
| 184 | 21 | నిస్సత్వ | నిస్సత్త్వ |
| 192 | 1 | భగప | భగవ |
| 197 | 17 | జాలిన | ‹జాలిన |
| 198 | 21 | పోయి | పోయిన |
| 225 | 11 | పథా | పదా |

కూచి నరసింహముచే రచింపఁబడిన గ్రంథములు.

## తెలుఁగు.

| | | |
|---|---|---|
| 1. | శ్రీరామకృష్ణపరమహంసచరిత్రము, ఆయన యుపదేశవాక్యములు (పద్యకావ్యము) | 0-12-0 |
| 2. | శ్రీగౌరాంగ(చైతన్య) స్వామి చరిత్రము. ప్రథమభాగము (పద్యకావ్యము) | 1- 4-0 |
| 3. | శ్రీగౌరాంగస్వామిచరిత్రము. ద్వితీయభాగము (పద్యకావ్యము) | 1- 4-0 |
| 4. | రూపలత—కల్పితకథ (నాటకము). | 0-14-0 |
| 5. | వనవాసి (సృష్టివైషమ్యనైర్ఘృణ్యతత్త్వబోధకమగు నాటకము.) | 0-12-0 |
| 6. | శ్రీవివేకానందస్వామిపౌరాణోపన్యాసచతుష్కము | 0- 8-0 |
| 7. | పురాణకథలు—ఇందు 6 వ నంబరులోని యుపన్యాసములును వివేకానందస్వామి ప్రశంసయును గలవు. | 0- 8-0 |
| 8. | శ్రీ వివేకానందస్వామి ప్రాక్పశ్చిమములు | 0-14-0 |
| 9. | శ్రీవివేకానందస్వామి భక్తియోగోపన్యాసములు | 0-10-0 |
| 10. | శ్రీవివేకానందస్వామి ద్వాదశోపన్యాసములు | 1. 8-0 |
| 11. | శ్రీవివేకానందస్వామి యతిగీతము | 0- 1-0 |
| 12. | ఆగ్నేయాశుగములు (పాల్‌రిచర్డుగారి యుపదేశములు, ఇంగ్లిషుమూలముతో—ద్విపద) | 0- 1-0 |
| 13. | ఆత్మనివేదనము (పద్యకావ్యము) ప్రపంచమునందలి పెక్కుప్రసిద్ధమతములిందు సవిమర్శముగఁ దెలుపఁబడినవి. | 1- 4-0 |
| 14. | ప్రహసనములు, పత్త్రికావిలేఖనములు | 0-12-0 |

కూ...వి నరసింహారావుగారు. ... Pithapuram E. Godavari

